# గ్రంథాలయములు



[ వ్యాసావళి ]

—

పాతూరి నాగభూషణం
ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి
మదరాసురాష్ట్ర గ్రంథాలయకమిటీ సభ్యుడు
దక్షిణభారత వయోజన విద్యాసంఘము
ఆంధ్ర ప్రాంతీయ కార్యదర్శి

ఆంధ్ర సారస్వత పరిషత్
హైదరాబాదు



డాక్టరు వి. యస్. కృష్ణగారు

బి. ఏ. (ఆక్సన్)., పిహెచ్. డి. (వియన్నా)



అంకితము

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

డాక్టరు వి. యస్. కృష్ణగారికి

# పుస్తకాల స్వయంవరం

స్వయంవరం - చాటించారోయ్
త్వరత్వరగా - పయనం కావోయ్
పుస్తకాల - బాలకుమారితో
నేస్తానికి - పోదాం పదవోయ్.

నినువలచిన - చదువుల చానతో
మనసిచ్చి - మాట్లాడాలోయ్
నీనచ్చిన - మాటలరాణికి
కానుక క - ట్టాలియ్యాలోయ్
స్వయంవరం - చాటించారోయ్
త్వరత్వరగా - పయనంగావోయ్.

నిలచిన యీ - కన్నెలలో నిను
వలచీ వల - పించిన దేదో
అందాల - అణువుకణాలా ?
ముందు వెనుక - మూడుగుణాలా ?
అందని ఆ - కాశం సొబగా ?
అందందూ - ఆరని వెలుగా ?
భూగోళం - పున్నెము పంటా ?
బాగోగుల - పాయని జంటా ?
సంగీతం - సాహిత్యాలా ?
శాస్త్రిలూ - చారిత్రాలా ?
వేదాలూ - వేదాంతాలా ?
పలుమతముల - భాగవతాలా ?
పల్లెటూరి - చల్లనిగాలా ?

చేతిపనుల – చైతన్యాలా ?
మితిమించిన – మతపిచ్చులలో
బ్రతికించే – పరమప్రేమా ?
చితికిన యీ – మానవహృదయం
అతికించే – సత్యాహింసా ?
నిలచిన యీ – కన్నెలలో నిను
వలచీ వల – పించిన దేదో !



ప్రతిచదువరి – తన చదువేదో
ప్రతి చదువుకు – చదువరి యెవరో
ఏ పుస్తక – మెవ్వరివంతో
యెరుకౌనే – రంగస్థలమోయ్
అందరికీ – అన్నిచదువులూ
అందుబాటు – లో ఉన్నాయోయ్
వందల కం – దని విజ్ఞానం
చందాతో – సాధించామోయ్.

అందాల – చదువుల కన్నెల
గ్రంథాలయ – సీమకు రావోయ్ !
స్వయంవరం – చాటించారోయ్ !
త్వరత్వరగా – పయనంకావోయ్ !

—శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం

# తొలిపలుకు

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శులును మన్మిత్రులును నగు శ్రీ పాతూరి నాగభూషణముగారి రచితములగు వ్యాసముల కూర్పగు నీ గ్రంథమునకు – "గ్రంథాలయములు [వ్యాసావళి]" యను దానికి – తొలిపలుకువ్రాయ నవకాశము నాకు లభించినందుకు ఎంతయు సంతోషించుచున్నాను.

ఇట్టి గ్రంథమును వెలువరించుటకు వలయు యోగ్యతయు అర్హతయు గలవారు శ్రీ నాగభూషణముగారికంటె మరియొకరెవరును ఉండరని చెప్పుటలో అతిశయోక్తి లేదని భావింతును. శ్రీ నాగభూషణముగారు గ్రంథాలయోద్యమమును ఆంధ్రదేశమున ప్రశంసనీయముగ నిర్వహించుచు, దివ్యమగు ననుభవమును గడించియున్న ప్రజాకార్యకర్తలు. ఏదైన నొకటే ప్రజాయుద్యమమున, చాలకాలము, ఎడతెగక స్థిరముగా నిలచి, పనిచేయు కార్యశూరులు అరుదుగానున్న మన దేశములో శ్రీ నాగభూషణముగారి సేవ అమూల్యమైనదని చెప్పదగినది.

మద్రాసుప్రాంతములోని తెలుగు జిల్లాలందలి యొక ప్రజాహితోద్యమమునకు తెలంగాణములోనుకూడ వ్యాప్తి కలిగించి, ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు విశాలాంధ్ర స్వరూపమును సృష్టించు ప్రయత్నమును జయప్రదముగా సాగించిన గౌరవము శ్రీ నాగభూషణముగారికి ఎక్కువగాను, ముఖ్యముగాను చెందుచున్నది. ఇది గొప్ప సేవయని నాకు నమ్మకము కలదు.

ఈ గ్రంథమునందు కూర్పబడిన వ్యాసములు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి చాల ఉపయోగకరములగు వివిధవిషయములకు సంబంధించియున్నవి. వీనిలో ననేకములు శ్రీ నాగభూషణముగారికి

కలిగిన స్వంత అనుభవముపైన నాధారపడినవిగా గానవచ్చుచున్నవి. కనుక ఇవి గ్రంథాలయోద్యమాభిమానులగు కార్యకర్తలకు అత్యంత లాభదాయకములుగా నుండగలవు. అట్టివారీ పుస్తకమును తప్పక చదివెదరు గాక !

ఈ పుస్తకము విశాలాంధ్రమున అభిమానముతో చదువబడు ననియు, మాతృభాషా సేవాపరాయణుడగు గ్రంథకర్త సర్వవిధముల ప్రోత్సహింపబడుననియు నేనాశించుచున్నాను.

ఆంధ్రకుటీరము
సుల్తాన్ బజారు, హైదరాబాదు
౧౬—౬—౧౯౪౧

విధేయుడు
మాడపాటి హనుమంతరావు
హైదరాబాదు కార్పొరేషను మేయరు

# పరిచయము

ప్రేమపాత్రులును, స్నేహితులును, నగు శ్రీ పాతూరి నాగభూషణం గారి "గ్రంథాలయములు" అను ౧౩౦ పుటల ముద్రిత గ్రంథమును చదివినాను. మొదట రచయితను గురించి సంగ్రహముగ తెలుపుట యవసరము. శ్రీ నాగభూషణంగారు నిరాడంబరులు. ఎటులో యేమో అందరును రాజకీయ రంగముపై కురుకుచుండిన కాలములో వీరు గ్రంథాలయోద్యమ మందిరుక్కొనిరి. ఆ యుద్యమాన్ని వరించిన నాడే 'నాతిచరామి' అని వాగ్దానముచేసి నట్లున్నది. వేరుద్యమములందు మనసుండి పనిచేసినట్లు కానరాదు. గ్రంథాలయ సేవలో మగ్నులై తన సేద్యమును మరచిపోయినారు. వీరికి కపటనాయకులు సరిపడరు. ప్రజాసంస్థల లెక్కలలో పైసా పొరపాటును సహింపరు. అట్టి 'సీధా మనిషి' వీరు (ఋజువర్తనులు). వీరిరచనలన్నియు గ్రంథాలయములను గురించినవే యని తలతును.

అట్టి రచనలలో ప్రకృతమీ సమీక్షలోనున్న "గ్రంథాలయములు" అనునదొక యుత్తమ రచనల సంపుటి. ఇది గ్రంథాలయముల చరిత్రను గురించి తెలుపుట లేదు. ఇందు గ్రంథాలయముల ప్రయోజనములు, వినియోగములు, పరిపాలన విధానము, ప్రచారము, వానిలోని వైవిధ్యము, మున్నగు బహువిషయముల పుస్తకరూపమునైనదై అతిసులభశైలి నందరికిని అర్థమగు రీతి కలిగినట్టిది.

ఆంధ్రదేశమునందు గ్రంథాలయోద్యమము ప్రాముఖ్యమందినట్టిది. తెలంగాణమందే యుద్యమము ౩౦ ఏండ్లక్రిందట ప్రారంభమై నానాటికి తీసికట్టుగా నుండిపోయెను. గ్రంథాలయోద్యమము నాయకులనుగాని విద్వాంసులనుగాని ప్రజలనుగాని ఆకర్షించినదికాదు. దానికనేక కారణాలు కలవు. ప్రజాబాహుళ్యమందు విద్యావ్యాపకము

లేకపోవుటయు రాజకీయములవలె గ్రంథాలయ ప్రచారము జనరంజకము కాకుండుటయు దీనికి ముఖ్యకారణములు.

పలువురు విద్యావంతులే సహకరించుటకు మారుగా పలుతావుల గ్రంథాలయముల శైథిల్యతకు తెలిసియో తెలియకనో తోడ్పడిరి. పలుతావులలో పుస్తకాలయములలోని గ్రంథాలు బయటికిపోయినవి తిరిగి రాకపోయెను. గ్రంథాలకు ద్రవ్యమిచ్చువారు కొందరు వాటిని తస్కరించువారు మరికొందరు. అందుచేతనే ౧౫౫౦ ప్రాంతమువాడగు తెనాలి రామకృష్ణుడు గ్రంథములకు అగ్ని, యాచకులు, క్రిములు ముఖ్యోపద్రవములనెను. అనేకులకు పుస్తకముల నెట్లు పట్టవలెనో యెట్లు వాడుకొనవలెనో తెలియదనవలెను. వారి చేతులలో గ్రంథములు నలిగి చినిగి మాసి రూపుచెడును. కొందరు పుస్తకాల అట్టలపై వడ్డీలెక్కలను గుణింతురు. మన దేశములో ననేక గ్రంథాల ముద్రణ మసహ్యముగా నుండుటచే మన మింకను చాలా వెనుకబడినామని అనిపించుకొన్నాము. గ్రంథము సుందరముగా సుందరివలె ముత్తైదువవలె అలంకరణముతో నొప్పియుండవలెను. గ్రంథమును పసికందునువలె నలగకుండ పట్టుకొని చదువవలెను. ప్రతిపాఠకుడును ఈధర్మమును నిర్వహించిన రెండేండ్లలో పొట్లాలకు పనికివచ్చు పుస్తకములు పదంతలకాలము వరకుండును.

ఇప్పుడు కాలముమారినది. వయోజనవిద్యను నిర్బంధవిద్యను వ్యాపింపజేసి అవిద్యానిర్మూలనము చేయుకాలమిది. విద్యావ్యాపకమగు కొలది గ్రంథాలయముల యుపయోగముకూడ హెచ్చును.

జనులు గ్రంథాలయములకు పోవుట దేవాలయములకు పోవునట్టి పవిత్ర కార్యమనుకొనవలెను. దేవస్వము హరించిన నెంతటి పాపమో గ్రంథముల యపహరణముకూడ నంతటిదేయని గుర్తించవలెను. దేవర యంగరంగ భోగార్థము ధూపదీప నైవేద్యములకై

చేయు దానములెంత ఫలవంతములో గ్రంథాలయములకు చేయు దానములును నెక్కువ కాకున్న నంతమాత్ర ఫలవంతములని భావింప వలెను. ఇవి క్రొత్తగా తెలుపు పలుకులుకావు. తక్షశిలా విద్యాపీఠ స్థాపన కాలమునుండి మనపెద్దలు సెలవిచ్చిన భావములేయివి. ప్రాతభావములను క్రొత్తమాటలలో చెప్పుటయే యిందలి విశిష్టత.

శ్రీ పాతూరివారి యీ గ్రంథము ప్రతిగ్రంథాలయమందును విద్యాలయమందును నుండదగినది. గ్రంథాలయాభిమానులందరును దీనిని జదివి యనేక నూతనవిషయాలను - నావలెనే - తెలిసికొని యానందింతురుగాక.

ఈ గ్రంథమును ముద్రించి ప్రచారము చేయునట్టి తెలంగాణా ఆంధ్రసారస్వత పరిషత్తు నిర్వాహకుల సరసత, ఔచితి, సేవా సనిపించుకొన్నవి.

రచయితకు ధన్యవాదములు. గ్రంథమునకు సుస్వాగతము.

సు ర వ ర ము ప్ర తా ప రె డ్డి
ఆంధ్రదేశ గ్రంథాలయసంఘోపాధ్యక్షుడు




# పీఠిక

గతసంవత్సరం జూన్ నెలలో ఆంధ్రసారస్వత పరిషత్తు వారేర్పాటు చేసిన వయోజనవిద్యా శిక్షణశిబిర నిర్వహణంలో పాలుపంచుకొనుటకై హైదరాబాదుకు వెళ్లియుంటిని. పరిషత్ పరీక్షలలో గ్రంథాలయ శాస్త్రాన్ని కూడ అభిమాన విషయాలలో నొక అంశంగా చేర్చువిషయమై పరిషత్కార్యదర్శి శ్రీ పులిజాల హనుమంతరావు గారితో ప్రస్తావించితిని. దీనికి పాఠ్యగ్రంథాలు రెండు కావలసి యుండునని వారుచెప్పిరి. నా "గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు"ను చూచి ఒకదాని క్రింద యిది సరిపోవుననిరి. రెండవదానిని వలయుచో వ్రాసియిత్తుననియు లేదా లోగడ పత్రికాదులలో ప్రకటితమైన గ్రంథాలయములకు సంబంధించిన వివిధవ్యాసములు నావి కలవనియు, ఇవి వారికి నచ్చినయెడల వీనిని ప్రచురించు కొనుటకు వారి కిత్తుననియు దెలిపితిని. వారంగీకారమును సూచించిరి. కనుక వారి పరిశీలన నిమిత్తము వీనిని తదుపరి పంపితిని. చూచి సంతృప్తిని పొందిరి. వీనిని పరిషత్తువారి వీలువెంట ప్రచురించుటకు ప్రచురణోపసంఘమువారి ఆమోదమునుబడసి నాకు తెలిపిరి. తదుపరి కొంతకాలానికి దీనిముద్రణకు కావలసిన కాగితమును నాకందజేసిరి. ఈ విధంగా ఈ పుస్తకంలోని వ్యాసాలు గ్రంథరూపంలో లోకం మొగం చూడడాని కవకాశం చిక్కినది.

ఈ వ్యాసాలు వివిధసమయాలలో రచించిన వగుటచేత వీని భాష ఒక తీరుగా లేదు. పూర్వం వ్రాసినవి గ్రాంథిక భాషలోనూ ఇటీవల వ్రాసినవి వ్యావహారిక భాషలోనూ వున్నవి. పాఠకులకు విషయం ప్రధానం గనుక భాషాభేదాన్ని దోషంగా యెంచక మన్నిస్తారని నమ్ముతున్నాను.

ఈ వ్యాసాలలో కొన్ని గ్రంథాలయసభలు - సమావేశాల సందర్భంలో రచించినవి. కొన్ని ప్రత్యేకం ఆయా ప్రచురణ కర్తల కోరికపై వ్రాసినవి. కొన్ని వ్యాసాలలో అవసరమైనచోట్ల కొలది పాటి మార్పులు చేయబడినవి. విషయసేకరణకు తోడ్పడిన సారస్వతం వివరాలు గ్రంథం కడపట నివ్వబడినవి. ఒక్కొక్క వ్యాసం చివర దానిరచనకు సహాయపడ్డ వాఙ్మయ వివరాలు విడివిడిగ నిచ్చు తలంపు ముందుండినది. కాని వీలుపడ లేదు.

## కృ త జ్ఞ త

గ్రంథాలయ ప్రబోధాని కుపకరించు 'పుస్తకాలస్వయంవరం' అనేగేయం ఇందు చేర్చబడినది. ఇది యీగ్రంథానికి ప్రత్యేకశోభను కల్పిస్తున్నది. దీనినిందులో చేర్చుట కనుమతించిన రచయిత శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరంగారికి నే నత్యంతము కృతజ్ఞుడను. కోరి నంతనే మిగుల ప్రేమతో తొలిపలుకు, పరిచయములను వ్రాసి పంపిన తెలంగాణపు గ్రంథాలయోద్యమ నాయకులు, పూజ్యులు నగు 'ఆంధ్ర పితామహ' శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులు, 'విజ్ఞాననిధి' శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగార్లెంతయు వందనీయులు. ఈ వ్యాసాలలోని విషయసేకరణలో సాయపడిన సారస్వత కర్తలకూ, అక్కడక్కడ విడివిడిగా నుండిపోయిన వ్యాసముల నొక్కటిగ గుదిగుచ్చి గ్రంథాలయకార్యకర్తలకందజేయుటకు పూనుకొన్న ఆంధ్ర సారస్వత పరిషత్తువారికీ, ఈ పుస్తకమునకు కళాకాంతులను సమకూర్చుటకు దోహదంగానున్న అట్టపై చిత్రమునకు మాతృకను వ్రాసియిచ్చిన శ్రీ నడిపల్లి శంకర్‌గారికీ, అచ్చు —

అట్టకట్టు బాధ్యతలను శ్రద్ధతో నిర్వహించిన సర్వోదయ ప్రెస్ వారికి నాకృతజ్ఞతను ప్రత్యేకముగ తెలుపుకొనవలసియున్నది. ఇందలి వ్యాసాలను తొలుదొల్త ప్రకటించిన ఆ యా పత్రికలయు, పుస్తకాలయు ప్రకటనకర్తల సహాయమును మరువరానిదే. అసలీ రచనల కాస్కారమును కలుగజేసిన వివిధసమావేశముల కర్తలు, వివిధ సంస్థల నిర్మాతలు సహిత మీ సందర్భమున స్మరించదగియున్నారు. ఈవిషయంలో ప్రత్యేకం పేర్కొనదగిన ముఖ్యసంస్థలు తెనాలి తాలూకా పెదపాలెమునందలి సేవాశ్రమము, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము నై యున్నవి. నా గ్రంథాలయసేవలో హెచ్చుభాగ మీ రెండుసంస్థలద్వారానే సాగినది.

## అంకితము

అదృష్టవశాత్తు యీ కృతికి అర్హుడైన భర్తలభించినాడు. ఇది నాకు చాలసంతోషముగా నున్నది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తున కిటీవల ఉపాధ్యక్షులుగా ఎన్నికైన డాక్టరు వి. యస్. కృష్ణగారు చిన్ననాటినుండియు గుణవంతులుగా గణుతి కెక్కినారు. విద్యావినయసంపన్నులు. వీరి యోగ్యతకు తగిన పదవులును కోరకుండగనే వీరిని వరించుచు వచ్చినవి. పదిపదునైదేండ్ల క్రితం వీరు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో మామూలు ఉపన్యాసకులుగ ప్రవేశించినారు. తదుపరి ఆ సంస్థకు రిజిస్ట్రారు పదవిని కొంతకాలము, విశ్వకళాపరిషత్ కళాశాలల అధ్యక్షపదవిని కొంతకాలము నిర్వహించి పరిషత్తుకు సంబంధించిన అన్ని వర్గములవారి అభిమానమును చూర

గొన్నారు. దీనిపర్యవసానంగా వీరు ఆంధ్రవిశ్వకళాపరిష దుపాధ్య క్షులుగా ఎన్నికైనారు. నా గ్రామస్థుడను అభిమానము, సుగుణ శీలుడను గౌరవము, ఆంధ్రదేపు మేటి విద్యాసంస్థకు అధిపతియను ఆదరము ప్రోత్సాహపరచగా నిండుమనసుతో నీ గ్రంథమును డాక్టరు వాసిరెడ్డి శ్రీ కృష్ణగారికి అంకితమిచ్చుటకు నిశ్చయించు కొన్నాను. వీరు దీనిని ప్రీతితో స్వీకరించి నన్ను సంతోష పెట్టుదు రని నమ్ముచున్నాను.

సర్వోత్తమభవనము
పటమటలంక
౧౩—౪—౧౯౪౧

ఇట్లు విన్నవించు,
పాతూరినాగభూషణం
గ్రంథకర్త

# విషయసూచిక

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| V | ౧౪ | విజ్ఞాసం | విజ్ఞానం |
| VII | ౯ | సుల్తాస్ బజారు | సుల్తాన్ బజారు |
| XI | ౧౪ | పరిశిలన | పరిశీలన |
| ౧ | ౧౫ | యెక్కుడు కాలము | యెక్కువ కాలము |
| ,, | ౧౬ | శాఖానిలయనిర్వహణ | శాఖానిలయముల నిర్వహణము |
| ౨ | ౧౬ | గించుకొనుట | యోగించుకొనుట |
| ౩ | ౧౮ | గ్రంథాలయముల | గ్రంథాలయములను |
| ౫ | ౧౫ | అప్పటినుండి | అప్పటినుండియు |
| ,, | ౧౬ | జనవంతముగుట | జనకరముగా నున్నందున |
| ౯ | ౨౫ | స్వకీయ ప్రకటనము | స్వీయప్రకటనమును |
| ౧౧ | ౧౩ | సాంఘి | సాంఘిక |
| ౧౩ | ౫ | సంఘముల | సంఘములను |
| ౧౪ | ౭ | సినిమా | సినీమా |
| ,, | ౨౬ | చెసినవే | చేసినవే |
| ౧౭ | ౨౪ | నెత్తిపైరుద్ది | నెత్తిపైరుద్దు |
| ౧౯ | ౨౧ | గోష్ఠులు యాత్రలు | గోష్ఠులు, యాత్రలు |
| ౨౦ | ౨ | గ్రంథాలయ వ్యాపనక్రియ | 'గ్రంథాలయ వ్యాపనక్రియ' |
| ,, | ౨౧ | స్రత్యేకము | ప్రత్యేకము |
| ౨౨ | ౧౦ | సకలజనుల | ప్రజానీకం |
| ౩౦ | ౨ | సంఘస్థాపననాటికి ౧౯౧౪ ఏప్రిల్ ౧౦వ తేదీ, | సంఘస్థాపన (౧౯౧౪ ఏప్రిల్ ౧౦వ తేది) నాటికి |
| ౩౩ | ౩ | ములగావించిరి. | ములనుగావించిరి. |
| | ,, | ఈ. తిర్మానముల | ఈ తీర్మానముల |
| ౩౪ | ౨౫ | గ్రంధాలను | గ్రంథాలను |
| ౪౦ | ౨౧ | నియమనిబంధన | నియమనిబంధనల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౫౩ | ౧౭ | గ్రంథవరణ | గ్రంథవరణం |
| ౫౯ | ౧౯ | పచారిదుకాణాలు | పచారీదుకాణాలు |
| ,, | ౧౨ | పెంపును | పెంపుకు |
| ౬౨ | ౧౫ | నెక్కుడుపయోగకర | నెక్కువ ఉపయోగకర |
| ౬౩ | ౧౩ | ఈసూత్రముల | ఈ సూత్రములను |
| ౬౪ | ౧౧ | స్వతంత్రుడైన | స్వతంత్రుడైన, |
| | ,, | యాభిరుచులను, | యాభిరుచులను |
| ౬౫ | ౧౦ | నెక్కుడు | నెక్కువ |
| ౬౯ | ౧ | ధర్మ్మమును | ధర్మము |
| ౭౧ | ౧౮ | పరిహారము | పరిహారమును |
| ౭౩ | ౮ | గ్రంథాలయా | పెద్దగ్రంథాలయా |
| ౮౧ | ౨౫ | రెంనుడు | రెండును |
| ౮౨ | ౧౫ | పెట్టుకున్నపిదప | తర్వాత 'షెల్ఫ్‌రిజిస్టరు పేటికలో ప్రచారములో నున్న గ్రంథముల కార్డులను కౌంటరువద్ద రికార్డును బట్టి నిలువుగా త్రిప్పి పెట్టుకొనవలెను. తర్వాత' అను మాటలను చేర్చవలెను. |
| ,, | ౨౧ | నార్థము | నిమిత్తము |
| ౮౩ | ౧ | విమర్శన | విమర్శ |
| ,, | ౨ | విమర్శనార్థము | విమర్శ కొరకు |
| ,, | ౧౭ | పరిచితమగుట | తెలిసియుండుట |
| ,, | ౨౦ | 4 | ౪ |
| ౮౫ | ౧౮ | సమితులు | సంస్థలు |
| ౯౫ | ౧౦ | కార్యమ్రానికీ | కార్యక్రమానికీ |
| ౯౮ | ౩,౪,౫,౬ | ౯౭వ పుట దిగువభాగమున పాదటిప్పణము (ఫుట్‌నోట్సు)గా చేర్చవలెను. | |
| ,, | ౩ | Praducts | Products |
| ,, | ౬ | Ceylou | Ceylon |
| ౧౦౩ | ౭ | నున్నప్పటికీన్నీ | నున్నప్పటికీ |
| ౧౦౫ | ౧౭ | గ్రథాలయసంస్థలపై | గ్రంథాలయసంస్థలపై |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౦౮ | ౯ | తేజస్సులబా | తేజస్సులవలె |
| ,, | ౧౦ | అందువలె | అంటుబా |
| ౧౧౩ | ౮ | (పోట్లర్లు) | (పోట్లర్లు) |
| ౧౧౯ | ౨౨ | సర్వసామాన్యమైన | సర్వసాధారణ |
| ౧౧౬ | ౩ | 'ప్రకటించడం ద్వారా' కు పిదప 'చేసే వ్యక్తిగత ప్రచారం' అను మాటలను చేర్చవలెను. | |
| ,, | ౫ | కుపకరిస్తున్నవి. | కుపకరిస్తున్నవి. |
| ,, | ౧౫ | సర్వజనులకూ | ప్రజలకు |
| ,, | ౧౬ | ప్రజలదృష్టికి | వారిదృష్టికి |
| ౧౨౦ | ౯ | కారుకపరడం | కారుకపరచడం |
| ౧౨౬ | ౬ | Referencce Servie | Reference Service |
| | ,, | bibliograply | bibliography |

" వాయువెల్లవారికి నెట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.
ఉదకమెల్లవారికి నెట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానమును నట్లు సేవ్యమైయుండవలయును.
సూర్యచంద్రమండలముల తేజస్సు
ఎల్లవారికి నెట్లు సౌఖ్యప్రదముగ నున్నదో
జ్ఞానమును నట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును."

# అమెరికాదేశ గ్రంథాలయము

అమెరికాదేశము ఆధునిక గ్రంథాలయమునకు పుట్టినిల్లు. ఆదర్శప్రాయమగు గ్రంథాలయముల కాలవాలమైన అమెరికా 'గ్రంథాలయభూమి' యని చెప్పబడుచున్నది. అమెరికాదేశ గ్రంథాలయము యొక్క పెంపు సహజసిద్ధముగ సంభవించినది. అది పట్టుదలతో ప్రత్యేకమొనర్చిన ప్రయత్నమువలనగాక ప్రజాభిప్రాయము ననుసరించి క్రమవికాసము జెందుచు వచ్చినది. జనసామాన్యమున విద్యాభివృద్ధి కలుగుటద్వారా పఠనాభిలాష పెంపొంది అది అచ్చటి గ్రంథాగార స్థాపనకు కారణమయ్యెను. తొలుత కొలదిమందికి మాత్ర మందుబాటులోనున్న గ్రంథాలయములు క్రమక్రమముగ నెల్లరకు నుపయోగపడజొచ్చినవి.

ఉపయోగమే గ్రంథాలయలక్ష్యమను సూత్రమును చాలకాల మునుండి గమనించుచున్న అమెరికాదేశీయులు గ్రంథాలయ నిర్వహణమున ననేకములగు మార్పుల నమలుజరిపిరి. దినమున వీలైనంత యెక్కుడుకాలము గ్రంథాలయములను తెరచియుంచుట, పుస్తకములను పత్రికలను పఠనార్థ మిండ్లకిచ్చుట, స్వేచ్ఛోపలబ్ధి (గ్రంథాలయమునందలి పుస్తకముల నెల్లరు స్వేచ్ఛగ చూచుకొని వలయు వానిని స్వయముగ తీసుకొను నేర్పాటు), పాఠశాలాది విద్యాసాంఘిక సంస్థలతోడి సహకారము, శాఖానిలయ నిర్వహణ, గ్రంథాలయములు పరస్పరము తమ పుస్తకముల నిచ్చి పుచ్చుకొనుట, సంచార ప్రచారములు మొదలుగాగల విధానముల నొక్క

టొక్కటిగ నచ్చటి గ్రంథాలయములు చేపట్టి, పుస్తకములకు పాఠకులకు మధ్య చక్కని పొత్తును సమకూర్చుచు, నచ్చటి సంఘము యొక్క వికాసమునకు సకలవిధముల తోడుపడు సాంఘిక కేంద్రములుగ విలసిల్లుచున్నవి.

## పూర్వ గ్రంథాలయములు

ఇన్నివిధములగు మార్పుల కాలవాలమై ప్రపంచమున కాదర్శప్రాయమైన అమెరికా గ్రంథాలయము పెంపొందినది ౧౯ వ శతాబ్దపు రెండవ అర్ధభాగమందయ్యు, నంతకుపూర్వమును నచ్చట గ్రంథాలయములు లేకపోలేదు. ౧౮ వ శతాబ్ద ప్రారంభమున అమెరికా యందు క్రైస్తవ దేవళములకు, పీఠములకు అనుబంధముగనున్న మతవిషయక గ్రంథాలయములు కొన్ని ముఖ్యముగ దక్షిణప్రాంతమున థామస్ బ్రే అనునాతనిచే నెలకొల్పబడినవి. థామస్ బ్రే బైబిల్ ప్రచారమునిమిత్త మేర్పడిన సంఘమునకు స్థాపకుడును, కార్యదర్శియునై యుండెను. ఈ గ్రంథాలయములు క్రీస్తుమత ప్రచారకుల నిమిత్త మేర్పరుపబడినను తక్కినవారును వినియుపగించుకొనుట కవకాశములు కల్పింపబడెను.

అనంతరము సుమారొక నూరు సంవత్సరములకు పట్టణ గ్రంథాలయములు, పాఠశాలాప్రాంత గ్రంథాలయములు ప్రారంభమైనవి. ఇందు రెండవరకమునకుజెందిన గ్రంథాలయములు పట్టణములలో నొక్కొక్క పాఠశాల పనిచేయు ప్రాంతపు జనుల ఉపయోగార్థ మేర్పాటు చేయబడెడివి. వయోజనుల కుపకరించు గ్రంథములే వీనియందెక్కువగ నుండెడివి. పాఠశాలాభవనములందే ఇవి భద్రపరుపబడెడివి.

ఉద్యోగులకు, విద్యార్థులకుమాత్రమేగాక సంఘమునందలి చదువుకొన్నవారందరికి నుపయోగించు కళాశాల గ్రంథభాండాగారములును అప్పుడు కొన్ని పనిచేయుచుండెను. చందాదారులకుమాత్రముపయోగపడు నొకరకపు సార్వజనిక పుస్తకాలయములును అప్పటి కమలునందుండెను.

## సార్వజనిక గ్రంథాలయపు పుట్టుక

ఇంతవరకు చెప్పబడిన పూర్వ గ్రంథాలయము లన్నియు ప్రభుత్వ సంబంధ మంతగాలేక వ్యక్తుల ప్రోత్సాహముపైననే నెలకొల్పబడి పనిచేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట ౧౮౪౮ వ సంవత్సరములో మెసాచుసెట్సు రాష్ట్రమునగల బోస్టన్ నగరమున సార్వజనిక గ్రంథాలయము నిర్వహించు నిమిత్తము వత్సరమునకు ౫ వేల డాలర్లు వసూలుచేయు నధికారము చట్టముద్వారా సంప్రాప్తమయ్యెను. తత్ఫలితముగ ౧౮౫౪ వ సంవత్సరమందు బోస్టన్ నందొక గ్రంథాలయము స్థాపింపబడెను. పై శాసనము ౧౮౫౧ వ సంవత్సరములో నా రాష్ట్రమునగల మిగిలిన పట్టణములకును అనువర్తింపబడెను. ఇట్టిచట్టములే క్రమక్రమముగ అమెరికాయందలి అన్నిరాష్ట్రములలోను వ్యాపించి తద్వారా అచ్చటి పట్టణములలో చాలభాగము గ్రంథాలయముల స్థాపించి పోషింపసాగెను. ఈయుద్యమమునకు ౧౮౭౬ వ సంవత్సరములో స్థాపింపబడిన అమెరికాదేశ గ్రంథాలయసంఘము చాలవరకు సాయపడెను.

ఇట్లేర్పడిన చట్టములు పట్టణవాసులకేగాక పల్లెప్రజలకును నుపయోగించుటకగు నేర్పాటు లనంతరము కొంతకాలమునకు చేయబడెను. జనపదప్రాంతములును తమతమ గ్రంథాలయములను స్థాపించి నడుపుకొనుట కనుకూలముగ చాలరాష్ట్రములు శాసనముల

గావించెను. అచ్చటచ్చట కేంద్రములందు నిర్మింపబడిన శాఖానిలయములద్వారాను, మోటారుబండ్లపై పంపబడు సంచార గ్రంథాలయములద్వారాను పల్లెప్రజలకు పుస్తకముల నందజేయుచు నగరములతోపాటు గ్రామములకును అమెరికా గ్రంథాలయము లుపయోగపడుచున్నవి.

## గ్రంథముల నిండ్లకిచ్చుట

ఈవిధముగ నేర్పడిన శాసనముల ననుసరించి ప్రజలు పన్నుల రూపమున గ్రంథాలయములకు పోషణనిచ్చి తన్నిర్వహణమునకు సాయపడుచుండ వాని నిర్వాహకులును తత్ప్రయోజనమును పూర్ణముగ ప్రజల కెల్లరకు నందజేయు సంకల్పముతో వానిని సాగించిరి. ఇందునిమిత్తము చేయబడిన మార్పులలో మొదట చెప్పదగినది పాఠకులకు పుస్తకములను పఠనార్థ మిండ్లకిచ్చుట. ఈపద్ధతి చిన్న గ్రంథాలయములందును, చందాపద్ధతిని నడుపబడిన భాండాగారములందును చాలకాలము అమలునందున్నను, పరిశోధనాది కార్యములకుపకరించు పెద్దపెద్ద గ్రంథాలయములందు మొన్నమొన్నటివరకు ప్రవేశించలేదు. ఇప్పటికిని నిది గ్రంథాలయమందున్న పుస్తకములలో కొంతభాగమునకుమాత్రమే వర్తించుట కొన్నిగ్రంథాలయములందు మనము చూడవచ్చును. చదువరులసౌకర్యములను గమనించి పాలకులు నిర్ణయించు కొన్ని గ్రంథములు * గ్రంథాలయమునుండి బయటకీయబడకున్నను నిప్పు డమెరికాయందలి సార్వజనిక గ్రంథాలయములన్నియు చదువరులకు పుస్తకముల నిండ్ల కిచ్చుచున్నవి.

* ఆచూకీ గ్రంథాలు. వివరాలు 'గ్రంథాలయాలు— ఆచూకీశాఖ' అనే వ్యాసంలో నున్నవి.

## స్వేచ్ఛోపలబ్ధి

'స్వేచ్ఛోపలబ్ధి' విధానము చిన్న గ్రంథాలయములకు దప్ప పెద్దపెద్ద భాండాగారములలో నమలుజరుపుట సాధ్యముకాదను తలంపు చాలకాల ముండెడిది. ౧౮౭౭ వ సంవత్సరములో లండను నగరమున జరిగిన గ్రంథాలయ మహాసభలో అమెరికాదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శియగు మెల్విల్ డ్యూయీ సహిత మీపద్ధతిని నిరసించెను. ౧౮౮౮ వ సంవత్సరములో అమెరికాదేశ గ్రంథాలయ సంఘసభయం దీవిషయమై మొట్టమొదట ప్రస్తావింపబడి గ్రంథాలయమునందలి కొన్ని భాగములకు మాత్రమే ఇది వర్తింపజేయ వచ్చునని దీని యనుకూలురచే తీర్మానింపబడెను.

ఈ విధానమును అమెరికాయందు ముందుగా నమలుజరిపినది 'క్లెవ్‌లాండ్ పబ్లిక్ లైబ్రరీ' యని తెలియుచున్నది. ౧౮౯౪ వ సంవత్సరపు పై గ్రంథాలయ నివేదిక అన్నివేళల, నెల్లవారును గ్రంథాలయమందలి పుస్తకముల నన్నింటిని, నిరాటంకముగ దర్శించుట కేర్పాటులున్నట్లు తెలిపినది. అప్పటినుండి యీ విధానము ప్రయోజనవంతమగుట, జనాంగీకారమును బొంది నేడమెరికాయందలి గ్రంథాలయము లన్నింటను పూర్ణముగ నమలు జరుగుచున్నది.

## బాలశాఖ

౧౮౩౭ వ సంవత్సరములో బాలుర గ్రంథాలయ మొకటి లెగ్జింగ్టన్ పట్టణమున స్థాపింపబడెను. న్యూయార్కునగరమున ౧౮౮౫ వ సంవత్సరములో ప్రారంభమైన బాలుర గ్రంథాలయము అచ్చటి సార్వజనిక పుస్తకభాండాగారము యొక్క బాల శాఖగ పరిణమించెను. ౧౮౯౦ వ సంవత్సరములో 'బ్రూక్లిన్ సార్వజనిక

గ్రంథాలయము' పిల్లలనిమిత్త మొక పఠనాలయమును ప్రారంభిం చెను. ఇట్టి బాలశాఖలు నేడమెరికాదేశ మందంతటను వ్యాపించి యుండుటయేగాక వీనిని నడపుటకు ప్రత్యేకము గ్రంథాలయ శిక్ష ణమును బడసిన వనితలు నియోగింప బడుచున్నారు. పిల్లల విష యమై, బాల శాఖలలో పనిచేయదగు భాండాగారుల శిక్షణవిష యమై అమెరికా గ్రంథాలయములు చూపు శ్రద్ధ అచ్చటి గ్రంథాల యోద్యమమునకు ప్రత్యేక లక్షణముగ నెన్నదగియున్నది.

## పాఠశాలా సహకారము

గ్రంథాలయములకు విద్యాలయములకు మధ్యనుండవలసిన సంబంధమును చాలకాలమునుండియు నమెరికాదేశ గ్రంథాలయ ములు గుర్తించియుండెను. పాఠశాలా గ్రంథాలయములు, పాఠ శాలాభవనములందుంచబడిన గ్రంథభాండాగారములు నచ్చట పూర్వ మునుండియు పనిచేయుచుండెను. అయినను సార్వజనిక గ్రంథా లయములు పాఠశాలోపాధ్యాయుల సహకారముతో క్రమపద్ధతిని పనిచేయవలయునను సంకల్పము నూతనముగ కలిగినదే.

## శాఖానిలయములు

పట్టణములందుగాని, పల్లెప్రాంతములలోగాని ఒక పెద్ద గ్రంథాలయము స్వయముగ నొక విశాలభూభాగమున నుపకరించుట సాధ్యము గానందున, చదువరుల ఉపయోగము నిమిత్త మచ్చట చ్చట కొన్ని కేంద్రములలో శాఖానిలయము లేర్పాటు చేయబడి నవి. ఇవి రెండువిధములు. ప్రత్యేక భవనములలో పుస్తకములు భద్రపరుపబడి, వానిని సక్రమముగ నుంచి చదువరుల కందించదగు సిబ్బందితో కూడి, సర్వలక్షణ సమన్వితములగు భాండాగారములు మొదటి తెగకు చెందినవి. అట్లుగాక పదుగురు సామాన్యముగ చేరు

స్థలములందు కేంద్ర గ్రంథాలయమువారిచే స్వయముగాని, లేక వారి పక్షమున తదితరులచేగాని వారమున కొన్నినాళ్లు లేక దినమున కొంతికాలము చదువరులకు పుస్తకము లందజేయు నేర్పాటుగలవి రెండవరకమునకు చెందినవి. వీనినే ఆంగ్లమున 'డెలివరీస్టేషను' లందురు. సాధారణముగ స్థానికబ్యాంకు, పోస్టాఫీసు, స్కూలు మున్నగు స్థలములు డెలివరీస్టేషను కేంద్రములుగ నేర్పాటు చేయబడును.

న్యూయార్కు మొదలుగాగల రాష్ట్రములందు కేంద్ర గ్రంథాలయముల కేవిధమునను సంబంధించని చిన్నచిన్న భాండాగారము లచ్చటచ్చట కొన్ని వలసి స్వతంత్రముగ పనిచేయుచున్నవి. ఇవి నిజమునకు పై సంస్థలకు విరుద్ధముగనున్నను పరిమాణసామ్యము ననుసరించి శాఖాలయములుగ పరిగణింప బడుచున్నవి.

## సంచార గ్రంథాలయములు

అమెరికాదేశమందలి ముఖ్యగ్రంథాలయములెక్కువగ నగరములందును, కేంద్రస్థలములందును నుండి మారుమూలలగల పల్లె జనుల కందుబాటులో లేని కారణమున, అట్టివారినిమిత్తము సంచార గ్రంథాలయములు దేశమంతటను తిరిగి చదువరులకు పుస్తకముల నందజేయుటకై యేర్పాటు చేయబడినవి. పూర్వకాలపు పాఠశాలా ప్రాంతీ గ్రంథాలయములు సంచారగ్రంథాలయములుగ పనిచేసినవి. చదివిన పుస్తకముల నప్పటప్పుడు మార్చి వానికి బదులుగ క్రొత్త పుస్తకముల నిచ్చుచుండెడివారు. తదుపరి ౧౮౯౨ వ సంవత్సరములో మిచిగాన్, వాషింగ్టను రాష్ట్రములును ౧౮౯౬ లో అయోవా రాష్ట్రమును సంచారగ్రంథాలయ నిర్వహణమున కుపకరించు శాసనములను గావించినవి. ౧౮౯౬ వ సంవత్సరములో 'ఫిలడల్ఫియా

ఫర్స్ట్ గ్రంథాలయము' సంచార గ్రంథాలయములను ప్రారంభించెను. ౧౯౨౭ వ సంవత్సరములో 'న్యూయార్కు ప్రచార గ్రంథాలయము' వారు సంచార గ్రంథాలయ శాఖనొకదాని నేర్పాటుచేసిరి. ఇది తదుపరి 'న్యూయార్కు సార్వజనిక పుస్తకభాండాగారము' యొక్క సంచార గ్రంథాలయ కార్యాలయముగ మారెను. ఇట్లీవిధాన మన్ని ప్రాంతములకును వ్యాపించి స్థిరపడిపోయినది.

సర్వసాధారణముగ పెద్దపెద్ద మోటారుకారులు సంచార గ్రంథాలయముల నిమిత్త ముపయోగింపబడుచున్నవి. ఈ విధానము కొలదికాలముక్రిందటనే ప్రారంభింపబడియు జానపదుల కెంతయు మేలొనగూర్చుచున్నది. కేంద్ర గ్రంథాలయమునుండి మోటారులపై పుస్తకములను తీసికొనిపోయి దూరదూరమున గ్రామములందు నివసించు జనమునకు ఇండ్లకడనే వారికి వలయు గ్రంథముల నందజేయుట అమెరికా యందలి చాలరాష్ట్రములలో నిప్పుడు జరుగుచున్నది. శాఖానిలయములకు మించి యీ సంచారభాండాగారములు చదువరులకు కావలసిన పుస్తకముల నిల్లు వెడలకుండగనే అందజేయుచు ప్రశంసనీయముగ పనిచేయుచున్నవి. పాఠకులు జాబుద్వారాగాని, టెలిఫోను ద్వారాగాని తమకు వలయు గ్రంథములను తెలిపిన చాలును. నిర్ణీతదినమున కవి వారి యింటికడ ప్రత్యక్షమగును.

## గ్రంథాలయ ప్రచారం

ఒక దుకాణమునందలి వస్తువులు బాగుగ విక్రయమగుటకు విస్తారమగు ప్రకటన మెట్లవసరమో గ్రంథాలయమందలి గ్రంథములు ప్రజలలో వ్యాపించుటకు చక్కని ప్రచార మావశ్యకము. ఈ విషయమును గ్రంథాలయ నిర్వాహకు లిటీవలనే గ్రహించిరి. గ్రంథాలయ క్షేత్రమున ప్ర చా ర ప ద్ధ తి నూతనము గాకున్నను,

దాని ఆవశ్యకత కొలది కాలమునుండియే గుర్తింపబడుచున్నది. గ్రంథపట్టికలు, మాసిక సమాచారపత్రములతో ప్రారంభించి, నేటి అమెరికా గ్రంథాలయములు తమ కార్యక్రమమునకు సంబంధించిన గోడలపై అంటించు పెద్దపెద్ద ప్రకటనలు, చిత్రపటములతో కూడిన చిన్నచిన్నపుస్తకములు, కరపత్రము లాదిగాగల ప్రచురణములను విరివిగా ప్రకటించుచున్నవి. సినిమాలలో గ్రంథాలయ చిత్రములు, రేడియోలలో భాండాగార ప్రకటనలు, పత్రికలలో పుస్తకాలయ సమాచారములు నేడచ్చట విరివిగా కానవచ్చుచున్నవి. గ్రంథాలయ వార్షికోత్సవములు, ప్రేక్షకనిశలు, గ్రంథసప్తాహము లాదిగాగల యితరవిధానములు గ్రంథాలయావరణమందును, ఇతర స్థలములలోను నిరంతరము జరుగుచు వింతవింతలగు ప్రదర్శనముల మూలమున గ్రంథాలయ ప్రయోజనములను, వానిపద్ధతులను ప్రజల కెరుకపరచి వారి దృష్టిని గ్రంథాలయముల వైపున కాకర్షించుచున్నవి. మఱియు నింటను బయటను గ్రంథప్రచారమున కనుకూలించునట్టి ఉపన్యాసముల యేర్పాటు, పత్రికలలో గ్రంథాలయ వార్తల, గ్రంథాలయ విషయక వ్యాసముల ప్రచురణ, పెద్ద పెద్ద భాండాగారములందు ప్రత్యేక ప్రచురణాధికారుల నియామకము, గ్రంథాలయ ప్రచారసంస్థలచే గ్రంథాలయ ప్రచారమునకు సంబంధించిన శాస్త్రీయ గ్రంథముల ప్రచురణ, గ్రంథాలయ సంఘముల యాజమాన్యమున తయారు చేయబడు ప్రకటన చిత్రములు ఆకర్షణీయమగు తమ నిత్య నూతన విధానముల ద్వారా గ్రంథాలయ ప్రచారమునకు కొనరాని దోహదము నొసగుచున్నవి. వీనికిమించి అచ్చటి గ్రంథాలయముల ప్రయోజనమును బొందు చదువరులు స్వయముగ నచ్చటి గ్రంథాలయ ప్రచారమునకు చక్కని చేయూత నిచ్చుచున్నారు. ఇట్లమెరికా గ్రంథాలయములు విరివిగా స్వకీయ ప్రకటనము గావించుకొనుచు ప్రపంచమున సాటిలేని ప్రచారమునకు పేరుబడసినవి.

## సాంఘిక కేంద్రము

నేటి అమెరికా గ్రంథాలయములు సాంఘిక కేంద్రములుగ తమ ధర్మము చక్కగ నిర్వహించుచున్నవి. వ్యక్తిగతముగను, సామూహికముగను అవి సంఘీయుల కన్నివిధముల సాయపడుచున్నవి. సంఘమునందలి చదువరులను, గ్రంథాలయమునందలి పుస్తకములను జాగ్రత్తగ పరిశీలించి ఒక్కొక్కరి అవసరము, శక్తి, అభిరుచులకు తగిన గ్రంథములతో వారికి సంబంధమును కల్పించుట అచ్చటి గ్రంథాలయముల ప్రధాన కర్తవ్యముగ నెంచబడుచున్నది. మఱియు చదువరులు కోరు వివిధములగు సందేహములను పరిష్కరించి వారికి వలయు సలహాల తెలియజేయుటయు నచ్చట జరుగుచున్నది. గ్రంథాలయమునందలి ప్రతి పుస్తకమునకు నొక చదువరిని సంఘమందలి ప్రతివ్యక్తికి తన గ్రంథమును అందజేయవలసిన ఆధునిక గ్రంథాలయధర్మము అమెరికాయం దిప్పు డాచరణయందున్నది. ఈ ముఖ్యధర్మము సరిగ నిర్వహింపబడుటకే అమెరికా గ్రంథాలయములు బాగుగ చదువుకొని, గ్రంథాలయ నిర్వహణమున సుశిక్షితులై, అనుభవము, సంఘసేవాభిలాష గలవారినే గ్రంథపాలకులుగ నియమించుచున్నవి. ఇంకను పెద్ద పెద్ద గ్రంథాలయములలో చదువరులకు తోడ్పడు నిమిత్తము 'చదువరుల సలహాదారులు'-ఒక్కొక విషయములో మంచి పాండిత్యముగల ప్రవీణులు - ప్రత్యేకముగ నియమింపబడుచున్నారు. ఈ ప్రవీణు లొక్కొక్కరు తమ అభిమానవిషయమునకు సంబంధించిన శాఖలను నిర్వహించుచుందురు.

అమెరికాయందు గ్రంథాలయ నిర్వహణ మొక శాస్త్రముగ, వృత్తిగ పరిగణింపబడుచున్నది. అచ్చట పట్టభద్రులకు గ్రంథాలయనిర్వహణమున శిక్షణ నొసంగు నిమిత్తము ప్రత్యేక పాఠశాలలు నిర్వహింపబడుచున్నవి. దినదినము వందలాదిగ వెలువడు గ్రంథములు, పత్రికలు, కరపత్రములు మొదలుగాగల ప్రచుర

ణాలను విషయము ననుసరించి 'డ్యూయీ దశాంశ వర్గీకరణ పద్ధతి' ప్రకారము వేరుపరచి అరలలోనుంచు నేర్పాటును - పుస్తకములు, తత్కర్తలు, అందలి విషయములను బట్టి అకారాదిగ తయారుచేయ బడిన గ్రంథపట్టికలును పై గ్రంథాలయధర్మము నమలు జరుపు టలో గ్రంథపాలకులకు, చదువరులకు కూడ చాల సాయపడు చున్నవి. మఱియు ఆధునిక శాస్త్రపద్ధతులద్వారా చదువరుల యొక్కయు, సిబ్బందియొక్కయు విలువయగు కాలము వృథాగా కుండు నేర్పాటులును అచ్చట నమలు జరుగుచున్నవి.

ఇంక సామూహికముగ నమెరికా గ్రంథాలయములు గావించు సేవను పరికింతము. అచ్చటి గ్రంథాలయ భవనములందు పుస్తకములను, వాని పట్టికలను నుంచుటకును, పఠనార్థము గ్రంథా లయమున కరుదెంచు చదువరుల సౌకర్యముల నిమిత్తమైన యేర్పా టులేగాక, అప్పుడప్పుడు జరుగు సాంఘిక సమావేశముల నిమిత్తము ఉపన్యాసమందిరపు టేర్పాటులును గలవు. గ్రంథాలయ పరిసర ములలోనున్న విద్యా, సాంఘిక, మతవిషయకాది సంఘముల సమా వేశములును, ఇతరములగు పండుగలును, విజ్ఞాన సంబంధమగు నుప న్యాసములును, ప్రదర్శనాదికమును నచ్చటి గ్రంథాలయ భవనము లందు జరుగుచుండును. ఇట్లు సంఘ జీవితమునకు సకలవిధముల సాయపడుచు, అమెరికా గ్రంథాలయము ఆదర్శగ్రంథాలయమై తనరారుచున్నది.

## ప్రజల తోడ్పాటు

అమెరికా గ్రంథాలయము దినదిన ప్రవర్ధమానమగు తన కార్యవిధానముచే ఆదర్శగ్రంథాలయముగ మారినది. ఇందుకు అచ్చటి రాష్ట్రీయ గ్రంథాలయ శాసనములును, ఆండ్రూకార్నిజీ వంటి ఉదారుల అసమాన సహాయ సంపత్తియు చాలవరకు దోడ్పడి

నవి. నేడచ్చట ధర్మగ్రంథములు, ఉదాత్త గ్రంథజాలములేని గ్రంథాలయములు చాలతక్కువ. అమెరికా గ్రంథాలయములకు గ్రంథ ధన రూపకమగు సాయము కోటీశ్వరులనుండియు, ఐశ్వర్యవంతులనుండియు మాత్రమే సమకూడుటలేదు. నేడచ్చటి విశ్వవిద్యాలయములు, గ్రంథాలయములు, కళామందిరములు, వస్తు ప్రదర్శనశాలలు ప్రజా సామాన్యమునుండి విరాళములను గ్రహించుట పరిపాటిగానున్నది. విజ్ఞానముపట్లను, కళలపట్లను ప్రజలకుగల ఆదరాభిమానము లే దీనికి కారణము.

## గ్రంథాలయ సంఘములు

ఇట్టి సందర్భములు సహజముగ నమెరికాయందు సిద్ధించుచున్నను, నీయన్నిటికిని దోహదమొసగి అగ్నికివాయువువలె, అమెరికా గ్రంథాలయోద్యమాభివృద్ధికి అచ్చటి గ్రంథాలయ సంఘములు మొదటినుండియు నెన్నోవిధముల సహాయకారు లగుచున్నవి. ఎడతెగని తమ కార్యకలాపముచే నీసంఘములు గ్రంథాలయములకు జీవ వికాసముల ప్రసాదించుచున్నవి. తమ ప్రచురణల ద్వారాను, సలహాలద్వారాను, ప్రదర్శనోపన్యాసముల ద్వారాను, వార్షిక సమావేశములద్వారాను గ్రంథాలయముల కీసంఘములు సాయపడు పద్ధతి వర్ణనాతీతము. ఈ సంఘముల సహాయసంపత్తి లేక అమెరికా దేశ గ్రంథాలయము లిప్పటి యుచ్చదశకు వచ్చియుండవన్న నతిశయోక్తి కాజాలదు. యావదమెరికాఖండమున పనిచేయుట కేర్పడిన అమెరికాదేశ గ్రంథాలయసంఘము, దాని అంతర్భాగములుగను, అనుబంధములుగను నడుపబడు రాష్ట్రీయ గ్రంథాలయ సంఘము లే గాక ప్రత్యేకము మరి నాలుగు న్యాయశాస్త్ర భాండాగారికులయు, లైబ్రరీ కమీషనరులయు, రాష్ట్రీయ భాండాగారులయు, ప్రత్యేక గ్రంథాలయ పాలకులయు జాతీయ గ్రంథాలయ పరిషత్తులును,

అనేక తావులలో వెలసి పనిచేయు స్థానిక గ్రంథాలయ క్లబ్బులును నచ్చట గలవు. ఇవన్నియు జేరి అమెరికాదేశ గ్రంథాలయోద్యమము నకు గలిగించుబల మపారము. సంఘశక్తిని సంపూర్ణముగ గ్రహించిన అమెరికాదేశీయులు తక్కిన జీవితశాఖలందు వలెనే గ్రంథాలయ సంబంధముగను చక్కని సంఘముల స్థాపించుకొని వానిద్వారా నీయు ద్యమమునకు సాటిలేని చేయూతను సంపాదించుకొనుట జగద్విదితము. ఇది మనకు చక్కనిపాఠము.

— —

# గ్రంథాలయము - విద్యాలయము

"గ్రంథాలయము బడి విడిచిన యనంతరపు పాఠశాల. ఇది పాఠశాల విద్యలో నుండు లోపములను పూరించేయుటయే గాక జీవయాత్ర కనువగు విద్య నిచ్చి జ్ఞానమును పూర్తిచేయును."

ప్రపంచమున నిప్పుడమలునందున్న విద్యాప్రచార సాధనములలో నెక్కువ వ్యాప్తిగాంచినవి విద్యాలయములు, గ్రంథాలయములు నై యున్నవి. విజ్ఞానవ్యాప్తికి తోడ్పడు రేడియో, సినిమా, ఉపన్యాసాది ఆధునిక విధానములును, నాటకము, పురాణ కథా కాలక్షేపము లాదిగాగల పురాతన సాధనములును, ప్రపంచమున విరివిగ ప్రచారమునందున్నను గ్రంథాలయ విద్యాలయములవలె నివి నిశ్చిత మైన ప్రణాళికల ననుసరించి నడుపబడుటలేదు. మరియు వీనిలో జాలభాగము గ్రంథాలయ విద్యాలయముల కనుబంధముగ నేడనేక తావుల నిర్వహింపబడుట పలువురెరిగిన విషయమే.

ఇతరదేశములందువలెనే మన భూమియందును వ్రాత తెలి యని కాల మొకటి యుండినది. ఇచ్చట లిపి వ్యాప్తిలో లేని కాలమున విజ్ఞానము గురుశిష్య పరంపరగ కంఠస్థము చేయబడి మనోఫలకములపై వ్రాయబడుచుండెడిది. అద్భుత మేధాశక్తి సంపన్నులగు నాటి విద్యార్థులు తమ గురువులముఖతః వినిన యనేక విషయముల బొల్లుపోకుండ జ్ఞప్తియందుంచుకొనువారు. మఱియు శాస్త్రములన్నియు నాదినములలో చిన్నిచిన్ని సూత్రములలో నిమ డ్చబడి జ్ఞప్తియందుంచుకొనుటకు సుకరముగ నుండెడివి. ఇప్పటి గ్రంథములలో కొన్ని పేజీలు నిండు విషయమును క్లాలది వాక్యములలో నిముడు నట్లేర్పాటు చేసినవే నాటిసూత్రములు.

కాలముమారి వ్రాత యమలునకు వచ్చిన తదుపరి వ్రాయుట చదువుట విద్యాభ్యాసమున కవసరములయ్యెను. దీనితో వ్రాత చదువుల కవసరములైన పరికరములును నెమ్మదిగ నమలులోనికి వచ్చెను. కొయ్యపలకలు, పిమ్మట రాతి రేకుపలకలు, ప్రస్తుతము కాగితములు వ్రాతకును–ముందు రాగి శిలాశాసనములు, అనంతరము భూర్జ తాళపత్రములు, ప్రస్తుతము కాగితములు తరతరములవారు చదువుకొనుటకై వినియోగపడు గ్రంథనిర్మాణమునకును క్రమముగా వాడ బడుచు వచ్చినవి. వేలకొలది ప్రతుల నత్యల్పకాలములో దయారుచేయగల యచ్చువిధాన మాచరణకువచ్చుటతో బూర్వము వలె నన్నివిషయములను జ్ఞాపకముంచుకొనవలసిన యవసరముతొలగి నది. దీనితో నిప్పటి విద్యార్థులందు అలవాటులేకనో మఱెందువల ననో ధారణాశక్తియు సన్నగిల్లినది.

విద్యాబుద్ధులు లేతవయస్సులోనే యలవడవలయును. అందు వలననే చిన్నతనములోనున్న బాల బాలికల కొఱకు విద్యాలయము లేర్పడి చదువునేర్పుటకై కృషిచేయుచున్నవి. నాగరకదేశములన్నిం టను నిర్బంధోచిత ప్రాథమిక విద్యావిధానము లమలుజరుగుచున్నవి. మనకు బానిసత్వము వదలినను దేశములోని జనము పూర్తిగా విద్యావంతులగుట కెంతకాలము పట్టునో చెప్పజాలము. చిన్నతన ములో బడికిపోయి చదువుకొను వారిలోను పలువురు బడివదలిన కొంతకాలమునకు తమచదువులను మరచిపోవుట సంభవించుచున్నది. ఆర్థికలోపము, తీరికలేకపోవుట మూలమున పేదలైనవారు హెచ్చు కాల మీ పాఠశాలలలోజేరి చదువజాలకున్నారు.

పైనజెప్పిన కారణములవలన గలుగు లోపములను దీర్చి కొంత వరకు చదువను వ్రాయను నేర్చినవారు బడిమానినపిమ్మట దానిని మరచిపోకుండ నభివృద్ధిజేసికొనుటకును, బ్రతుకుదెరువుకై వృత్తుల లోను ఉద్యోగములందును ప్రవేశించువారికి తీరికసమయములలో

కాలక్షేపమునకును, తమతమ పనులయందు మధ్యమధ్యగలుగు చిక్కులను బరిష్కరించుకొని ప్రవీణులగుటకును, ప్రపంచమున నిరంతరము సంభవించు రాజకీయార్థిక సాంఘికాది సమస్త పరివర్తనలనుగూర్చి యెప్పటికప్పుడు తెలిసికొనుటకును వీలుగ గ్రంథాలయము లేర్పడె, ఆబాల గోపాలమునకు, అన్ని వృత్తులవారికి నార్థిక భేదములుగాని, జాతి మత భేదములుగాని లేకుండ నుచితముగ జ్ఞానదానమును జేయుచున్నవి. నేటి గ్రంథాలయము వయోజన విద్యకు, పాఠశాలానంతర విద్యకు మూలముగనుండి సర్వమానవకోటికి నుచితముగ చదువునేర్పు సర్వకళాశాలగ పరిణమించినది.

ఇట్లు గ్రంథాలయమున బాఠశాలలోవలెనే విద్యాప్రచారము జరుగుటయేగాక దీని కార్యక్రమము పాఠశాలపనినిమించి ప్రయోజనకారి యగుచున్న సంగతిని పైన తెలిపియుంటిని. బడికి నిర్ణీత కాలమున నిత్యము వచ్చి, యచ్చటి విధి నిషేధములకు సంపూర్ణముగ గట్టుబడి, యుపాధ్యాయుల యధికారమునకు లోబడి నడచుకొను సంపన్నుల బిడ్డలకుమాత్రము నేటి పాఠశాల లుపకరించుచున్నవి. మన పాఠశాలలందలి విద్యా విధానము విదేశీయులగు మన ప్రభువుల యిచ్ఛననుసరించి యేర్పడినదగుటచే స్వీయాభివృద్ధికేమాత్రమును దోహదము నిచ్చునదిగ లేదు*. మరియు మనపాఠశాలలందలి పరీక్షలు పనికిమాలిన విషయములను బలవంతముగ చదువునట్లు ప్రోత్సహించుచు విద్యార్థుల మనశ్శరీరముల పాడుగావించుచున్నవేగాని, చక్కటి విజ్ఞానమును చేజిక్కించుకొనుట కివి సహాయపడుట లేదు.

---

* విదేశీ ప్రభువులు మనలను వదలినను, వారు ప్రవేశపెట్టిన మన విద్యా విధానము మారలేదు.

ఇక బ్రతుకు లేక బడిపంతుల యుద్యోగమునకు దొరకొను నేటి మన పాఠశాలోపాధ్యాయు లొకవంక ప్రభుత్వమునకు, వేరొకవంక నిత్యము తమపై నధికారము చలాయించు విద్యాశాఖోద్యోగులకు, మఱొకవంక స్థానిక సంస్థల సభ్యులకు, వారిమిత్రులకు, పాఠశాలల యజమానులకు భయపడుచు తమధర్మమును చక్కగ నిర్వర్తింప జాలని దుస్థితియం దున్నారు. స్వబుద్ధితో తమపనిని వీరుస్వేచ్ఛగ నెరవేర్చుటకు ప్రతిబంధకములు మెండుగ నున్నవి. ఇట్టి పరిస్థితులలో దయారగు మన విద్యార్థులకు సత్సంప్రదాయములు పట్టుబడుటెట్లు? వీరు భావి పౌరు లగుతరి జీవితసమస్యలను వివేచనతో బరిష్కరించుకొనగలుగు టెట్లు ?

ఈ చిక్కులను సులభముగ పరిష్కరింప దగిన సంస్థ గ్రంథాలయమే. కారణము పాఠశాలలందుగల నిర్బంధము లిందు లేకుండుట యొకటి. పాఠశాలలందలి విద్యార్థులవలెగాక గ్రంథాలయమందలి పాఠకులు తమకు కావలసిన పొత్తముల నింటికి తెచ్చుకొని స్వేచ్ఛగ చదువుకోవచ్చును. పాఠశాలలోవలె బాహ్యక్రమము, పరీక్షల బాధ లేకపోవుటయేగాక చదువరులు స్వేచ్ఛగా తమకు కావలసిన విషయములను వలసినంతవరకు తెలిసికొనుటకు గ్రంథభాండాగారము లన్నిసౌకర్యములను గలిగింప సమర్థములై యున్నవి. మఱియు పాఠశాలలో నిర్ణీత విషయములే, కొలదిగ నున్న యవియు పక్షపాతదృష్టితోనే పఠింపవలసిన స్థితి గలుగుచుండ, గ్రంథాలయములలో గావలసిన సే విషయమునుగూర్చిగాని యున్న దృక్పథములతోను జర్చింపబడిన యనేకులగు పండితుల వ్రాతలు సవిమర్శకముగ జదువుకొనుట కనకాశములు లభించుచున్నవి. బల వంతముగ నెత్తిపై రుద్ది స్వాంత యాలోచన లేకమాయుని బోధనా విధానము పాఠశాలలయందపులు జరుగుచుండ స్వేచ్ఛతో నున్న పుస్తకపై వ్రాలి యందలి మనువును గ్రహించు తేనెటీగ విధముగ

స్వయం సహాయముతో విద్యా నార్జించు పద్ధతి గ్రంథాలయములలో నడచుచుండును. మఱియు గ్రంథాలయములు తమ కడకు రాని వారిని సహితము స్వయముగ దర్శించి వారికి వలయు విజ్ఞాన సామగ్రిని పంచిపెట్టుచు, ఉపేక్షావంతుల కపేక్షను గలిగించు తమ నిత్యనూతన విధానముల ద్వారా యత్యంత ప్రచారములోనికి వచ్చి, బడులలో చదువు బాలురతో బాటన్నివర్గముల వారికిని నందుబాటులో నున్నవి.

ఇక గ్రంథాలయములు పిన్నవయస్కులకు, ముఖ్యముగ విద్యార్థుల కెట్లుపకరించునో విచారింతము. ఇతర దేశములలో ఆధునిక గ్రంథాలయము లన్నింటను నేడు బాలశాఖలు విరివిగ వెలసి పని చేయుచున్నవి. చదువుకొనుటకు పుస్తకములే గాక, శారీరక మానసిక వికాసముల గలిగించు క్రీడా వినోదములును వారి నిమిత్తమిందేర్పాటు చేయబడుచున్నవి. ప్రత్యేక శిక్షణమును బడసిన భాండాగారుల యధీనమున నడచు నీ బిడ్డల గ్రంథాలయములలో వారి నాకర్షించు పద్ధతులు దినదినము మార్పు గాంచుచున్నవి. చక్కని చిత్రములతో నలంకరింపబడిన యందమైన మందిరములు, నందు సొగసుగ దక్కువ యెత్తులో చుట్టును నచ్చటచ్చట నుంచబడిన బీరువాలలో నమర్పబడిన పుస్తకములు, వీనిమధ్య నచ్చటికి వచ్చు పసివారికి దల్లులవలె దోడుపడుటకు సిద్ధముగనుండు నగుమోము సుందరులతో వివిధదేశములందలి పిన్నలకు నచ్చటి గ్రంథాలయములు నిత్యము దర్శన స్థానము లగుచున్నవి. వివిధములగు చిత్రపటములతో రంగురంగుల పుటలతో అందమగు పై యట్టలతో నలరారుటయే గాక అచ్చటి గ్రంథములు పిన్నవయస్కులలో నన్నియంతరువుల వారికి తగిన యనేక విషయముల పై వ్రాయబడి యుండుటయు, అప్పుడప్పుడు వారికి కథాప్రసంగములు, మ్యాజికులాంతరు, నాటకాది ప్రదర్శనముల యేర్పాటు చాల

దేశములందలి పిల్లల గ్రంథాలయములలో నాచారముగ నున్నది. ఈ పరిస్థితులు మనకిప్పుడు పూజ్యములు. త్వరలో యేర్పడు సూచనలును కానరావు*.

అయినను వీనిలో కొన్నింటిని మన మవలంబించ వచ్చును. ప్రభుత్వసాయమున్నచో పై పనులన్నియు మనకు సుసాధ్యములగును. ఇక ప్రస్తుతమున్న పరిస్థితులలో మన గ్రంథాలయములను విద్యార్థు లెట్లుపయోగించుకొన దగునో తెలుప బ్రయత్నింతును. వీనిని విద్యార్థులేల యుపయోగించుకొనవలెనో ముందు చెప్పెదను. నేటి పాఠశాలల బోధనా విధానపు బాధనుండి కొంతకాలమైన విముక్తి బొందుటకును, అచ్చట నేర్చు విషయముల యథార్థతను పరిశీలించి అందలి లోపములను సవరించుకొనుటకును, అందు బొత్తుగ జెప్పని అవసర విషయములను, భారతదేశ భవితవ్యమును నిర్ణయించు ప్రపంచ పరివర్తనములను తెలిసికొని చేతనైనంతవరకు దేశసేవయందు తమ విధిని నిర్ణయించుకొన గలుగుటకును విద్యార్థులు తప్పక గ్రంథాలయముల సాయమును బడయు టవసరము. పిల్లల శారీరక వికాసమునకు బాల్యమున క్రీడలాదిగాగల వినోదము లెట్లవసరమో తాము పెద్దవారై పౌరధర్మములను గుర్తెరిగి ప్రవర్తించుకొనుటకును తగిన శిక్షణము ముఖ్యముగ నుండవలెను. దీనికి పత్రికా పఠనము, సద్గ్రంథ కాలక్షేపము, వివిధ విషయములపై యనుభవజ్ఞుల యుపన్యాసములు, వాగ్వర్ధనీ సభలు, విజ్ఞాన గోష్ఠులు యాత్రలు చాల తోడ్పడగలవు. ఈ సాధనము లన్నింటికి గ్రంథాలయములు ప్రత్యక్షముగను పరోక్షముగను సాయపడు

---

* మదరాసు ప్రభుత్వమువారు విద్యాశాఖ డైరెక్టరు పర్యవేక్షణక్రింద 1951 వ సంవత్సరం పిల్లల గ్రంథాలయము నొకదానిని ఆధునిక పద్ధతులపై నిర్వహించుటకు తలపెట్టినట్లు తెలియుచున్నది. దీని నిర్వహణ చక్కగా సాగుటపై యీ యుద్యమ భవితవ్య మాధారపడి యున్నది.

చుండును. పుస్తక ప్రచారముతోబాటు గ్రంథాలయము లొనర్చు నీకృషిని గ్రంథాలయ వ్యాపనక్రియ యందురు.

ఈ సందర్భమున చెప్పవలసిన విషయము మరొకటి గలదు. 'గ్రంథాలయభూమి' యని పేరు గాంచిన అమెరికా ఖండమందును, గ్రంథాలయోద్యమము బాగుగ వ్యాప్తిగాంచిన తదితర దేశముల లోను విద్యాలయములకు గ్రంథాలయములకు మధ్య నుండదగు సంబంధమునుగూర్చి చక్కని శ్రద్ధ గైకొనబడుచున్నది. పలుతావు లలో పాఠశాలల నిర్వాహకుల యాధ్వర్యమున నడచుచున్న ప్రత్యేక పాఠశాలా గ్రంథాలయముల విషయమటుంచి, వివిధ దేశము లందలి గ్రంథాలయములు తమ సేవను సమీప పాఠశాలలకు ప్రత్యక్షముగ నందజేయుచున్నట్లు మనము వినుచున్నాము. అప్పుడప్పుడు బడులలోని యొక్కొక్క తరగతి విద్యార్థులను గ్రంథాలయములకు పిలచుకొని పోయి యచ్చటి గ్రంథభాండాగారుల సాహాయ్యమున నందలి యేర్పాటుల నవగాహన చేసికొనుటకు వారికి వసతులు కల్పింపబడుచున్నవి. ఇంటికడ విద్యార్థులు తయారు చేసికొనవలసిన పాఠములు, లెక్కలపని చూచుకొనుటకు గ్రంథాలయము లుపయోగ పడుచున్నవి. పైన జెప్పిన కథాప్రసంగములు, మ్యాజికు లాంతరు ప్రదర్శనము లాదిగాగల కార్యకలాపములు, పిల్లలను గ్రంథాలయ ముల కాకర్షించి వారి మనముల నందలి పుస్తకముల వైపుకు త్రిప్పుటలో జాల సహాయపడుచున్నవి, పాఠశాలలందలి వివిధ తరగతుల యుపయోగార్థము ప్రత్యేకము నిర్ణయింపబడిన గ్రంథ సముదాయమును బోధనా సమయమున విద్యార్థులకు గనబడులాగున బ్రదర్శించుచు, మధ్య మధ్య గ్రంథభాండాగారులు తమకు సమీప మునగల పాఠశాలల కేగి యందలి యుపాధ్యాయులు తమకు సాయ పడునట్లు ప్రోత్సహించుచు, విద్యార్థులకు తమ తమ గ్రంథాలయ

ముల యుపయోగ ప్రాశస్త్యములను గూర్చి వినిపించుచు, వారి నందఱను తమ యభిమానులుగ జేసికొనుచుందురు.

ఇట్లు గ్రంథాలయములలోని పుస్తకములను బాల్యముననే చదువ నలవాటైన విద్యార్థులు బడివిడిచిన పిమ్మటనైత మెప్పటివలె గ్రంథాలయములను తా ముపయోగించుకొనుటయే గాక తమ పెద్దలకుగూడ వీనితో సన్నిహిత సంబంధమును సమకూర్తురు. ఇంత కార్యక్రమమును పాఠశాలా సహకారము మూలముననగదా గ్రంథాలయములు సాగించగలుగుచున్నది! వివేకవంతులగు పరసీమలందలి గ్రంథాలయ నిర్వాహకు లీ సహకారపద్ధతి నవలంబించి తమ యాశయములను జక్కగ సాధించుచుండుట యెరిగియు మన మేల వారిననుకరించరాదు ?

# గ్రంథాలయ మూర్తులు

గ్రంథాలయమన్నప్పుడు పుస్తకాలు, బీరువాలు సాధారణంగా గుర్తుకు వస్తాయి. కొంచెం చదువుకున్న వారి నడిగితే పుస్తకాలుండే స్థలం గ్రంథాలయమని నిర్వచనం చెబుతారు. కనుక పుస్తకాలు, బీరువాలు భవనం చేరి గ్రంథాలయ మౌతుందనే భ్రమ మనకు కలుగవచ్చు. కాని కాలగమనంతోపాటు దినదినాభివృద్ధి చెందుతూ మానవ సంఘాని కనేక విధాలుగా ఉపయోగపడుతూ వున్న ఈ మహాసంస్థకు చదువరులు ప్రాణంవంటి వారనిన్నీ, పైన చెప్పిన అంగాలు దీనికి శరీరాన్ని పోలినవనిన్నీ అనుభవాన్ని బట్టి తెలుస్తూవుంది. ఈ విధంగా సకల జనుల ఉపయోగం నిమిత్తం ఒకచోట చేర్చిపెట్టిన గ్రంథసముదాయం గ్రంథాలయంగా నేడు పరిగణించబడుతూవుంది. సముదాయం అన్న పదాన్ని బట్టి గ్రంథ సంఖ్య అధికంగా వుంటేనే గ్రంథాలయ మవుతుందనుకోవలసిన పనిలేదు. గ్రంథమంటే చక్కగా అట్టకట్టిన అచ్చు పుస్తకమే కానక్కరలేదు. గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ పెద్దవిగనే ఉండవలెనన్న నియమం లేదు. నేటి పుస్తకాలు, పత్రికలు కరపత్రాలతోపాటు తాటియాకులు, రాగిరేకులు, రాతిపలకలపై లిఖించిన ప్రాతకాలపు రచనాసామగ్రి అంతా విజ్ఞాన సముపార్జన కుపకరించేటంతవరకూ గ్రంథాలక్రిందనే లెక్కకువస్తాయి. గ్రంథాలతోపాటు దేశపటాలు, చిత్తరువులు, ఛార్టులు, గ్రాఫులు, అంకెలశ్రేణులు సహితం నేటి కాలంలో విషయసేకరణకు అనేక విధాలుగ ఉపయోగపడుతూ వుండడంచేత యిప్పటి గ్రంథాలయాలలో యివన్నీ సేకరింపబడుతున్నాయి. ఇంకా యెప్పటికప్పుడు మారుతూవుండే వాతావరణ శీతోష్ణపరిస్థితులు, గాలిదిశ మార్పులను సూచించే ఉష్ణమాపకము

(ధర్మామీటరు), భారమితి (బారామీటరు) వగైరా శాస్త్రపరికరాలు గూడ గ్రంథాలయాలలో నుండవలసిన సాధనాలుగ సింగరేణికాలరీసులో జరిగిన ౨౦వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభకూడా తీర్మానించినది. ఉపయుక్తమైన పైపరికరాల నన్నింటినీ సమకూర్చుకొని పాఠకులకివి బాగా ఉపయోగపడేటట్లు చూడవలసిన విధి గ్రంథాలయ కార్యకర్తలపై వుంది. ఈ విధంగా గ్రంథాలయం పుస్తకాలు, పాఠకులు, సిబ్బంది అనే మూడుమూర్తులతో కూడి, యివి మూడున్నూ చక్కగా యేర్పడడంతో తన ధర్మాన్ని క్రమంగా నిర్వహించడానికి సమర్థమవుతుంది. కనుక గ్రంథాలయానికి ప్రధానాంగాలైన పుస్తకాలు, పాఠకులు, సిబ్బంది అనే యీ మూర్తుల యేర్పాటునుగూర్చి యీ వ్యాసంలో సూక్ష్మంగా వివరించడమైనది.

## పుస్తకాలు

సర్వసాధారణంగా గ్రంథసేకరణలో మనగ్రంథాలయం లవలంబించే విధానాల మూలంగా పేరుగల పుస్తకాలకొరకు వెచ్చించే పెద్దమొత్తాలలో చాలభాగం వ్యర్థమవుతూవుంది. ఎవరి నిమిత్తం గ్రంథాలయాల నేర్పాటు చేస్తామో వారి అవసరాలు, అభిరుచులు, వ్యాసంగాలు, వయస్సుల అంతస్థులు తెలుసుకోకుండా, 'ఎక్కువ జనాభాకు తక్కువ వ్యయంతో చక్కని పుస్తకాల'నే గ్రంథాలయాదర్శాన్ని గమనించకుండా గ్రంథాలయ పాలకుల చిత్తవృత్తిపై ఆధారపడి జరుగుతువున్న గ్రంథసేకరణమూలంగా మనగ్రంథాలయాలు తమ ధర్మాన్ని క్రమంగా నిర్వహించలేక పోతున్నవి. గ్రంథాలయం నిమిత్తం మనం చేర్చిపెట్టే ప్రతిపుస్తకాన్ని వివిధ దృక్పథాలనుండి పరిశీలించవలసిన అవసరం చాలావుంది. ఒక్కొక్క విషయానికి సంబంధించిన పుస్తకాలను కొనే సందర్భంలో పాఠకుల అంతస్థును ముఖ్యంగా పరిగణించాలి. ఒక

విషయాన్నిగూర్చి ఏమీతెలియని క్రొత్తవారికి ప్రాథమికగ్రంథాలు, కొంచెం పరిచయంగలవారికి మరికొన్ని విశేషాలుండే మధ్యతరగతి పుస్తకాలు, ఇంకా యెక్కువగా తెలిసినవారికి ప్రవీణుల రచనలు, ఆ విషయానికి సంబంధించిన క్రొత్తపరిశోధనలను వెల్లడించే పండితుల గ్రంథాలు ఉపయోగిస్తాయి. వివిధదశలలోని పాఠకులకు వేరువేరుగ ఉపయోగపడే రకరకాల గ్రంథాలను సంపాదించడంతో ఆయా వర్గాల పాఠకుల సంఖ్యను బట్టిన్నీ, ప్రాధాన్యతనుబట్టిన్నీ ఒక్కొక్క శాఖలో సేకరించదగిన గ్రంథ సామగ్రిని నిర్ణయించదగును. ఈ సిద్ధాంతం పైకి సులభంగా కనబడినప్పటికీ దీనిని ఆచరణలో పెట్టేటప్పుడు మనం చాలా చిక్కులను యెదుర్కోవలసి వస్తుంది. వీటి పరిష్కారవిషయంలో పాఠకులకు న్యాయం జరగాలంటే పాల కులు చాలజాగ్రత్తతో మెలగాలి. ఒక్కొక్క గ్రంథాలయమూ ఉపకరించే ప్రదేశంలోని జనుల పరిస్థితుల పరిగణనం (సర్వే) గ్రంథ వరణానికి చాలా దోహదకారిగా వుంటుంది. ఈ సర్వేలో దిగువ విషయాలను సమగ్రంగా పరిశీలించి వీటి లెక్కలను తేల్చి, జనాభా నిష్పత్తి ప్రకారం ఆయావర్గాల ఉపయోగానికి తగినట్లు గ్రంథాలు వగైరా సామగ్రిని సమకూర్చవలసిన బాధ్యత గ్రంథాలయపాలకు లపైవుంటుంది.

౧. నైసర్గిక, చారిత్రక, పారిశ్రామిక, వ్యవసాయ, వ్యాపార పరిస్థితులు.

౨. జనాభాస్వభావము.

(అ) వయోజనులు—పురుషులు, స్త్రీలు - వారిలో అక్షరాస్యులు, నిరక్షరాస్యులు.

(ఆ) బడికిపోయే పిల్లలు-బాలురు, బాలికలు.

(ఇ) వ్యవసాయదారులు, పారిశ్రామికులు, వర్తకులు, వృత్తి పనులు చేసుకునేవారు, నిరుద్యోగులు.

గ్రంథవరణ కార్యక్రమం ప్రయోజనకరంగా వుండాలంటే వివిధవిషయాలపై ఆయాభాషలలో వెలువడ్డ రకరకాల పుస్తకాల జాబితాలు, గ్రంథ ప్రకటనలు, సమీక్షలు సేకరించి పాలకులు వీటిని తరచు పరిశీలిస్తూ వుండాలి. నూతన వస్తువులపై వలెనే క్రొత్తపుస్తకాలపై సహజంగా వుండే మోజును బట్టికాక, ప్రతి పుస్తకం విషయం బాగా తెలుసుకొని అది పాఠకులకు ఉపయోగిస్తుందనీ, దానిసేకరణ మూలంగా అంతకంటె యెక్కువ ప్రయోజనకారులైన యితర గ్రంథాల సంపాదనకు యేలాంటి ఆటంకంగాని ఉండదనీ నిర్ణయించుకొన్న తర్వాతనే యే పుస్తకాన్నిగాని సంపాదించడం మంచిది.

## పాఠకులు

ఇక పాఠకుల విషయమై ఆలోచిద్దాం. "గ్రంథాలయంలో పాఠకులకు కావలసినసౌకర్యాలను కల్పించడం" గ్రంథాలయ నిర్వాహకుల విధి. ఇందుకుగాను చదువులగది యేర్పాట్లు చక్కగా వుండాలి. పాఠకుడు ఎంతసేపైనా సుఖంగా కూర్చొని చదువుకోడానికనుకూలమైన కుర్చీలు, వ్రాతకు - పుస్తకాలు పెట్టుకోడానికి బాగా వుపయోగపడే విశాలమైన మేజాలేగాక ఎంతో కన్నులకింపైన బొమ్మలూ, విగ్రహాలూ, పూలూ, లతలూ మున్నగు అలంకారాలతో చదువులగది శోభిల్లాలి. గ్రామ గ్రంథాలయాలలో బల్లలూ, కుర్చీలూ లేక పోయినా చదువరులు సుఖంగా కూర్చొని చదువుకోడానికి అనుకూలాలు మాత్రముండాలి. చీకటివేళల్లో కూడా చదువరులు గ్రంథాలయాల ప్రయోజనాన్ని పొందడానికి వీలుగా దీపాల యేర్పాటు కూడా అవసరం. పత్రికాపాఠకుల్లో, విద్యార్థులు

దీనికి బాగా అనుకూలపడతాయి. పాఠకులకు అలసట గలిగినప్పుడు విశ్రాంతి నిమిత్తం కావలసిన యేర్పాట్లను కూడ గ్రంథాలయ నిర్వాహకులు చేయాలి. దీనికి పడకకుర్చీలు, ప్రయివేటుగదులు, పంకాలు సాయపడతాయి. దాహానికీ, కాలుసేతులు కడుగుకోనుడానికీ చల్లటినీరు సరఫరాకావాలి. ఈ సౌకర్యాలు సమీపంలో లేకుంటే మంచిపట్టులో తమచదువుకు స్వస్తిచెప్పి చదువరులింటికి నడువవలసి వస్తుంది. ఇందుమూలంగా పుస్తకాల వుపయోగానికి కొంత భంగపాటు కలుగుతుంది. కాబట్టి వీటిని వేడుకల క్రింద త్రోసివేయక అవసరాలుగ పరిగణించి తప్పక యేర్పరచాలి. పత్రికల గది, ఉపన్యాస మందిరం, ప్రదర్శన శాలల ప్రభావంకూడ తక్కువదికాదు. ఇవి గ్రంథాలయానికి చాలమంది చదువరులను సమకూర్చగలుగుతాయి *.

పాఠకులను గ్రంథాలయాల కధికంగా ఆకర్షించడానికి అనేక ఉపాయాలున్నవి. నిర్ణీతమైన ప్రచార పద్ధతులీపనికి చాలా ఉపకరిస్తాయి. ప్రజల మనస్సులను గ్రంథాలయాల వైపుకు త్రిప్పే కార్యక్రమాన్ని ఆంగ్లంలో 'పబ్లిసిటీ' అంటారు. ఈ పబ్లిసిటీ ఆధునిక జీవితరంగాలన్నింటిలోనూ ప్రధాన స్థాన మాక్రమిస్తున్నది. గ్రంథాలయ సంబంధంగా యిది రెండురకాలుగావుంది. గ్రంథాలయాల ఉపయోగ ప్రాశస్త్యాలను గూర్చి సర్వసాధారణంగా వివరించే ప్రచారపద్ధతి మొదటి తెగకు చెందినది. ఈ విధానాన్ని గ్రంథాలయోద్యమ ప్రచారం కొరకు కృషిచేసే ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవంటి సంస్థలు అవలంబిస్తాయి. పోతే ఒక్కొక్క గ్రంథాలయం వ్యక్తిగతంగా తమతమ కార్యక్రమ వివరాలను ప్రజలకెరుకపరచడముంటుంది. ఇది రెండవ రకపు ప్రచారం. దీనిని ప్రతిగ్రంథా

* గ్రంథాలయ శాస్త్ర ప్రథమ పాఠములు. పేజీలు ౧౦, ౧౧.
ప్రకాశకులు: సేవాశ్రమము, పెదపాలెము (వయా) దుగ్గిరాల, గుంటూరుజిల్లా.

లయమూ చేపట్టడ మవసరం. ఈ కార్యంలో పత్రికలు బాగా ఉపయోగిస్తాయి. గ్రంథాలయ నిర్వాహకు లప్పుడప్పుడు తమ గ్రంథాలయాల వృత్తాంతాలను ప్రకటనార్థము పత్రికలకు పంపుతూ వుండాలి.

నూతనంగా గ్రంథాలయానికిచేరిన పుస్తకాలజాబితాలు, పాఠకులు, వారుచదివిన పుస్తకాల మాసవారీలెక్కలు, గ్రంథాలయం తెరచివుండే సమయాలు, పుస్తకాల నరువిచ్చే పద్ధతులు, పాఠకులకుండే ప్రత్యేక సౌకర్యాలు, ప్రదర్శనాల యేర్పాట్లు మొదలైన విషయాలు గ్రంథాలయాలకు పాఠకుల నాకర్షించడంలో తోడుపడతాయి. స్వయంగా కరపత్రాలను, ప్రకటలను, చిరుపొత్తాలను ప్రకటించడంద్వారాకూడ గ్రంథాలయాలు పై విషయాలను ప్రజల కెరుకపరచవచ్చును. ప్రత్యేక పత్రికా పఠనము, ప్రదర్శనాల నిర్వహణము, ఉపన్యాసాల యేర్పాట్లు గ్రంథాలయానికి చదువరులను సమకూర్చడంలో చాల ఉపకరిస్తాయి. గ్రంథాలయ సిబ్బంది జనంలో తిరుగుతూచేసే ప్రచారం ఉత్తమోత్తమమైనది. గ్రంథాలయాలను ప్రజల కందుబాటులో వుండే స్థలాలలో యేర్పాటుచేసి వారి తీరికసమయాలలో వీటిని తెరచియుంచి, గ్రంథాలయంలోపల ప్రతివారూ తమకుకావలసిన పుస్తకాలను బీరువాలనుండి స్వయంగా తీసి చూచుకొనడాని కనుకూలాలుంటే కూడ ప్రజలెక్కువగా గ్రంథాలయాలకు రావడం పొసగుతుంది.

## సిబ్బంది

ప్రజలను గ్రంథాలయాలకు రప్పించడంతో గ్రంథాలయ నిర్వాహకులపని తీరినట్లెంచరాదు. ఒకపర్యాయం గ్రంథాలయానికి వచ్చినవారు మరల మరల వచ్చునట్లు చేయడ మవసరం. వారడిగిన పుస్తకాలనిస్తూ, వారి సందేహాలను ఎప్పటికప్పుడు తీరుస్తూ,

వారి రుచులను, అవసరాలను గమనించి తదనుగుణ మైన గ్రంథసామగ్రిని వారికందిస్తూ, క్రొత్త పుస్తకాలవైపుకూ ఉపయుక్త గ్రంథపఠనంవైపుకూ వారిమనసులను మరలిస్తూ, తమకడకు వచ్చే పాఠకులకూ, గ్రంథాలయంలోని పుస్తకాలకూ సక్రమమైన సంబంధాన్ని కల్పిస్తూ వుండవలసిన విధి గ్రంథాలయ నిర్వాహకులపై వుంది.

ఈవిధి నిర్వహణ సక్రమంగా సాగాలంటే దీనికి బాధ్యులైన గ్రంథ భాండాగారులు సమర్థులుగా వుండాలి. ఒక్కొక్క చదువరికి తగిన పుస్తకాన్ని సూచించి, జనంలో పఠనాభిలాషను పెంపొందించి, ఆబాలగోపాలమూ ఒక్కొక్కరు తమ జీవిత పర్యంతమూ సాగించవలసిన విద్యాసముపార్జన కార్యంలో తోడ్పడవలసిన భాండాగారి సామాన్యంగా చదువు వ్రాతలు నేర్చియున్న చాలదు. విజ్ఞాన విశేషాలు తెలిసినవాడూ, పుస్తకాలపరిచయం బాగా వున్నవాడూ ప్రపంచజ్ఞానంపూర్తిగాకలవాడూ మాత్రమే పైపనులనుసమర్థతతో సాగించగలడు. ప్రత్యేకం ఒకవిషయంలో ప్రావీణ్యత గలవానికంటె అన్నిసంగతులూ కొంచెంకొంచెంగా తెలిసినవాడీపనికి బాగా ఉపయోగపడతాడు. బోధనాశక్తి, వివేకము, పరిశీలనా సామర్థ్యము, గ్రంథభాండాగారి కుండవలసిన గుణములలో ముఖ్యమైనవి. గ్రంథాలయశాస్త్రాభ్యాసంతోపాటు గ్రంథాలయ నిర్వహణానుభవంకూడ వుంటే యితనిపని రాణిస్తుంది. సుందరరూపము, నగుమొగము, శాంతస్వభావము, సంఘసేవా తత్పరత, మానసికశాస్త్ర పరిచయము, ప్రజల చిత్తవృత్తుల పరిశీలనా పాటవము భాండాగారులకున్నట్లయితే వారి కార్యక్రమం చక్కగా సాగడాని కవకాశముంటుంది. భాండాగారి అలసత్వాన్ని, అహంకారాన్ని దరికి చేరనీయరాదు. అధికారధోరణి నితడవలంబించ కూడదు. అవకాశం చిక్కినపుడంతా విజ్ఞానసేకరణపట్ల శ్రద్ధవహిస్తూ, ఇతడెల్లపుడూ విద్యార్థి

వలె కాలం గడపాలి. క్రొత్తపుస్తకాల సమాచారాన్ని తెలుసు కుంటూ, ప్రజలతో సంబంధము ఎక్కువ చేసుకుంటూ, తన విధినిర్వహణానికవసరమైన బలాన్ని యితడు చేకూర్చుకోవాలి. ఈ కార్యక్రమాన్ని నడపడానికి వయసుచెల్లిన వృద్ధునకు శక్తియుండదు. అనుభవం చాలని పిన్న వయస్కులుకూడ యింత బాధ్యతను సరిగ నిర్వహించలేరు. కనుక అనుభవంగల నడివయస్కులనే ఈ పనికి నియోగించాలి. గ్రంథాలయాలపని అవిచ్ఛిన్నంగా సాగాలంటే పై యోగ్యతలుగల వ్యక్తికి గౌరవంగా బ్రతకడానికి చాలిన ఉపాధిని కల్పించడ మవసరం. స్వల్ప వేతనాలకు సమర్థులైనవారు లభించడం సాధ్యంకాదు. కనుక సంఘజీవనవికాసానికి తోడుపడవలసిన భాండాగారి వేతనం సమర్థుల నాకర్షించడానికి తగినదిగా వుండాలి. అప్పుడే గ్రంథాలయాల పనికి సార్థకమవుతుంది. మానజాతి స్థిరమైన అభివృద్ధిని పొందగలుగుతుంది.

# గ్రంథాలయ నిర్వహణము

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంనుండి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ స్థాపననాటికి ౧౯౧౪ ఏప్రిల్ ౧౦ వ తేది, తెలంగాణముతో కలుపుకొని ఆంధ్రదేశం మొత్తంపైన యేర్పడిన గ్రంథాలయాలసంఖ్య ౧౫౦కి మించలేదు. మాతృభాషారాధకులకృషి ఫలితంగానూ, కీ. శే. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులువంటి దాతల ఆదరాభిమానాల వలననూ, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము యొక్క యెడతెగని ప్రచారఫలితంగానూ, ఆంధ్రదేశం నలుమూలల గ్రంథాలయాలు వందలకొలదిగ బయలుదేరినవి. పూర్వంకంటె వీటిసంఖ్య అనేక రెట్లు పెరిగినది. కాని ఆదర్శంగా నడుస్తూ జనసామాన్యానికి పూర్ణంగా వినియోగపడుతూవున్న గ్రంథాలయం ఆంధ్రదేశంలో నేడొక్కటికూడ లేదని తెలుపుటకు విచారంగావుంది. ఈస్థితికి కారణాలను మనం తెలుసుకొని మనగ్రంథాలయాలను ఆదర్శ సంస్థలుగా మార్చడానికీ, ఊరూరా వీటిని వ్యాపింపజేసి ప్రజలంతా వీటినుపయోగించుకొనేటట్లు చేయడానికీ మనం కృషిచేయవలసియున్నది.

చాలాకాలం బానిసలుగా వున్నమనం సంఘాభివృద్ధికి అత్యంతావసరమైన విద్యావ్యాప్తి విషయంలో ఎక్కువగా కృషి చేయలేకపోయినాము. నూటికి పదిమందిమాత్రం చదువుకొన్న జనాభాలో మన గ్రంథాలయాలు పనిచేస్తూ వుండడంచేత వీటిపని ఉత్సాహంగా సాగలేదు. మన పూర్వగ్రంథాలను, ఆధునిక గ్రంథాలలోకూడ అధికభాగమును చక్కగ అర్థంచేసుకోగల శక్తివంతులుకూడ మన అక్షరాస్యులలో యెక్కువగా లేనందునను, మన గ్రంథాలయాలు తగినంత ఉపయోగానికి రాలేదు. మన జనులలో అత్యధిక సంఖ్యాకులుగావున్న వ్యవసాయదారులు, తదితర వృత్తులవారి కుపకరించే

వృత్తిసంబంధమైన గ్రంథాలు చాలినన్ని తెలుగులో లేనందువలన కూడ గ్రంథాలయాల అభివృద్ధికి పెద్దఆటంకమేర్పడింది. మనలో చదువులు నేర్చినవారిలో చిన్నతనంనుండీ గ్రంథ పఠనాభ్యాసం కల వారు చాల తక్కువగానున్న కారణంచేత మన గ్రంథాలయాలలోని పాఠకుల సంఖ్యలోకూడ క్రమానుగతమైన అభివృద్ధికనబడడంలేదు. మనవారి చదువు లెంతసేపూ కాలక్షేపంకొరకు సాగుచున్నవేగాని, ఉపయుక్తపఠనంవైపుకు వీరిమనసులు మరలడంలేదు. సమర్థులైన నిర్వాహకులు లేకకూడ గ్రంథాలయనిర్వహణం మిక్కిలి లోప భూయిష్ఠంగానుంటూ వున్నది. నిన్న మొన్నటిదాకా యీవుద్యమం పట్ల సవతితల్లిప్రేమను చూపుతూ వచ్చిన విదేశ ప్రభుత్వ విధానం కూడ మన గ్రంథాలయాల అభివృద్ధిని చాల అరికట్టింది. అక్కడక్కడ స్థానికసంస్థలు—ముఖ్యముగ పంచాయితీబోర్డులు—నెలకొల్పిన గ్రంథాలయాలొక ప్రక్క అనవసరమైన నిర్బంధాలకు గురియై పాడు వారినట్లే, గ్రంథాలయాదర్శాన్ని పూర్తిగ గ్రహించని పరిపాలకుల అధ్వర్యాన నడచిన భాండాగారాలుకూడ నామమాత్రంగా తమ జీవితాన్ని సాగించినవి. ప్రభుత్వంవలెనే ప్రజలు కూడ వీటిని నిర్లక్ష్యం చేయడంతో ఆర్థిక సంబంధమైన చిక్కులకు గురియై మన గ్రంథాలయాలు వికాసవంతంగా సాగలేదు.

## ప్ర భు త్వ వి ధు లు

గ్రంథాలయ నిర్వహణంలో ప్రధానమైన 'అధ్యయనం కొరకు పుస్తకాలు', 'అందరికీ పుస్తకాలు' అనే రెండు సూత్రాలు పూర్తిగా అమలు జరగడానికి ప్రభుత్వము, గ్రంథాలయ పాలకులు, సిబ్బంది, పాఠకులు—అందరూ తమతమ బాధ్యతలను నెరవేర్చునట్లు పూర్ణమైన శ్రద్ధను చూపవలెను. ఇందు మొదట పేర్కొన్న ప్రభుత్వవిధులలో

ముఖ్యమైనవి ఆర్థికసహాయము, శాసననిర్మాణము, సహకారసమన్వయ విధానము.

మదరాసు రాష్ట్రంలో దాదాపు ముప్పది సంవత్సరాలనుండి గ్రంథాలయాలకు ప్రభుత్వము నామమాత్రపు విరాళాలను యిస్తూవున్నది. లాంఛనప్రాయమైన యీసహాయం గ్రంథాలయాల కంతగా ఉపకరించడంలేదు. ఈ విరాళాలు రాష్ట్రంలోని అన్ని గ్రంథాలయాలకు లభించడంలేదు. వీనిని పొందుతూవున్న గ్రంథాలయాలు కూడ యెన్నో ప్రతిబంధకాలను యెదుర్కొనవలసి వస్తున్నది. వీని పంపకానికి ప్రభుత్వం యింతవరకు నిర్ణీతమైన నిబంధనలను చేయలేదు. ఈ విషయంలో ప్రభుత్వం శ్రద్ధవహించి సరియైన యేర్పాట్లను చేయునట్లు గ్రంథాలయ సేవకులు, ఉద్యమాభిమానులు కృషిచేయవలసి యున్నది. కోట్లకొలది ధనాన్ని ప్రాథమిక విద్యావ్యాప్తి కొరకు వెచ్చిస్తూ వున్న మన ప్రభుత్వాలు దీని అభివృద్ధికి విశేషంగా తోడుపడే గ్రంథాలయాలకు లక్షలనైన వెచ్చించేలాగు మనము చూడవలసి యున్నది.

ప్రపంచములోని ప్రధాన దేశాల గ్రంథాలయ చరిత్రలను పరిశీలిస్తే జనసామాన్యంలో విద్యావ్యాప్తికి ప్రధాన సాధనాలైన గ్రంథాలయాల అభివృద్ధికై అచ్చటి గ్రంథాలయశాసనా లేవిధంగా తోడ్పడుచున్నదీ విశదమౌతుంది. ఈ విషయాన్ని మదరాసు రాష్ట్రంలోని గ్రంథాలయ సంఘాలు ప్రభుత్వదృష్టికి తేగా, వీటి ప్రాముఖ్యతను గుర్తించిన యిచ్చటి మాజీ విద్యామంత్రి శ్రీ అవినాశలింగం చెట్టిగారు రాష్ట్రీయ శాసనసభలో 'మదరాసు పౌర గ్రంథాలయ చిత్తుచట్టాన్ని' ప్రవేశపెట్టడమూ, దీనిని శాసనసభవారు సెలెక్టుకమిటీకి పంపడమూ జరిగినది. ఈ చట్టమును విమర్శించుటకై ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ౧౬-౧-౪౭వ తేదీన

పటమటలంకలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రత్యేక మహాసభను జరిపి కొన్ని తీర్మానములు గావించిరి. ఈ తీర్మానముల ననుసరించి ప్రభుత్వము ప్రకటించిన చిత్తు చట్టమునకు సవరణలు తయారుచేసి ప్రభుత్వమునకు నివేదించుటకై యీసభవారొక ఉపసంఘమును నియమించిరి. ఈ ఉపసంఘమువారు మహాసభవారి ఆదేశం ప్రకారం సవరణలను ప్రభుత్వమున కందజేయడమేగాక వీటిని సమర్థిస్తూ శ్రీ హరిసర్వోత్తమరావుగారు ప్రభుత్వమువారు నియమించిన సెలెక్టు కమిటీ యెదుట సాక్ష్యము సహితమిచ్చిరి. సెలెక్టు కమిటీవారి సిఫారసులతో యీ చట్టము ౧౯౪౮ వ సంవత్సరాంతమున తీర్మానమైనది. దీని ననుసరించి రాష్ట్ర గ్రంథాలయకమిటీ, మదరాసు నగరములోనూ జిల్లాలలోనూ స్థానిక గ్రంథాలయసంస్థలూ నిర్మింపబడినవి. ౧౯౫౦ వ సంవత్సరం ఏప్రిల్ ౧ వ తేదీనుండి యీచట్టము అమలులోనికివచ్చినది. రాష్ట్రంలో ప్రభుత్వపక్షమున జరుగవలసిన గ్రంథాలయ కార్యక్రమముల నిర్వహణకు కావలసిన నిబంధనలనుగూడ ప్రభుత్వమువారు ప్రకటించినారు. పై చట్టములోను, దీనిననుసరించి చేయబడిన నిబంధనలలోనూ కొన్ని లోపములున్నప్పటికీ అవసరమైనప్పుడు వీనిని సవరించుకొనుట కవకాశమున్నది. కనుక యీ శాసనము మొత్తముపై మదరాసు రాష్ట్రంలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి దోహదంగా పరిణమించునని విశ్వసించవచ్చును. ప్రస్తుతం హైదరాబాదు విద్యామంత్రులుగానున్న మాన్య శ్రీ బూరుగుల రామకృష్ణారావుగారు విద్వాంసులు; బహుభాషాకోవిదులు; గ్రంథాలయోద్యమాభిమానులు. కనుక వీరి యుద్యోగకాలములో హైదరాబాదు రాజ్యము భారతదేశములో ఆదర్శ పూర్వకమైన గ్రంథాలయ

శాసనమును నిర్మించి ప్రజాసామాన్యం యొక్క విద్యావ్యాప్తికి, విజ్ఞాన వికాసానికి తోడ్పడగలదని ఆశించవచ్చును.

ప్రభుత్వము గ్రంథాలయాలకు చేయవలసిన మరొకతోడ్పాటు సహకారవిధానము. దీనిద్వారా దేశంలోవున్న గ్రంథాలయాలలోని ప్రతి పుస్తకమూ కోరినవారి కందజేసే యేర్పాటులుండాలి. ఇందు మూలంగా చిన్న గ్రంథాలయాలు సహితం తమ చదువరుల కోరికలను తీర్చడానికి వీలేర్పడడమేగాక, 'ఎక్కువ జనాభాకు తక్కువ వ్యయంతో చక్కని పుస్తకాల'ను సరఫరాచేయడం సాధ్యమౌతుంది. గ్రంథాలయ సహకారం సక్రమంగా సాగడానికి మదరాసు రాష్ట్రప్రభుత్వం యేర్పరచిన ఫిర్కా గ్రంథాలయ ప్రణాళికను ప్రాతిపదికగా గ్రహించవచ్చు. రాష్ట్రంలోని ప్రతిఫిర్కాలోను ఒక కేంద్రగ్రంథాలయాన్ని నెలకొల్పి, ఆ యా ఫిర్కాలలోని స్థానిక గ్రంథాలయాల సహకారంతో గ్రామాలలోని జనులందరికీ వారి వారికి కావలసిన గ్రంథాలను అందజేయవచ్చు. ఈ ఫిర్కా గ్రంథాలయాలపైన ప్రతి జిల్లాకు ఒక్కొక్క కేంద్ర గ్రంథాలయమేర్పడి ఫిర్కా గ్రంథాలయాలు కొనలేనట్టియు, ఎప్పుడోగాని ఉపయోగానికి రానట్టియు, ఫిర్కా గ్రంథాలయాలలో లేనట్టియు ముఖ్యమైన గ్రంథాలను సేకరించి, కోరినప్పుడు ఫిర్కా గ్రంథాలయాలకు సరఫరాచేయవలెను. ఈ జిల్లా గ్రంథాలయాలపైన ఒక్కొక్క భాషాప్రాంతానికి ఒక్కొక్క రాష్ట్రీయ కేంద్రగ్రంథాలయమేర్పడ ఆయాభాషలలో ప్రకటింపబడే గ్రంథాలను పూర్తిగా సేకరించవలెను. అదేవిధంగా దేశం మొత్తానికి జాతీయ కేంద్రగ్రంథాలయమేర్పడి అన్ని భాషలలోని ప్రధాన గ్రంథాలను, వివిధ వృత్తులకు సంబంధించినట్టివన్నీ పండితులకూ పరిశోధకులకూ ఉపకరించునట్టివన్నీ గ్రంథాలను, అచ్చు పుస్తకాలతోపాటు వ్రాతప్రతులను, విజ్ఞాన సాధనకుపకరించే శాసనాలు

మొదలైన రకరకాల ఉపకరణాలను జాగ్రత్తపరచి, జాతీయ కేంద్ర గ్రంథాలయము పండితులకు, పరిశోధకులకు ముఖ్యముగ తోడ్పడు చుండవలెను. ఫిర్కా, జిల్లా కేంద్రగ్రంథాలయములకు స్థానికముగ ప్రకటితమగు పుస్తకములు, తదితర ప్రచురణములునూ, రాష్ట్రీయ, జాతీయ కేంద్రగ్రంథాలయాలకు ఆయారాష్ట్రములలోనూ, దేశం మొత్తంపైనను వెలువడు పుస్తకములు, తదితర ప్రచురణములును ఉచితముగ లభించుట కనువైన శాసనము లేర్పడవలయును. ఈ గ్రంథాలయములన్నీ పరస్పర సహకారంతో పనిచేయడానికి సహాయపడు సంయుక్త గ్రంథ పట్టికలు కూడ విరివిగ తయారు కావలెను.

ఒక్కొక్క ఫిర్కాలోని అన్ని గ్రంథాలయాలలోనూగల పుస్తకాల సంయుక్త గ్రంథపట్టికలు ఫిర్కాగ్రంథాలయాల లోను, ఫిర్కాగ్రంథాలయాల సంయుక్త గ్రంథపట్టికలు జిల్లా గ్రంథాలయాలలోను, జిల్లా గ్రంథాలయాల సంయుక్త గ్రంథపట్టికలు రాష్ట్రీయ గ్రంథాలయాలలోనూ, రాష్ట్రీయ గ్రంథాలయాల సంయుక్త గ్రంథపట్టికలు జాతీయ కేంద్ర గ్రంథాలయంలోనూ చేర్చి పెట్టిన వివిధప్రాంతాలలోని చదువరులు కోరిన పుస్తకాలను వారికందజేయడానికి అనుకూలా లేర్పడును. దేశంలోని వివిధవృత్తులు, వర్గాల అవసరాలను తీర్చ డానికేర్పడే ప్రత్యేక గ్రంథాలయాలతో కూడ పైగ్రంథాలయాలు సంబంధంపెట్టుకొనవలెను. దీని కనుగుణమైన యేర్పాట్లను ప్రభుత్వం చేయవలెను.

## పాలకుల బాధ్యతలు

ప్రభుత్వం పైన తెలిపిన యేర్పాటుల నన్నింటినీ చేసినప్పటికీ గ్రంథాలయపాలకులు తమ ధర్మాన్ని గుర్తించి అనుసరించనియెడల

గ్రంథాలయాలు ప్రజలకు సరిగా ఉపయోగపడవు. పాలకులు గ్రంథాలయ ధర్మాన్ని శ్రద్ధతో అమలు జరిపిననాడు గ్రంథాలయాలు సజీవంగా సాగగలవు. పాలకుల విధులలో ప్రధానమైనవి సిబ్బంది నియామకమూ, గ్రంథసంపాదనమూ నైయున్నవి. మన దేశంలోని గ్రంథాలయ పాలకులు పలువురు భవనముల నిర్మాణములోనూ, ఉత్సవాల నిర్వహణంలోనూ చూపే శ్రద్ధలో పదవ వంతైనా సిబ్బంది నియామకముపట్ల చూపకపోవడం శోచనీయం. గ్రంథాలయ నిర్వహణంలో సిబ్బందికిగల ప్రాధాన్యతను మన పాలకులు గుర్తించనంతవరకు మన గ్రంథాలయాలు అభివృద్ధికిరానేరవు. మనుష్యశరీరంలో హృదయ మెటువంటిదో గ్రంథాలయ సంస్థకు గ్రంథభాండాగారి అట్టివాడు. గ్రంథభాండాగారి సిబ్బందికి పెద్దగనుక గ్రంథాలయ పాలకులు భాండాగారుల నియమించునప్పుడు మెలకువతో ప్రవర్తింపవలెను. చక్కని చదువు, గ్రంథాలయ నిర్వహణకు కావలసిన శాస్త్రజ్ఞానము, అనుభవము, వివిధ విషయముల సామాన్య పరిచయము, రకరకాల గ్రంథాలను గూర్చిన జ్ఞానము, మానసిక శాస్త్రమునందభినివేశము, తోడిమానవులయెడ ప్రేమ, సంఘసేవానురక్తి, బోధనాశక్తి, వివేకము, క్రమశిక్షణ మొదలయిన అర్హతలుగల వ్యక్తులను వెదకి వారికి తగినవేతనముల నిచ్చి పోషించుటకు పాలకులు పూనిననాడు గ్రంథాలయాలు అభివృద్ధికిరాగలవు.

పుస్తక సేకరణలో కూడ సంఖ్యకంటె గుణానికి, విలువకంటె ఉపయోగానికి గ్రంథాలయ పాలకులు ప్రాధాన్యత నివ్వవలెను. మధురకవి శ్రీ నాళము కృష్ణరావుగారు తమ 'గ్రంథాలయ సూక్తుల'లో తెలిపినట్లు "ఎన్నియో చెత్తపొత్తము లున్నకన్న, ఉత్తమ గ్రంథ మొక్కటియున్న చాలు". పాఠకులెన్నడును తెరువనట్టి గ్రంథాలు ఎంతగొప్పవైనప్పటికీ, గ్రంథాలయాలు వీటిని సేకరించడానికై వెచ్చించే డబ్బంతా వృథావ్యయంగా పరిణమిస్తుంది.

చదువరుల రుచులు, కోరికలు, అవసరాలు, వృత్తులు, వయోభేదములు, చదువుల అంతస్తులనుబట్టి పుస్తకాలను కొనవలసిన పాలకులు తమ యిష్టానుసారం వీటిని కొనడం మూలంగా వీటి ఉపయోగానికి భంగపాటు కలుగుట సహజం. ఒక్కొక్క గ్రంథాలయం పుస్తకాల నిమిత్తం వెచ్చించగల స్వల్పమొత్తంలో వీలయినంత అధిక ప్రయోజనాన్ని సాధించడాని కనువైన గ్రంథాలను కొనడం పాలకుల కర్తవ్యం. పాఠకుల కుపయోగపడే పుస్తకాలతో పాటు వారి నెక్కువగా ఆకర్షించే పత్రికలనుకూడ వీరు కొనవచ్చును. ఒక్కొక్క గ్రంథాలయం పుస్తకాలు, పత్రికలతో పాటు ప్రజల విజ్ఞానవ్యాప్తికి సాయపడే ఉపకరణాలను సేకరించడానికి కూడ తమధనంలో కొంతభాగాన్ని ప్రత్యేకించడ మవసరం.

గ్రంథాలయాల పాలకులు పుస్తకసంపాదనలో తమపని తీరినట్లెంచక ప్రజానీకంలోని ప్రతియొక్కరూ తమ గ్రంథాలయాలను ఎక్కువగా వినియోగించుటకు తగిన యేర్పాట్లను చేయవలెను. స్త్రీల శాఖలు, బాల శాఖలు, వయోజన పాఠశాలలు, విజ్ఞాన గోష్ఠులు, కథా కాలక్షేపములు, ప్రదర్శనములు మొదలైన కార్యక్రమాలను చేపట్టి వీటి నిర్వహణకు కావలసిన ధనాన్ని సంతోషంతో ఖర్చుపెట్టుటకు సిద్ధపడవలెను. తమగ్రంథాలయాలను జనుల నధికంగా ఆకర్షించే పద్ధతులను వీరవలంబించవలెను. ఇంతవరకు కేర్పడ్డ పబ్లిసిటీ (ప్రచార) విధానాలు మనగ్రంథాలయాలకు పూర్తిగా తెలియదు. కనుకనే యివి వెనుకబడియున్నవి. అమెరికా మొదలైన దేశాలలోని గ్రంథాలయం ఒక్కొక్క వేలకొలది డాలర్లను వెచ్చిస్తూవుంటే దీనినిమిత్తం మన గ్రంథాలయాలు పట్టుమని పదిరూకలనైన ఖర్చుపెట్టేపాపానపోవడంలేదు. కనుకనే వీటి వినియోగం మన ఖర్చుకు అనుగుణంగానే వుంది.

## సిబ్బంది ధర్మాలు

"దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడ"న్న సామెత మన మెరిగినదే. సంఘంలోని ప్రతివ్యక్తికీ విజ్ఞానాన్ని అందుబాటులో వుంచాలనే పట్టుదలతో ప్రభుత్వమూ, పాలకులూ యెంత ప్రయత్నంచేసినా గ్రంథాలయ నిర్వహణ బాధ్యతను వహించే భాండాగారీ, తదితర సిబ్బందీ తమతమ విధులను క్రమంగా పాలిస్తేనేతప్ప ప్రయోజనముండదు. చదువరులడిగే పుస్తకాలను బీరువాలనుండి తీసి వారి కందించడంమాత్రమే సిబ్బంది పనిగాదు. సంఘంలోని వివిధ వ్యక్తులతోనూ గ్రంథాలయాలలోని రకరకాల పుస్తకాలతోనూ చక్కని పరిచయాన్ని సంపాదించి, పుస్తకాలకూ మనుష్యులకూ మధ్య సంధానకర్తలుగ యేర్పడి భాండాగారియు, అతని సహాయకులును పని చేయ గలిగిననాడు గ్రంథాలయాలు ప్రజలకు సవ్యంగా ఉపయోగపడగలవు. చదువరుల సందేహాలను సవిమర్శగా తీరుస్తూ, వారిరుచులకూ అవసరాలకూ అనుగుణమైన గ్రంథసామగ్రిని వారికందిస్తూ, ప్రజలను గ్రంథాలయాలకు ఆకర్షిస్తూ, పబ్లిసిటీద్వారానూ వైజ్ఞానిక కార్యక్రమాలద్వారానూ గ్రంథపాఠకులసంఖ్యను పెంపొందిస్తూ, కేవలం కాలక్షేపంనిమిత్తం పుస్తకాలను చదివేపాఠకులను ఉపయుక్త గ్రంథ పఠనంవైపుకు త్రిప్పుతూ, గ్రంథాలయసిబ్బంది నిరంతరాయంగానూ హృదయపూర్వకంగానూ కృషిచేయగలిగినప్పుడే గ్రంథాలయాల ప్రయోజనం లోకానికి బాగా వెల్లడి యౌతుంది. గ్రంథ భాండాగారులు పై పనులను సమర్థతతో నిర్వహించాలంటే దేశదేశాలలో గ్రంథాలయాలెట్లు నడుస్తూవున్నదీ యెప్పటికప్పుడు తెలుసుకుంటూ వుండవలెను. దీనికి గ్రంథాలయ సంబంధంగా వెలువడే పుస్తకాలు, పత్రికలు చాల సాయపడగలవు. దీనితోపాటు దేశంలో బాగా పని చేస్తున్న గ్రంథాలయాల దర్శనమూ, వీటి నిర్వాహకులతో పరి

చయమూ భాండాగారుల పనికి దోహదపడతాయి. గ్రంథాలయ సంఘాల సభ్యత్వమూ, గ్రంథాలయ మహాసభలలో పాల్గొనడమూ గ్రంథాలయ నిర్వాహకుల పనిని ఫలవంతం చేస్తాయి.

## చదువరుల విధులు

గ్రంథాలయాలు సక్రమంగా సాగాలంటే చదువరుల తోడ్పాటుకూడా అవసరం. పుస్తకాల అరువు వ్యవహారాలకు సంబంధించిన గ్రంథాలయ నిబంధనలు యేవిధిగాని యిబ్బందిపెట్టుటకు గాక, సంఘంలోని సర్వజనులకూ గ్రంథాలయం సమంగా ఉపకరించేలాగు చేయుటకే యేర్పాటైవున్న సంగతిని పాఠకులు గ్రహించాలి. కేవలం స్వార్థానికి లోనుగాక, తోటి పాఠకుల అవసరాలను కూడ గుర్తించి, తనవలన అనవసరంగా యితరులకేలాటి విఘ్నం కలుగకుండా ప్రతిపాఠకుడూ జాగ్రత్తపడాలి. తమ విధులను పాలించు సందర్భాలలో గ్రంథభాండాగారుల సూచనలను సిరా సంతోషంతో అమలుపరచాలి. అప్పుడే గ్రంథాలయాలు తమ విధిని చక్కగా నెరవేర్చగలుగుతాయి. గ్రంథాలయ నిర్వహణం ఆదర్శంగా సాగుతుంది.

# స్త్రీలు - గ్రంథాలయములు

మానవసంఘంలో స్త్రీలజనాభా సగానికి పైగా వుంది. వివిధ దేశాలలో నడుస్తూవుండిన సాంప్రదాయాల ఫలితంగా సంఘంలో స్త్రీ స్థానం కొంత న్యూనావస్థలో పడింది. కాని లోకంలో అక్కడక్కడ బయలుదేరిన సంఘ సంస్కర్తల పుణ్యమా అంటూ మానవసమాజంలో స్త్రీకిగల ప్రాధాన్యత రానురాను పెరగడానికవకాశమేర్పడింది. ఒక్క భారతభూమిలోమాత్రం చాలకాలానికి ముందే మాతృస్థానానికి చెందిన స్త్రీమూర్తి గణ్యతను సంపాదించింది. నేడబలగా పరిగణింపబడుతూవున్న స్త్రీ యుద్ధభూమిలో మహాశక్తియై విజృంభించి శత్రుసంహారం చేసి విజయపతాకము నెత్తిన ఘటనలు, అవిద్యకు నేడాటపట్టుగానున్న మహిళ కవితల్లడంలోనూ, పాండిత్యప్రకర్షలోనూ ఘనతకెక్కడమేగాక హిందూమతానికి మూలగ్రంథాలైన వేదాలలోని కొన్ని ఋక్కులకు సహితం కర్తగా వుండిన సమాచారాలు, పూర్వకాలంలో శారీరకంగాను, మానసికంగానూ, ఆధ్యాత్మికంగాకూడ భారతస్త్రీలు అభివృద్ధిపథాన నడిచినట్లు మనకు తెలియజేస్తూ వున్నవి. ఇట్టి మహర్దశనుండి పతనమైన భారతనారీలోకం వుద్ధరింపబడాలంటే స్త్రీలలో విద్యావ్యాప్తి ముఖ్యంగా జరగాలి.

ఆధునిక విద్యా వ్యాపక సంస్థలలో ప్రథమంగా పేర్కొనదగినవి పాఠశాలలు, కళాశాలలు మున్నగుసంస్థలే. కాని వీటికి గల నియమ నిబంధన మూలంగా స్వేచ్ఛా వాతావరణంలో ప్రజానీకం తమ తమ అవసరాలకు, అభిరుచులకు, శక్తి యుక్తులకు అనుగుణంగా విద్యాసముపార్జన చేయడానికి వీలులేకుండావుంది. పాఠశాలలు వగైరా విద్యాసంస్థల యిబ్బందులను గమనించిన బుద్ధి

మంతులు వీటి కతీతమైన నూతన వ్యవస్థను కనిపెట్టి ప్రచారం లోకి తేవడంతో లోకంలో జనసామాన్యం సులభంగా విద్య నార్జించడానికి చక్కని అవకాశం చిక్కింది. సంఘంలోని సర్వులనూ సమంగా ఆదరించడాని కనువైన సార్వజనీన విశ్వవిద్యాలయంగా పేరుపొందిన గ్రంథాలయంద్వారా లోకంలో విజ్ఞాన ప్రచారం విరివిగా సాగుతూవుంది. విద్యాలయాలలోని తరగతులు, హాజరు షరతులు, పాఠ్యక్రమాలు, పరీక్షలు, జీతాలు వగైరా నిర్బంధాలు గ్రంథాలయాలలో లేనందువలన ఇచ్చట పుత్సాహంగా చదువులు సాగడానికెంతో అవకాశాలేర్పడ్డాయి. ఈ అవకాశాలను నాగరిక దేశాల ప్రజలు చక్కగా వినియోగించుకుంటూ అన్నివిధాలా అభివృద్ధిపొందుతూ వున్నారు. వినోదాన్నీ, వివేకాన్నీ, విత్తాన్నీ చేకూర్చడానికి ఆయాదేశాల గ్రంథాలయాలు ప్రజల కెంతో ఉపయోగపడుతూ వున్నవి. పెద్దలకూ-పిన్నలకూ, పండితులకూ-పామరులకూ, పట్టణవాసులకూ - పల్లెటూరి వారికీ, ధనికులకూ-పేదలకూ, ఆరోగ్యవంతులకూ - రోగులకూ మాత్రమే గాక కడకు కండ్లులేని అనాథులైన అంధులకు సహితం ఆధునిక గ్రంథాలయాలు సమంగా ఉపకరిస్తున్నాయి. చాల దేశాలలో స్త్రీలును పురుషులతోపాటు వాటి నుపయోగించుకొంటూ, తమ జీవయాత్రను సుఖంగానూ పురుషార్థ సాధకంగానూ నడుపుకొంటున్నారు.

ప్రస్తుతావస్థలో మనదేశ పురుషులలోనే గ్రంథాలయాల కార్యక్రమం సక్రమంగా సాగడంలేదంటే విద్యావిహీనత హెచ్చుగా నున్న స్త్రీలవిషయం వేరే చెప్పవలసిన పనిలేదు. దేశం బాగుపడాలంటే పురుషులను ఆపియైనా ఒకతరంలో స్త్రీలనందరినీ విద్యావతులుగా చేయడమవసరమని ఆంధ్రావనికి యుగపురుషుడగు శ్రీ వీరేశలింగంగారు చెప్పిన మహావాక్యాన్ని మనం మరువరాదు. స్త్రీలు

విద్యావతులు కావడమంటే సామాన్యంగా వ్రాయను, చదువను నేర్వడంతో సరిపోతుందనుకోగూడదు. ఉత్తమ మాతగా, ఆదర్శ గృహిణిగా జీవయాత్రను సాగించడానికి కావలసిన సర్వవిధ పరిజ్ఞానాన్ని ప్రతిస్త్రీ సంపాదించాలి. ఇండ్లను భూతల స్వర్గాలుగా మార్చి ప్రపంచ కల్యాణానికి ప్రాతిపదికలను నిర్మించడాని కనువైన యోగ్యతలను స్త్రీలు సంపాదించాలి. దీని కనుకూలించే సమస్త విజ్ఞాన సాధనాలను గ్రంథాలయాలు సమకూర్చి వీటిని స్త్రీలలో విరివిగా ప్రచారం చేయాలి. ఈ పని చక్కగా సాగడాని కనుకూలమైన కార్యక్రమాన్ని మన గ్రంథాలయాలు చేపట్టాలి.

మన స్త్రీలు పురుషులవలె స్వేచ్ఛగా గ్రంథాలయాలకు వెళ్లి తమకు తగిన గ్రంథముల నెంచుకొని వీటిని ఉపయోగించుకోవడం పొసగదు. కాబట్టి వీరినిమిత్తం గ్రంథాలయాలే తమ పుస్తకాలను ప్రత్యేక మిండ్లకు పంపే పద్ధతిని అమలుచేయడ మవసరం. ఈ కార్యక్రమం సక్రమంగానూ నిరంతరాయంగానూ సాగితే తప్ప ప్రయోజన ముండదు. స్త్రీల అభిరుచులకు అవసరాలకు అనుగుణమైన అన్ని రకాల గ్రంథాలను పెట్టెలలోపెట్టి అప్పుడప్పుడు యిండ్లకు పంపుతూ వుంటే ఎవరి యోగ్యతలకు రుచులకు తగిన గ్రంథాలను వారు స్వయంగా యెంచుకొని తీసుకొని చదువుకొంటారు. ఈ పుస్తకాలతో పాటు గ్రంథాలయంలో వున్న పుస్తకాల పూర్తి జాబితాలను–విషయాన్ని బట్టి విభజించి వ్రాసిన గ్రంథపట్టిక (కేటలాగు) లను కూడా స్త్రీలకు చూపుతూవుంటే జాబితాను చూచుకొని వారి కనుకూలించే గ్రంథాలను వారడిగి తెప్పించుకోడానికి అవకాశముంటుంది. ఇంత మాత్రంతో సంతృప్తి చెందక అప్పుడప్పుడు ప్రదర్శనాలు, పండుగలు, వేడుకలు యేర్పాటుచేసి ఆసమయాలలో స్త్రీలకు ప్రత్యేక వసతులను కల్పించి వారు స్వయంగా గ్రంథాలయాలలోనిపుస్తకాలన్నింటినిచూడడానికి వీలుకల్పించడ మవసరం.

వీలును బట్టి నెలలో కొన్ని దినాలుగాని, వారంలో కనీసం ఒకరోజుగాని స్త్రీలకు మాత్రమే గ్రంథాలయాన్ని ఉపయోగపెట్టి ఆదినాలలో స్త్రీలు హెచ్చుగా గ్రంథాలయానికి వచ్చేటట్లుచేసి, పుస్తకాలిచ్చి పుచ్చుకోవడంతోపాటు పురాణ కథాకాలక్షేపాలు, ఆటపాటలు, విజ్ఞానయుతమైన యిష్టాగోష్ఠులు, చర్చలు, రేడియో కార్యక్రమాలు, స్త్రీలకుపయోగించే వివిధ ప్రసంగాలు యేర్పాటు చేయడం చాలా ప్రయోజనకారిగా వుంటుంది.

అవకాశమున్న తావులలో స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలను ఏర్పరచడం ద్వారాగాని, మామూలు గ్రంథాలయాలలో బాలశాఖలతో చేర్చి స్త్రీల శాఖలను నెలకొల్పడం ద్వారాగాని, ప్రతినిత్యమూ నిర్ణీతసమయాలలో-ముఖ్యంగా స్త్రీలకు వీలుగావుండే మధ్యాహ్నపు వేళల్లో-వారిని చేర్చి వయోజన విద్యావ్యాప్తి కనువైన కార్యక్రమాలను యేర్పరచడం లెస్సయైనపని. మామూలు చదువులకు తోడుగా వడకుట, కుట్టుపని, అల్లికపని, ముగ్గులు వేయడం, చిత్రలేఖనము, సంగీతము మున్నగు కళలను, గృహనిర్వహణానికి సంబంధించిన యితర విషయాలను అభ్యసించడానికి అనుకూలాలను యేర్పరచడం ద్వారా స్త్రీల గ్రంథాలయాల కార్యక్రమం చక్కగా సాగుతుంది.

ఈ కార్యకలాపాలన్నీ సవ్యంగా సాగాలంటే సమర్థులైన కార్యకర్త్రులు కావలెను. విద్యావినయములకు తోడుగా శాంత చిత్తము, ప్రసన్న ముఖము, ప్రేమస్వభావము, శీలము, సేవాపర తంత్రత, పరోపకారబుద్ధి కలిగి ఓపికతోనూ పట్టుదలతోనూ వీరు పనిచేయగలిగినప్పుడే యీ కార్యక్రమ ముత్సాహాముగ నడచును. పై యోగ్యతలకు తోడుగా వీరు సాంఘిక శాస్త్రంలోనూ మానసిక శాస్త్రంలోనూ పరిచయాన్ని, గ్రంథాలయశాస్త్రంలో ప్రవే

శాన్ని సంపాదించినట్లైన బంగారానికి సువాసన అబ్బినట్లుండును. ఈ అర్హతలుగల విదుషీమణులను అచ్చటచ్చట నియమించి వీరి పోషణ బాధ్యతను ప్రభుత్వం స్వీకరిస్తూ, తక్కిన కార్యభారాన్ని స్థానిక గ్రంథాలయాలు పైన పెట్టుకున్నట్లైన మనస్త్రీలకు ఆదర్శమైన గ్రంథాలయ సేవను అందుబాటులో వుంచడానికి అవకాశముంటుంది. ప్రజారాజ్యంలో ప్రభుత్వము, ప్రజలు పరస్పరసహకారంతో కార్యక్రమాలు సాగించగలిగినప్పుడే దేశ మభివృద్ధి చెందుతుంది.

# గ్రంథాలయాలు : ఆచూకీశాఖ *

గ్రంథాలయంలోని కొన్ని గ్రంథాలను - విషయాన్ని బట్టి వరుసగా మొదటినుండి చివరవరకూ యేక దీక్షగా చదవడానికి వీలు లేనట్టి వాటినీ, తరుచు పాఠకులు కోరే అనేకవిషయాలను తెలుపుతూ వారి సందేహాలను తీర్చ సమర్థమైన వాటినీ, వివిధ కారణాలచేత ఇంటి కివ్వడానికి అనుకూలంగా లేని వాటినీ - తక్కిన గ్రంథాలనుండి వేరు పరచి ప్రత్యేకంగా బీరువాలలో పేర్చిపెట్టడం నేటి గ్రంథాలయాల నిర్వహణంలో విధిగా యేర్పడింది. ఈవిధంగా వేరుపరచిన గ్రంథాల నుపయోగించుటకు గ్రంథాలయములో ప్రత్యేకవసతి ఉండును. పైన పేర్కొన్న గ్రంథాలు ప్రధానంగా ఆచూకీ (Reference) నిమిత్తం ఉపయోగపడును గనుక వీటిని పేర్చిన విభాగమును 'ఆచూకీశాఖ' (Reference section) అంటారు. మామూలుగా పాఠకుల కింటికిచ్చే పుస్తకాలు పేర్చిన భాగానికి 'ప్రచార శాఖ' యని పేరు. ఈ రెండు శాఖలలోని గ్రంథాలను విషయాన్ని బట్టి విభజించి ఈ విషయాలను అనుకూలమైన క్రమంలో పేరుస్తారు.

ఆచూకీశాఖలోని గ్రంథాలను ప్రధానంగా మూడు తరగతుల క్రింద విభజించవచ్చును.

౧. తక్షణ ఆచూకీ గ్రంథములు-వీటిని ఆంగ్లంలో 'రెడీ రిఫ రెన్సు పుస్తకా'లంటారు. నిఘంటువులు, విజ్ఞానసర్వస్వాలు వగైరా యీ తరగతిలో చేరును.

౨. వివిధసమాచారములను తెలిపే ఉద్గ్రంథాలు - ప్రపంచ దర్శిని, ఇండియన్ ఇయ్యర్ బుక్ మొదలైనవి యీతరగతిలో చేరును.

* సంయుక్త వ్యాసకర్త్రి : శ్రీమతి యలమంచిలి సరస్వతి

3. ఇండ్ల కరు వియ్యడానికి వీలులేని అన్నిరకాల గ్రంథాలు- సులభంగా అటూ యిటూ త్రిప్పడాని కనుకూలంగాని బరువుపాటి పెద్దసైజువీ, పోతే మళ్లీ దొరకనివీ, మిక్కిలి వెలగలవీ యీవర్గంలో చేరును.

ఇందులో ఒకటి రెండు తరగతుల పుస్తకాలు ఆచూకీశాఖ యొక్క ప్రధానాదర్శమైన సమాచారములను కావలసినవారి కంద జేయుచుండును. ఆచూకీ శాఖకు ఆధారభూతమైనవి తక్షణ ఆచూకీ గ్రంథాలు. నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు, వాఙ్మయసూచికలు, విషయ సంగ్రహణసూచికలు (Concordances), దేశపటముల పుస్తకాలు (అట్లాసులు), పంచాంగాలు, వివిధ గ్రంథాలయాల కేట లాగులు మొదలైనవి తక్షణ ఆచూకీ గ్రంథాలలో చేరును. వీటిలో కొన్ని ఉత్సాహంగా మొదటినుండి చివరవరకూ చదవడానికి యోగ్య మైనవికావు. కొన్నింటిని వరుసగా చదవడానికి బొత్తుగా కుదరదు. ఇందులో అత్యధిక భాగమును పాఠకులు సందేహనివారణకై తరచు అడుగుచుందురు. కనుక ఇతర పాఠకుల అనుకూలానికి భంగంకలగ కుండా వుండాలంటే వీటిని అరువీయరాదు. ఇట్టి గ్రంథాలను నిర్ణయించి వీటిని ప్రత్యేకంగా ఆచూకీ శాఖలో పేర్చిపెట్టుటవసరం.

ఆచూకీ శాఖలో చేర్చదగిన మొదటి రెండుతరగతులకు చెందిన వివిధగ్రంథముల నిచ్చట జాబితాచేయ ప్రయత్నింతుము.

(అ) వివిధభాషలలోని నిఘంటువులు.

(ఆ) వివిధవిషయములకు ఉమ్మడిగాను, ప్రత్యేక ప్రత్యేక ముగాను చెందిన విజ్ఞాన సర్వస్వములు.

(ఇ) అట్లాసులు, దేశపటములు (మ్యాపులు), గజెటీరులు

(ఈ) వాఙ్మయ సూచికలు - ఒక్కొక్క దేశమునకు సంబంధించినవి, గ్రంథవిక్రేతలవి, సర్వసాధారణమైనవి, ఒక్కొక్క విషయమునకు సంబంధించినవి.

(ఉ) వార్షికసంచికలు, పంచాంగములు, వార్షిక అంకశ్రేణులు (Statistical annuals)

(ఊ) వివిధవృత్తులయు, సంస్థలయు డైరెక్టరీలు

(ఋ) అనుక్రమణికలు (ఇండెక్సులు)

(ౠ) ఇతర గ్రంథాలయాల కేటలాగులు

ఇక మూడవ తరగతిలో చేరుపుస్తకాల వివరాల నిచ్చి వీటిని ఆచూకీశాఖలో చేర్చుటకుగల కారణాలను తెలుప బ్రయత్నింతుము.

అధికమైన బరువు, విస్తారమైన పరిమాణము మూలంగా ఒకచోటనుండి మరొకచోటికి సులభంగా చేరవేయడానికి అనుకూలంగాని గ్రంథముల నింట్ల కిచ్చేయెడల యివి భద్రముగ నుండుట పొసగదు. ఇట్లే మిక్కిలి విలువగల గ్రంథములనుకూడ అరువిచ్చిన వీని కేదైన భంగపాటు కలుగవచ్చును. అప్పుడు పాఠకులు వీని విలువను చెల్లించవలసినప్పుడు యిబ్బందియగును. అపురూప గ్రంథములలో చేరు ప్రాచీన గ్రంథములు, వ్రాతప్రతులు, పత్రికల పాత సంపుటములు ప్రమాదమువలన పోయినచో తిరిగి సంపాదించుట కష్టము. బొమ్మలు అధికంగా వున్న పుస్తకాలను అరువిచ్చేపక్షంలో తగుజాగ్రత్తతో పాఠకులు వీటి నుపయోగపరచుకొని భద్రంగా గ్రంథాలయానికి చేర్చుట కుదరదు. పై దర్జాకు చెందిన సాంకేతిక గ్రంథములు, ప్రభుత్వ ప్రచురణలు, పరిషత్తుల ప్రచురణలు సాధారణముగా పండితులకు పరిశోధకులకు మాత్రమే ఉపయోగపడును. ఒక్కొక్క గ్రంథాలయము సేకరించు

ప్రత్యేక గ్రంథావళులు ఆ యా విషయములనుగూర్చి తెలియగోరు వారికి మాత్రముపకరించును. ఇందుకొరకై యెవ్వరెప్పుడు వచ్చి అడిగినను వారికి కావలసిన గ్రంథములు గ్రంథాలయంలో సిద్ధంగా వుండవలెను.

పుస్తకరూపంలో నున్న విజ్ఞానసాధనాలతోపాటు గ్రంథాలయాలు సేకరించే అన్యవిధసాధనాలును కొన్ని గలవు. వివిధవిషయాలను గూర్చి పత్రికలలో వ్రాయబడిన వ్యాసములు వగైరాల కత్తిరింపులు, కరపత్రములు, అచ్చుచీటీలు, మ్యాపులు లాంతరు స్లైడులు, బొమ్మలు, గ్రామఫోనురికార్డులు యీ వర్గంలోనివి. ఇందు కొన్ని అపురూపమైనవి; కొన్ని నలుగురూ చేరినప్పుడు నుపయోగించదగినవి. కనుక వీటిని గ్రంథాలయంలోనే సురక్షితమైన తావున భద్రపరచడ మవసరం.

మరీ చిన్నసైజు పుస్తకాలను ప్రచారశాఖలో వుంచే యెడల కొంచెం చేయాడింపు స్వభావంగలవారు వీనిని దొంగిలించవచ్చు. లేదా పెద్దపుస్తకాలలో యివి కలిసిపోయి చదువరులకు దొరకకుండా పోవచ్చు. కనుక వీటిని ప్రచార శాఖనుండి తొలగించి గ్రంథభాండాగారి అధీనములో నుంచుకొని అడిగినవారి కిచ్చుచుండవలెను.

నిషిద్ధగ్రంథాలు రెండురకాలు. రాజకీయ కారణాలచేతగాని, నైతిక కారణాలచేతగాని ప్రభుత్వం నిషేధించినవి; స్త్రీ పురుష సంబంధమైనవి. ఇందులో మొదటి రకానికి చెందిన రాజకీయ గ్రంథాలను గ్రంథాలయాలలో ఉంచరాదనడం మనకంతా తెలిసిన సామాన్య విషయమే. కాని కలకత్తా హైకోర్టులో కొంతకాలం క్రితం యీ విషయమై ఒక తీర్పు జరిగినట్లు తెలిసినది. ప్రభుత్వం నిషేధించిన గ్రంథాలను కూడా గ్రంథాలయాలలో నుంచవచ్చుననీ, అయితే వీటిని మామూలుగా ప్రచారంలో పెట్టక, పరిశోధకులకు

కావలసినప్పు డుపయోగించుకొనడాని కనుకూలాలు కల్పించవచ్చు ననీ పై తీర్పులో నున్నట్లుకూడ విన్నాము. ప్రభుత్వం నిషేధించిన శృంగార ప్రబంధాల విషయంలో ప్రజాసామాన్యంలో ప్రచారానికి గాక పండితుల ఉపయోగం కొరకు వీటి నచ్చువేయడానికి ప్రభుత్వ మంగీకరిస్తుంది. కనుక నిషిద్ధ గ్రంథాల నన్నిటిని ప్రచారశాఖనుండి తొలగించి భాండాగారి అధీనంలో నుంచుకొని అవసరార్థం వడిగి నప్పుడు యిచ్చుచుండవచ్చును.

ఇక రెండవవర్గానికి చెందిన స్త్రీపురుషసంబంధమైన గ్రంథా లను వివిధ వయస్సుల పాఠకులు స్వేచ్ఛగా ఉపయోగించుకొనుట కవకాశమున్న ప్రచారశాఖనుండి తొలగించి అమూకీశాఖలో గ్రంథ భాండాగారి అధీనంలో వుంచుకోవలెను.

అమూకీశాఖలో నుంచదగిన గ్రంథాలలో [illegible] హెచ్చు గిరాకీగల పుస్తకాలు. ఒక్కొక్క సమయంలో కొన్ని గ్రంథాలను చదువరులు పలువురు అడుగుతూ వుంటారు. వరుసప్రకారం యిట్టి పుస్తకాలను అరువిచ్చినప్పటికీ వీటిని కోరేవారందరూ చదవ డానికి కొన్నినెలలు పడుతుంది. పాఠకుడు చదివే యే కొంత సమయంలోనో తప్ప తక్కిన వేళలంతా యీ పుస్తకా లతని యింటివద్ద నిరుపయోగంగా పడివుంటాయి. కనుక వీటికి గిరాకీ హెచ్చుగా వున్నన్నాళ్లూ గ్రంథాలయంలోని అమూకీశాఖలో వుంచి గ్రంథాలయం తెరచివున్నప్పుడు యెవరి అనుకూలాన్ని బట్టి వారిచ్ఛ కికి వచ్చి చదువుకోవచ్చునంటే అందరికీ సమానమైన అవకాశ మేర్పడి గ్రంథాలయధర్మం నెరవేరుతుంది.

# సంచార గ్రంథాలయాలు

సంఘంలోని ప్రతి వ్యక్తికీ పుస్తకాల నందజేయవలసినవిధి గ్రంథాలయాలపై నున్నది. విద్యాప్రియులైన పట్టణవాసులు తమ విజ్ఞానాభివృద్ధికై శ్రద్ధతో గ్రంథాలయాలకు వెళ్లి తమకు కావలసిన పుస్తకాలను తీసుకొని వీలున్నప్పుడు అచ్చటనే చదువుకోవడం, అవసరమైనప్పుడు ఇండ్లకు తెచ్చుకోవడం సహజంగా జరుగుతూ వుంటుంది. శ్రద్ధలేని కారణంచేత స్వయంగా గ్రంథాలయాలకు వెళ్లని జనానికీ, దేశాచారాన్ని బట్టి పురుషులవలె గ్రంథాలయాలకు స్వేచ్ఛగా వెళ్లడం అలవాటులేని స్త్రీలకూ, గ్రంథాలయాలు అందుబాటులోలేని పల్లెప్రజలు వగైరాలకూ సేవచేయడం నిమిత్తం యేర్పడినవే సంచార గ్రంథాలయాలు. ఇవి స్వయంగా ప్రజలను సమీపించి, వారిలో జ్ఞానపిపాసను రేకెత్తించి, వారికి విజ్ఞానంతో పాటు వివేకాన్నీ వినోదాన్నీ ప్రసాదించును. వీటి ప్రయోజనాన్ని చవిజూచిన ప్రజానీకం కొంతకాలానికి తమ కందుబాటులో గ్రంథాలయాలను నెలకొల్పుకోవడం కూడా జరుగును. కనుక గ్రంథాలయ సేవలో సంచార గ్రంథాలయ పద్ధతి మిక్కిలి శక్తివంతమైనదని చెప్పవచ్చును.

## మదరాసు ప్రభుత్వ ప్రణాళిక

ప్రస్తుత పరిస్థితులలో మన దేశంలో ఊరూరా గ్రంథాలయాలను నెలకొల్పి వీటిని సర్వాంగ సౌష్టవంగా సాగించడం సాధ్యంగాని పని. గ్రామగ్రామానగల పదుల చదువరులకోసం వందలాది ధనం వెచ్చించి విడివిడిగ గ్రంథాలయాలను నిర్వహించడానికి తగిన అనుకూలాలు మనకిప్పుడు లేవు. ఆర్థికంగా కూడ యీ పద్ధతి నష్టదా

యక మైనది. కనుక పల్లెప్రాంతాలలో ఫిర్కా కొక్కటి చొప్పున కేంద్ర గ్రంథాలయాలను స్థాపించి, ఈ కేంద్ర గ్రంథాలయాల నుండి ఆ యా ఫిర్కాలలోని గ్రామాలకు సంచార గ్రంథాలయపద్ధతి ద్వారా పుస్తకాలను అందజేసే కార్య క్రమం చాలా మంచిది. ఈ విధానం ద్వారా ఎక్కువ జనాభాకు తక్కువ వ్యయంతో చక్కగా గ్రంథాలయ సేవను చేయడాని కవ కాశముంటుంది. దీనిని మదరాసు ప్రభుత్వంలోని ఫిర్కా డెవలెప్ మెంటు డిపార్టుమెంటు వారవలంబించి గ్రామాలలో గ్రంథాలయ సేవకు పూనుకొన్నారు. అయితే ప్రస్తుతం వీరు జిల్లాకొక్కఫిర్కాను మాత్రమెంచుకొని యీ ప్రణాళికను సాగిస్తున్నారు. వీరిదృష్టి విద్యార్థులవైపుకూ, అక్షరాస్యులైన వయోజనులవైపుకూ మరలింది. ఫిర్కా ప్రధాన గ్రామంలో కేంద్ర గ్రంథాలయాన్ని స్థాపించి దీని నిర్వహణ కొక గ్రంథభాండాగారిని, గ్రామాలకు పుస్తకాలను చేర వేయడానికొక సేవకునీ వీరు నియమిస్తున్నారు. ఫిర్కాలోని ప్రతి గ్రామంలోనూ స్థానిక గ్రంథభాండాగారులను నియమించి వీరిద్వారా గ్రామాలలో పుస్తకాలను పంచడానికేర్పాట్లు చేస్తున్నారు. ఈఫిర్కా గ్రంథాలయాలకు ఫిర్కాడెవలెప్ మెంటు డిపార్టుమెంటువారు యాజ మాన్యం వహిస్తున్నారు. వీటి నిర్వహణ బాధ్యతను ఫిర్కా డెవ లెప్ మెంటు ఆఫీసర్లు వహించి కేంద్ర గ్రంథాలయాలకూ, గ్రామా లకూ సరఫరాచేసే పుస్తకాల వినియోగానికి నిబంధనలను తయారు చేస్తారు. స్థానికంగా వుండే స్కూల్ల డెప్యూటీ ఇన్‌స్పెక్టర్లు యీ గ్రంథాలయాలను తనిఖీచేసి వీటి అభివృద్ధి విషయంలో సల హాలిస్తూ వుంటారు.

## గ్రంథ భాండాగారులు

ఇన్ని యేర్పాటులున్నా యీ ప్రణాళిక విజయవంతంగా సాగు తున్నట్లు కనబడదు. కారణం దీనికి ప్రాణాధారులైన గ్రంథభాండా

గారుల విషయంలో ప్రభుత్వం చిన్నచూపు చూడడమే. ఈ పనిని సమర్థతతో సాగించడానికి చాలిన విద్యాబుద్ధులు, గ్రంథాలయ శాస్త్రవిజ్ఞానము, నిర్వహణానుభవము లేనివారిని మాత్రమే ఆకర్షించుట కనువైన స్వల్పవేతనముపై కేంద్ర గ్రంథాలయాధికారియు, ఉచితముగ స్థానిక గ్రంథ భాండాగారులును పనిచేయవలసి వచ్చుటచే యీ కార్యక్రమం ఉత్సాహంగా నడవడంలేదు. ప్రజలకు హెచ్చుగా యీ సేవ పనికివచ్చుటలేదు.

స్థాయీ గ్రంథాలయాలను నిర్వహించే భాండాగారులకువలెనే జనసామాన్యంలోని అధిక సంఖ్యాకుల అంతస్థుకు మిగిలిన విద్యార్హత, గ్రంథాలయ శిక్షణము, ప్రపంచజ్ఞానము, మనోవిజ్ఞానము, ఆకర్షవంతమైన వయోరూపశీలములు, సేవాబుద్ధి సంచార గ్రంథ భాండాగారికి అవసరం. వీటికి తోడు శరీరదార్ఢ్యము, క్రమబద్ధ జీవనము, సాంఘిక విజ్ఞానము, కలుపుగోలుతనము యితనికుండవలెను. స్థానిక సేవకులలో ఉత్సాహాన్ని, విశ్వాసాన్ని, విజ్ఞానాన్ని ప్రబోధించగల నేర్పు యితని అర్హతలలో ప్రధానమైనది. ఉపన్యాసపాటవము, బోధనా సామర్థ్యము ప్రజల నాకర్షించి వారిని పుస్తకాలవైపుకు మరల్చుటకు తోడుపడును.

పై అర్హతలుగల వ్యక్తి సంచార గ్రంథభాండాగారిగా యేర్పడి తన కార్యక్షేత్రంలోని వివిధ సాంఘిక, విద్యాసంస్థలతో సంబంధాన్ని పెంపొందించుకొంటూ పాఠకసంఘాలను స్థాపించి వాటి నిర్వహణకు సాయపడుతూ, గ్రంథాలయ ప్రచారానికనుకూలిస్తూ ప్రజల విజ్ఞానాభివృద్ధికి తోడుపడే కార్యక్రమాలను సాగిస్తూ, చుట్టుముట్టు గ్రంథాలయాలతో పరస్పర సహకారాన్ని నెరపుతూ, గ్రంథాలయ యాత్రలలోనూ, మహాసభలలోనూ, గ్రంథాలయ సంఘాల సమావేశాలలోనూ పాల్గొంటూ, విద్యాశాఖోద్యోగులతో

స్నేహంచేస్తూ, స్థానిక గ్రంథభాండాగారులను తరచు కలుసుకుంటూ కార్యక్రమాన్ని సాగించిననాడు ఏట్టి ప్రణాళికగాని సత్ఫలితములను ప్రసాదించగలదు.

సంచార గ్రంథాలయాల నిర్వహణంలో స్థానిక భాండాగారుల నియామక మొక చిక్కుసమస్య. పలుకుబడి వున్నప్పటికీ అధికార ధూర్వహత్వమును ప్రదర్శించు గ్రామాధికార్లు మొదలైన పెత్తనదార్లుగానీ, తమ మెత్తదనంవల్ల ప్రజల దృష్టిలో చులకనగావుండే కేవల సాత్విక బుద్ధులుగానీ యీయుద్యోగానికి పనికిరారు. కేవల పండితులకన్న ప్రజాదరణ, పరోపకారబుద్ధి, ప్రపంచజ్ఞానముగల సామాన్యులే పదవికి అర్హులుగా వుందురు. గ్రామములలో పార్టీలున్నప్పుడు అందరికీ అనుకూలుడైనవ్యక్తి లభించనియెడల ఒకరికంటె యెక్కువమందిని స్థానిక భాండాగారులుగ నేర్పరచుట సబబైనపని. యోగ్యత, ఆసక్తిగల ఉపాధ్యాయులను స్థానిక భాండాగారులుగ నియమించి, ఇందుక్రింద వారికి కొంత భృతిని చెల్లించి పనిచేయించుకొన్ననాడు సంచార గ్రంథాలయసేవ చక్కగా సాగుతుంది.

## గ్రంథవరణం

గ్రంథాలయనిర్వహణంలో గ్రంథవరణ ప్రథమకార్యం ప్రధాన కార్యంకూడ. నేటి మనగ్రంథాలయాలలోని పుస్తకాలు చాల నిరుపయోగంగావుండిపోవడం మనంచూడవచ్చు. 'అధ్యయనంకొరకు పుస్తకా'లనే గ్రంథాలయప్రథమసూత్రాన్ని విస్మరించి, సంఖ్యకొరకు ఘనత కొరకు పుస్తకాలను సేకరించే పద్ధతివలననే మన గ్రంథాలయాల కార్యకర్తలు తమ గ్రంథాలయాల ఉపయోగాన్ని పెంపొందించ లేకున్నారు. గ్రామసీమలలోని ప్రజానీకం రుచులూ, అవసరాలూ, అంతస్థులూ గమనించి వీటికనుకూలంగా గ్రంథములను సేకరించిన యెడల వీటిని ప్రజలెక్కువగా చదువుతారు. సామాన్యంగా అన్ని

విషయాలలోనూ ప్రాథమిక గ్రంథాలే ప్రజాసామాన్యానికి అనుకూలంగా వుండును. సులభశైలిలో, సుఖంగా చదవడానికి యోగ్యమైన పరిమాణంగల అక్షరాలలో, ఆకర్షవంతమైనట్టియు విషయానుగుణమైనట్టియు బొమ్మలుగల గ్రంథాలు సామాన్యులకు చక్కగా నచ్చును. గ్రామీణప్రజల కాలక్షేపాని కనుకూలించే నవలలు, కథలు, ఖండకావ్యములు, నాటకాలు, యాత్రల పుస్తకాలు; జనుల నిత్యజీవితావసరాలకు సంబంధించిన వ్యవసాయ, ఆరోగ్య గ్రంథాలు; ప్రత్యేక వృత్తులవారి కుపయోగించే వివిధ పారిశ్రామిక గ్రంథాలు; సృష్టి వైచిత్ర్యాలను విప్పి చెప్పే సామాన్య వైజ్ఞానిక గ్రంథాలు; జీవితవికాసానికి దోహదాన్నిచ్చే మహాపురుషుల జీవిత చరిత్రలు సంచార గ్రంథాలయాలకు హెచ్చుగా ఉపయోగపడతాయి. బాలవాఙ్మయమును, కుట్టుపని - అల్లిక పని - పాకకళ - గృహనిర్వహణము - పిల్లల పెంపకము - ఉద్యానకృషి మొదలైన విషయాలకు సంబంధించిన స్త్రీల సారస్వతమును సంచార గ్రంథాలయాలు తగినంత సేకరించవలెను. భారతం వగైరా పురాణగ్రంథాలు పద్యంలోకంటె వచనంలోవుంటే యెక్కువ వాడుకలోకి వస్తాయి. గ్రామాలు, అందలి పాఠకుల సంఖ్యను బట్టి ఎక్కువమంది కోరేపుస్తకాల ప్రతులు తగినన్ని కొనాలి. భాషలో కొంతలోటున్నా పదిమందీ అడిగే గ్రంథాలను (నిషిద్ధం కానప్పుడు) విధిగా కొనవలసివుంటుంది. లేకుంటే పాఠకు లసంతృప్తిపడి గ్రంథాలయాలకు దూరమవుతారు. తాత్కాలిక ప్రాధాన్యతగల విషయాలకు సంబంధించిన పుస్తకాల ప్రతులను గిరాకీ యెక్కువగా వున్నదని అధికంగా కొనగూడదు. ఎవ్వరూ అడగడంలేదుగదా అని యెప్పటికైనా ఉపయోగించే ముఖ్య గ్రంథాలను విడిచిపెట్టరాదు. ఈ రకం గ్రంథాలను ముందు సంపాదించి పాఠకులను వీటివైపుకు త్రిప్పేప్రయత్నం చేయాలి. గ్రామీణుల, గ్రంథ పాఠ

కుల సందేహాలను తీర్చగల నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు మొదలైన ఆచూకీ గ్రంథాలను, స్థానిక గ్రంథాలను * ముఖ్యంగా సేకరించవలెను. సంఘసేవకులైన ఉపాధ్యాయులు, వైద్యులు, గ్రంథ భాండాగారులు మొదలైనవారి సంఖ్య స్వల్పంగా వున్నప్పటికీ, వీరి కుపయోగించే పుస్తకాలను తప్పక సమకూర్చవలెను.

గ్రామస్థుల అవసరాలను తీర్చడానికి కావలసిన అన్నివిషయాల పైనను తగిన గ్రంథములులేని లోపాన్ని పత్రికలు తీర్చగలవు. కనుక ముఖ్యమైన పత్రికలను ప్రధానంగా ప్రాంతీయ భాషలలోను, కొంచెంగా హిందీ ఆంగ్లములలోను తెప్పించి గ్రామముల కందజేయడం ఉపయోగకారి. దిన, వార పత్రికలలోని ఉపయుక్తమైన వ్యాసాలను కత్తిరించి విషయవిభజనజేసి విడివిడిగ అంటించి వీటిని కూడ పుస్తకాలనువలెనే ప్రచారంలోపెట్టినట్లైన నూతన విజ్ఞానాన్ని యెప్పటికప్పుడు ప్రజల కందజేయడమవుతుంది.

సంచారగ్రంథాలయాలలోని పుస్తకాలు తరచు సంచారంలో వుండవలసిరావడమేగాక, గ్రామీణప్రజల చేతులలో నివి భద్రంగా వుండడాని కవకాశముండదు. కనుక యీతాకిడులను తట్టుకొనడానికి యోగ్యమైన మందపాటి కాగితాలు, గట్టిబైండ్లుగల గ్రంథాలయ ముద్రణాలనే వెల కొంచెం యెక్కువైనా తీసుకొనడ మవసరం.

## గ్రంథాలను చేరవేసే సాధనాలు

సంచార గ్రంథాలయానికిగల ఆర్థిక వసతి, దాని కార్యక్షేత్రం యొక్క నైసర్గిక స్వరూపమూ, రవాణా సౌకర్యాల ననుసరించి పుస్తకాలను చేరవేసే సాధనా లేర్పడతాయి. గ్రామ గ్రంథా

---

* స్థానికులు రచించినట్టియు, స్థానికముగ ప్రచురించినట్టియు, స్థానికవిషయములు గలవియు నగు వివిధ గ్రంథములు.

లయాలు స్త్రీల నిమిత్తం ఇండ్లకు పుస్తకాలు పంపడానికి కేవలం మనుష్యులనే నియోగిస్తున్నవి. కట్టకట్టుకొనిగాని, చిన్న పెట్టెలో పెట్టుకొనిగాని గ్రంథాలయ సేవకుడు పుస్తకాలను గ్రంథాలయము నుండి తీసుకపోతాడు. దూరభారాలు తక్కువగా వున్నప్పుడీపద్ధతి అనుకూలంగా వుంటుంది. పోతే చిన్న త్రోపుడు బండిలో పుస్తకాలను చక్కగా సర్దిపెట్టి ఇంటింటికీ వెళ్ళి పాఠకులకు కావలసిన గ్రంథాలనిచ్చి రావడం మరొకమార్గం. ఇది ఆకర్షవంతంగానే వుంటుంది. కాని మొదటి పద్ధతిలోవలె ప్రతియింటిలోనూ ప్రవేశించడానికి వీలుండదు. పెట్టె (ఎద్దుల)బండి, మూడుచక్రాల సైకిలు, మోటారు వాను ఒక దానికిమించి ఒకటి వేగంగా రోడ్లపైన వందలాది గ్రంథాలను తీసుకపోవడానికి ఉపకరిస్తాయి. అయితే వీటి నిర్వహణ ఖర్చులు కూడ అధికంగానే వుంటాయి. కాలువలు హెచ్చుగా వున్న తావులలో పడవలు, రోడ్లులేని మిట్టపల్లాల ప్రదేశాలలో గుర్రాలు, గాడిదలు, ఎడారులలో ఒంటెలు, దూరం హెచ్చుగా వున్నప్పుడు రైళ్లు, దేశాలమధ్య ఓడలు, ఆకాశ విమానాలు సంచార గ్రంథాలయ సేవకు అనుకూల సాధనాలు.

## స్థానిక కేంద్రాలు

గ్రంథాలయ భూమిగా ప్రసిద్ధిజెందిన అమెరికాలో సంచార గ్రంథాలయాలు పుస్తకాల నందించడానికి పచారి దుకాణాలు, తపాలాకచ్చేరీలు, పాఠశాలలు, బ్యాంకులు వగైరా స్థానిక కేంద్రాలుగా ఉపయోగపడుతున్నవి. ఈ కేంద్రాల విషయమై ప్రజలకు బాగా తెలిసేటట్లు అచ్చట విరివిగా ప్రచారం సాగుతుంది. ప్రజలకు కావలసిన పుస్తకాల వివరాలను స్థానిక భాండాగారుల ద్వారా తెలుసుకొని సంచార గ్రంథాలయ నిర్వాహకులు వీటిని వాయిదాల ప్రకారం సరఫరా చేస్తువుంటారు.

తెలుగుసీమ గ్రామాలలోని రచ్చబండలు, రామమందిరాలు, సత్రాలు, గ్రామచావళ్లు, గ్రంథాలయాలు, పంచాయతీబోర్డులయు - సహకారసంఘాలయు - తదితర ప్రజాసంస్థలయు కార్యాలయాలు స్థానిక కేంద్రాలుగా యేర్పడడాని కవకాశమున్నది. ఈ కేంద్రాలకు వాయిదాలప్రకారం పుస్తకాలను కొన్నింటిని తెప్పించి పాఠకులకిచ్చి పుచ్చుకొంటూ పనితీరిన వాటిని కేంద్రగ్రంథాలయానికి పంపుతూ వుండవచ్చు. దీనికి కావలసిన నిబంధనలను స్థానిక భాండాగారుల సలహాలతో సంచార గ్రంథాలయ నిర్వాహకు లేర్పాటు చేయవలెను. ఈ నిబంధనలు గ్రంథాలయ సేవను విస్తరింపజేయుట కనువుగా నుండవలెను.

ఆధునిక గ్రంథాలయ కార్యక్రమంలో ప్రచారం చాలా ప్రధానమైనది. సంచార గ్రంథాలయ నిర్వహణంలో కూడ దీని ప్రాముఖ్యం యెన్నదగినదే. దేశం జనసంఖ్యలో అత్యధిక భాగంగా వున్న గ్రామీణుల కొరకేర్పడే సంచార గ్రంథాలయాలు సక్రమంగా వినియోగం కావాలంటే ప్రజలలో గ్రంథాలయాన్ని గూర్చిన ప్రచారం నిరంతరాయంగా జరుగుతూ వుండాలి. దీనిమూలంగా గ్రామస్థుల మనస్సులు పుస్తకాల వైపుకు బాగా ఆకర్షింపబడాలి.

చదువులు నేర్చినవారు పుస్తకాలను స్వయంగా చదువుకొని తమకు కావలసిన జ్ఞానాన్ని ఆర్జించుకొంటూ హాయిగా కాలక్షేపం చేస్తూవుంటే, దీనికి నోచుకోని జనం బిక్కమొగాలతో చూస్తూ వుండనక్కరలేకుండా మరోరకం కార్యక్రమం గ్రంథాలయ నిర్వహణంలో యేర్పాటైవుంది*.

* వివరాలు 'గ్రంథాలయ ప్రచారం; విజ్ఞానవ్యాప్తి' అనే గ్రంథంలో చూడనగును. ఇది అయ్యంకివారి షష్టిపూర్తి ప్రచురణలలో నాల్గవగ్రంథం. ప్రకాశకులు: ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, పటమటలంక (వయా) విజయవాడ.

ప్రజానీకంలో విజ్ఞానవ్యాప్తికిది సాయపడుతుంది. దీనిని ఆంగ్లంలో 'లైబ్రరీ ఎక్స్‌టెన్షన్ వర్క్' అంటారు. పత్రికలను - పుస్తకాలను చదివి వినిపించడం, ఉపన్యాసాలు, విజ్ఞాన గోష్ఠులు, చర్చలు, ప్రదర్శనాలు, రేడియోప్రసంగాలు, సినిమా - మ్యాజికు లాంతరు ప్రదర్శనాలు, పురాణ-నాటక - హరికథాది కాలక్షేపాలు వగైరా కార్యక్రమం దీనిలో చేరుతుంది. సంచార గ్రంథాలయాలకీ కార్యక్రమం చాలా సహాయపడుతుంది.

# గ్రంథాలయ నిబంధనలు

" నిబంధనలవసరమైన పక్షమున వీనిని ముఖ్యముగా గ్రంథాలయ పాలకులకు తెలుపవలెను. ప్రజలకు కావలసినది సమాచారము, దీనిని పొందుమార్గము; సూచనలు, సలహాలు. గ్రంథాలయము వారికి ప్రసాదించగల విలువను గూర్చి, దీనిని పూర్తిగా వినియోగించుకొనదగు విధానమును గురించి నిబంధనలు వారికి నొక్కి చెప్పవలెను".

జనసామాన్యమందు విద్యాభిలాష, గ్రంథాలయావశ్యకతను గుర్తెరిగి తన్నిర్వహణకై అవసరమైన ధనమును ప్రేమతో నొసగుట — ఇవి గ్రంథాలయాభివృద్ధి కెంతయు సాయపడుననుట నిస్సంశయము. దీని కనుగుణముగ అభివృద్ధి కాటపట్టులుగనున్న అమెరికా, బ్రిటను మున్నగు పాశ్చాత్యదేశములందు గ్రంథాలయచట్టము లేర్పడి అచ్చటి గ్రంథాలయముల పెంపును చాల సహాయకారులుగ నున్నవి. ఈ చట్టములు గ్రంథాలయ స్థాపనకు పోషణకు నెంతదోహదములుగ నున్నవో ఆ యా దేశముల గ్రంథాలయోద్యమ చరిత్రలను పఠించిన తెలియగలదు.

గ్రంథాలయముల నిర్వహణమునకు చదువరులకు రుచించు వివిధవిషయములను గూర్చిన ముఖ్యగ్రంథములు, వానిని భద్రపరచుటకు యోగ్యములైన భవనములు, ప్రతిచదువరికి తగిన పుస్తకమును ప్రతిపుస్తకమునకు తగిన చదువరిని జాగ్రత్తగ సమకూర్చుచు అందరికి తన గ్రంథాలయ మెట్లుపకరించునో యోచించి, అందు కనువగు పద్ధతుల నెప్పటికప్పు డాచరణలోనికి దెచ్చుటకై నిరంతరము ప్రయత్నించు గ్రంథాలయపాలకులు ముఖ్యముగ నుండవలెను. పై అంగముల పరిపాలనకు, గ్రంథాలయ నిర్వహణమునకు తోడ్పడునవి సక్రమమగు గ్రంథాలయ నిబంధనలు. కఠినములు, అనవసరములు

నగు నిబంధనలు గ్రంథాలయాభివృద్ధి కెంత ఆటంకములుగనున్నవో నేటి మన గ్రంథాలయముల పరిస్థితులు ఋజువు చేయగలవు. చందాదారులకు తప్ప పుస్తకము లింట్లకివ్వబడవను నొక చిన్న నిబంధన మన గ్రంథాలయములలోని పుస్తకముల నెట్లుపయోగమునకు రాకుండ చేయుచున్నదో, వానినెట్లు బీరువాలలోనుండి బయటకు తీయవలసిన అవసరముగాని, శ్రమగాని లేకుండ గావించుచున్నదో గ్రంథాలయ సేవకులందరికి దెలిసిన విషయమే. కాన గ్రంథాలయ నిబంధనల విషయమయి వాని సాధక బాధకములనుగురించి గ్రంథాలయ నిర్వాహకులు తెలిసికొనవలసినట్టియు, అనుసరించదగినట్టియు విషయము నిట ప్రస్తావించడమైనది.

## నిబంధనలు - నిర్మాణ చట్టము

నిబంధనలను పదము గ్రంథాలయముపట్ల ఇష్టమువచ్చినట్లు వాడబడుచున్నది. 'ఆంగ్లమునరూల్సు' అను దానికిదిపర్యాయపదము. కాని గ్రంథాలయ సంస్థ నిర్మాణ చట్టములనే కొందరు నిబంధనలని వాడుటయేగాక అసలు గ్రంథాలయ నిబంధనలనే నిర్మాణ చట్టములలో నిరికించుటయు జరుగుచున్నది. నిర్మాణచట్టము ఆంగ్లమున 'కాన్‌స్టిట్యూషన్' అని పిలువబడుచున్నది. దీని ప్రయోజనము వేరు. నిబంధనల యుద్దేశమువేరు.

నిర్మాణచట్టము లేక 'కాన్‌స్టిట్యూషన్' గ్రంథాలయోద్దేశముల నిర్వచించి అవి కార్యరూపమును దాల్చుటకేలాటి ప్రయత్నములు సలుపవలయునో, గ్రంథాలయ మెవ్వారి యధీనమున నడువవలెనో, పాలకవర్గమువారి అధికారమెట్టిదో, అందలి వివిధో

ద్యోగుల విధులెట్టివో తెలియజేయును*. నిబంధనలు లేక 'రూల్సు' గ్రంథాలయము తెరచియుండుకాలము, గ్రంథాలయ ప్రవేశము, ఇంటికి పుస్తకము లిచ్చుట మొదలుగాగల గ్రంథాలయ నిత్యవిధులనుగూర్చి వివరించును. నిర్మాణ చట్టము గ్రంథాలయ నిర్వహణమును సూచించుచో, నిబంధనలు గ్రంథాలయోప యోగమునకు దారితీయును.

## నిబంధనల అవసరము ♦

గ్రంథాలయ నిబంధనలను గూర్చి ప్రస్తావించుటలో ముందు నేను నేర్చిన, నాకు నచ్చిన యొక శాస్త్రాంశము నుద్ఘాటింతును. అదేదన–The less the rules the more the service అనుసూత్రము. దీని యర్థము నిబంధనలెంత తక్కువగనున్న గ్రంథాలయోపయోగమంత విస్తరించునని. నిబంధనలు తక్కువగ నుండుటయేగాక సులువుగకూడనున్న నట్టి గ్రంథాలయము తన యాదర్శమునకు మిక్కిలి సమీపమున నుండునని వేరే చెప్పనక్కరలేదు. దీనిని బట్టి అసలు నిబంధనలే నిమిత్తము లేదని చెప్పినను తప్పులేదు. కాని ఆచరణలో నిట్టిస్థితికి మనమువచ్చుటకు మానవస్వభావ మెంతయు నాటంకముగ గన్పట్టుచున్నది. ప్రపంచములోని ప్రతి గ్రంథాలయమువారును తమ ఆదర్శమును పూర్తిగ గ్రహించి దానిని నూటికి నూరుపాళ్ళు అమలు

* గ్రంథాలయ మాదిరి నిర్మాణచట్టము 'గ్రంథాలయములు : రిజిస్ట్రేషను' అను గ్రంథము ౧౨-౧౯ పుటలలో గలదు. ఇది ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్తి ప్రచురణలలో మొదటి గ్రంథము.

♦ నిబంధన లనునవి చదువరులను పుస్తకములవైపునకు ఆకర్షించునట్లుచేసి, గ్రంథాలయోపయోగమును విస్తరింపజేయునిమిత్తము ఏర్పడినందున కొందరీ పదమునకు బదులు 'సలహాలు' లేక 'సూచనలు' అని వాడుట బాగుండునని యెంచుచున్నారు.

జరుపుచు, పౌరులుకూడ తమహక్కులనిమిత్తము పోట్లాడుటకు మాత్రమేగాక తమవిధులనుసయితము పూర్తిగనెరిగి వానికి విధేయులై నడచినతప్ప యీ పరిస్థితిని మనము పొందజాలము. కనుక సక్రమ నిర్వహణకై యేవేని కొన్ని నియమములకు లోబడి గ్రంథాలయ పాలనజరుగవలసిన అవసరము మనకు కన్పట్టుచున్నది. అయిన నీ నియమము లేర్పడవలసిన విధము, ఇది నిర్వహింపబడవలసిన పద్ధతినిగూర్చి కొంచెము విచారింతము. ఇందుకు గ్రంథాలయ ప్రధానసూత్రములను ముందు పరిశీలింతము.

## గ్రంథాలయ సూత్రములు

'పుస్తకము లధ్యయనము నిమిత్తము చేర్చబడినవి' అనునది గ్రంథాలయ ప్రథమసూత్రము. గ్రంథాలయమందున్న యేపొత్తము గాని నిరుపయోగముగ పడియుండరాదు. అందలి 'ప్రతిపుస్తకము నకు తగిన చదువరిని – ప్రతిచదువరికి తగిన పుస్తకమును' సమ కూర్చవలసిన బాధ్యత భాండాగారిపై గలదు. దీనికాటంకములుగ నుండక గ్రంథాలయములోని పుస్తకముల నెక్కు డుపయోగకర ములుగ జేయుట కనువుగ నిబంధన లేర్పడవలసియుండును. అట్లు గాక గ్రంథాలయములోని పొత్తముల భద్రతకు భంగము కలుగు నను తలంపుతో వానిని బయటికి రానీయక నిరోధించు గ్రంథాలయ నిబంధనలు నిర్బంధనలగునేగాని, అవసరమైన కట్టుబాట్లు – ప్రయో జనకరమైన పద్ధతులు కాజాలవు.

కాలముయొక్క విలువను బాగుగ గ్రహించిన పాశ్చాత్యులు గ్రంథాలయ శాస్త్రవిషయమున సహితము కడుశ్రద్ధతో, కాలము వృథా గాకుండవలెనను సంకల్పముతో, అందును గూర్చి ముఖ్య సూత్రము నొకదానిని నిర్వచించి గ్రంథాలయలోకమునకు ప్రసా దించియున్నారు. 'చదువరులయొక్కయు, గ్రంథాలయ సిబ్బంది

యొక్కయు కాలమును వ్యర్థాకానీయక' కాపాడవలసిన ధర్మమును వారు సిద్ధాంతీకరించి గ్రంథాలయాభివృద్ధికి సుకరమైన పద్ధతులను సూచించియున్నారు. మఱియు 'సుప్రాణవంత గ్రంథాలయము కూడా పెరుగుదల స్వభావముగా గలిగియున్నద'ని చెప్పుటద్వారా ఆదర్శగ్రంథాలయ స్వరూపమును నిర్వచించియున్నారు. అట్టిస్వభావము లేనినాడు రోజురోజు చకచక పెరిగిపోవుచున్న విజ్ఞానరాశి నొకకొంతయైన చవిజూడ నిచ్ఛగించు పాఠకలోకమునకు నిత్యాభివృద్ధిలేని గ్రంథాలయము, నిరుపయోగముద్వారా తగిన యుత్సాహమును కల్పించని కారణమున నిరుపయోగమైపోవును. ఇందువలన అసలు గ్రంథాలయాదర్శమునకే భంగముగలిగి మనము దాని నేయుద్దేశముతో నారంభింతుమో దానికే ముప్పువాటిల్లును.

## నిబంధన లెట్లుండవలెను ?

ఈసూత్రముల దృష్టిపథమున నుంచుకొని మన మేర్పఱచు నిబంధనలే సరియైనవిగ నెంచవలసియున్నవి. ఈ గ్రంథాలయ ధర్మమును మరచి సంకుచితాదర్శముతో మనము చేయు నియమము లెప్పుడును సరిగనుండవు. అందుచే గ్రంథాలయ పాలకులైనవారు గ్రంథాలయాదర్శమును పూర్తిగ గ్రహించి దానిని సాధించుటకెంత మవసరమైన నిబంధనలను మాత్రమే చేయుట సరియైనపని. ప్రచండమైన సైనిక శాసనముబోలు నిబంధనలు గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడవుగాన వానిని ప్రోత్సహింపరాదు. నిబంధనల నేర్పాటు చేయుటలో గ్రంథాలయ నిర్వాహకు లీవిషయమును ముఖ్యముగ గమనించవలెను. మఱియు మొదట సూచించినవిధమున నిబంధనలతిగానుండక కావలసినంతవరకే యుండుటయు, కఠినముగా నుండక ఆదర్శనిర్వహణమునకు అనుకూలమైనంత సులభముగ నుండుటయు, లక్ష్యరహితముగ నుండక ఆలోచనాపూర్వకమైన

ఉద్దేశజనితములగుటయు చాలఅవసరము. ఇవి నిషిద్ధవిషయములను సూచించు జాబితాలుగాగాక చదువరులకు ప్రోత్సాహమునుగల్పించు సందేశములుగ నుండుట మంచిది. గ్రంథాలయ దైనందిన జీవితమున నవసరమైన యీ నిబంధనలు నిర్మాణచట్టమున నిరికింపబడక దేశ, కాల, పాత్రముల ననుసరించి అప్పటికప్పుడు వలయువానిని గ్రంథాలయ పాలకులే నిర్ణయించుట, మార్చుట, చేర్చుట మంచిది. ఇందువిషయమై గ్రంథభాండాగారి కెక్కువ స్వతంత్ర ముండవలయును. లేకున్న ఒకయంత్రమువలె పనిచేయవలసినస్థితి యాతనికి సంభవించుటయు, నందువలన చదువరుల కసంతృప్తి జనించి తద్వారా గ్రంథముల ఉపయోగము సన్నగిల్లుటయు జరుగును. భాండాగారి స్వతంత్రుడైన చదువరుల యభిరుచులను, శక్తి యుక్తులను జాగ్రత్తగ పరిశీలించువాడుగాన, తా నేర్పరచు నియమముల ద్వారా గ్రంథాలయధర్మమును పూర్ణముగ నెరవేర్చగలడు.

## నిబంధనలు - చదువరులు

గ్రంథాలయపాలకులు నిబంధనల నేర్పాటుచేయువిషయమున గమనించవలసిన విధులను సూక్ష్మముగ దెలిసికొన్నపిదప వీనిపట్ల చదువరుల హృదయ మెట్లుండునో యొకింత చర్చించి వారివిధులను సహితము కొంత విస్తరించు టవసరము.

౧. ఇండ్లకు తీసికొనిపోవునట్టి గ్రంథముల సంఖ్య విషయమై చదువరుల యభిప్రాయములను మున్ముందు పరిశీలింతము. ప్రతి గ్రంథాలయమునందును సర్వసాధారణముగ ఇన్ని పాత్రములకంటె మించి యిండ్లకీయ్యమను నిబంధనను మనము తీసికొందము. ఈసంఖ్య యొక్క అవసరమును సరిగా గ్రహించని కారణమున చాలమంది దీని కభ్యంతరము తెలుపుదురు. అయితే యీ నిబంధన వ్యక్తుల కిబ్బంది గలిగించునిమిత్తముగాక అందరికి సమానావకాశమును కల్పిం

చుటకే యేర్పడినదను సంగతిని చదువరులు గమనించునట్లు చూడవలెను. ఒక్కని యింటిలోనున్న గ్రంథాలయ పుస్తకము తక్కినవారి కందరికి ఉపయోగపడదు గనుక యీ యిబ్బందిని తగ్గించుటకే యీ నిబంధన అవసరమైనది. ఉపయోగము లేక ఒకరియింటనున్న పాత్రము అనవసరముగ తన ప్రయోజనమును గోల్పోవుచున్నదను సంగతి నెరిగినప్పు డెవరుగాని యీ నిబంధనను నిరసించజాలరు. అప్పుడు గ్రంథాలయ పాఠకు లెదురాడక దీనిని విధిగా గౌరవింతురు.

౨. ఇండ్లకు తీసికొనిపోయిన పాత్రములను తిరిగి గ్రంథాలయమునకు చేర్చవలసిన కాలపరిమితిని గూర్చిన నిబంధన పైదానికంటె నెక్కుడు చిక్కుగా నెంచబడుచున్నది. నియమితకాల మతిక్రమించిన పిమ్మట గ్రంథాలయమునకు వచ్చు పుస్తకములపై విధింపబడు జరిమానా చదువరులకు చాల బాధకరముగ నుండును. తాము గ్రంథాలయమునుండి తెచ్చుకొను పుస్తకమును తిరిగి యివ్వవలసిన గడువును నిత్యము స్మరించవలసిన దేనాయని కొందరు ప్రశ్నింతురు. మఱికొందరు జరిమానాలను చెల్లించియైనను పుస్తకములను నియమిత కాలమునకు మించి తమకడనే యుంచుకొందురు. ఇందు విషయమై చదువరులు తమ తోడిపాఠకులపట్ల ప్రవర్తింపవలసిన విధమును గమనించునట్లు చేయుటకై గ్రంథాలయ పాలకులు పూనుకొనవలెను. తోడి చదువరుల కష్టనిష్ఠురములను సౌమ్యపద్ధతుల ద్వారా తెలియజేయుటవలన వారు దారికివచ్చి యీ నిబంధనను సంతోషముతో పాలింతురు.

౩. గ్రంథాలయములందలి పుస్తకములలో కొన్ని తఱచుగ నుపయోగింపవలసినవిగ నుండును. అపురూప గ్రంథములు, లావుపాటి బరువైన పుస్తకములు, చిత్రములతో కూడిన పుస్తకములు కొన్ని యుండును. వీనిని సర్వసాధారణముగ నిండ్లకివ్వరు. నిఘంటువులు, విజ్ఞానసర్వస్వములు మొదలుగాగల కొన్ని గ్రంథములు

వరుసగ సాంతము చదువుట కనుకూలించవు. ఇవియు నింట్లకీయబడవు. పై పుస్తకములలో కొన్నింటి రకరకముల విజ్ఞానముండి అది బహుజనమునకు తరచు అవసరపడుటయు పొసగును. ఇట్టి గ్రంథములను గ్రంథాలయమునుండి బయటికి తీసికొనిపోయినయెడల గ్రంథాలయములో వాని నుపయోగించదలచు వారందరికిని యిబ్బంది కలుగుటయేగాక రోజులో చాలకాలము పాటవి వ్యర్థముగ పాఠకుల యింట్లకడ పడియుండుటయు సంభవించును. కనుక యెక్కువ జనుల ఉపయోగార్థ మేర్పడిన యీ నిబంధనసైత మవశ్యాచరణీయ మనుసంగతిని చదువరులు గమనించునట్లు చేయవచ్చును.

౨. పత్రికలు విజ్ఞాన విషయముల నెప్పటికప్పుడు తెలియజేయుచు చదువరుల మనముల కానందము గొల్పుచుండును. క్రొత్త పత్రికలను పై పుస్తకములవలెనే యింట్లకు తీసికొనిపోరాదను నిబంధనయు పైదానివలెనే తప్పక అనుసరించదగియున్నది. ప్రత్యేక విషయములపై వ్రాయబడు వ్యాసములతోనిండియున్న సంచికల నితరులు చదువరని సాకుచెప్పుటకంటె వారును తనవంటివారేయనుకొని తన సౌకర్యమునిమిత్త మితరుల నిబ్బంది పరచకుండునట్లు ప్రతి పాఠకుని ప్రోత్సహించవలెను.

## కొన్ని ముఖ్యాంశములు

పదుగుర సౌకర్యమునిమిత్త మొకవ్యక్తి సాంఘికవిషయములన్నిటిలోవలెనే గ్రంథాలయ నిబంధనలపట్లకూడ కొంతత్యాగమును చూపు టవసరమని తెలిసికొంటిమి. ఇక గ్రంథాలయ నిబంధనలలోని ముఖ్య విషయములనుగూర్చి విచారింతము.

ఆధునిక గ్రంథాలయములలో దేని నిబంధనలను పఠించినను, లేక గ్రంథాలయశాస్త్ర గ్రంథములందలి మాదిరి గ్రంథాలయ నిబంధనలను గాంచినను ముమ్ముందు మనకు గన్పట్టునంశము గ్రంథాలయము తెరచియుండుకాలమునకు సంబంధించిన దై

యుండును. ఈ కాలమువిషయమై పాటించవలసిన సిద్ధాంతము, అందు నిమిత్తమైన ఆచరణ విషయములో మన గ్రంథాలయము లేవియు సరిగ నడచుకొనుటలేదు. మన గ్రంథాలయములు తెరచి యుండు సమయములు చదువరుల కనుకూలముగ నుండుటకు బదులు గ్రంథాలయముల నడపువారి యిచ్ఛ ననుసరించి యేర్పడు చున్నవి. సర్వసాధారణముగ పగలంతయు పొలముపనులలో మునిగి యుండు రైతు కూలీజనమున కాలవాలమగు పల్లెటూళ్ళలోని గ్రంథాలయాలను రాత్రులందుగాక పగటివేళలో కొంతకాలము మాత్రమే తెరచియుంచుట మన యెరుకలోని విషయమే.

గ్రంథాలయములో ప్రవేశించి యందలి విజ్ఞానసామగ్రిని స్వేచ్ఛతో నుపయోగించుటకై ఆదర్శ నిబంధన లందరి నాహ్వానించును. కాని మనస్థిమితము లేనట్టియు, అపరిశుభ్ర దేహులయి నట్టియు, మర్యాదకరమగు దుస్తుల ధరించనట్టియు వారల కేగ్రంథాలయ నిబంధనలుగాని ప్రవేశము నొసంగ నిరాకరించును. గ్రంథాలయములో ప్రవేశించు ప్రతిచదువరియు, ప్రేక్షకుడును మున్ముందు గ్రంథాలయ నిబంధనల నంగీకరించిన విషయమును సూచించుచు ప్రవేశద్వారమువద్ద నుంచబడు 'ఆగమన సూచిక'లో సంతకము చేయవలసియుండును. ఎవరును తమతో కుక్క మొదలగు పెంపుడు జంతువులనుగాని, చంటిపిల్లలనుగాని గ్రంథాలయయలోనికి తీసి కొని పోరాదు. గ్రంథాలయములో నున్నంతకాలము పెద్దగా మాట్లాడుటకుగాని, పొగత్రాగుట - ఉమ్మివేయుట మొదలుగాగల పనుల నొనరించుటకుగాని, అమర్యాదగ మాట్లాడుటకుగాని అవ కాశము లుండవు సరిగదా - గ్రంథాలయమును వీడిపోవునప్పుడు ప్రతియొక్కరును తామెట్లు లోపల ప్రవేశించెదరో అట్లనే బయటికి పోవలెను. పుస్తకములను సహితము గ్రంథ భాండాగారి యనుమతి లేనిదే యెవరును బయటకు తీసికొనిపోవుటకు వీలుండదు.

చందాదారులకుతప్ప పుస్తకము లింటికివ్వబడవను నిబంధన సర్వసాధారణముగ గ్రామ గ్రంథాలయములకును, కొంతమొత్తమును ధరావతుగా నుంచినవారుమాత్రమే పుస్తకముల నింటికు తీసికొనిపోవచ్చునను నిబంధన పట్టణ గ్రంథాలయములకును మామూలుగ నున్నవి. వీనివలన దారిద్ర్యమునకు, దారిద్ర్యమును మించిన విజ్ఞాన లోపమునకు నివాసమైన మనదేశమున గ్రంథాలయ సంస్థలు నిష్ప్రయోజనమగుచున్నవి. ధనవంతులకు చదువునందాసక్తి లేకపోవుట, చదువుకొనవలెననెడి కుతూహలము గలవారికి ధనలోపము చాల చిక్కుగ పరిణమించుచున్నది. కనుక చదువరుల నడవడులను గమనించి, గ్రంథముల భద్రత కవసరమైన జాగ్రత్తను తీసికొనుచు, గ్రంథాలయమందలి పాత్రములెంత యుపయోగపడుట కవకాశములుండునో అందు కనుకూలములయిన నిబంధనల నమలుజరుపు టుత్తమము. సాధారణముగ అంటుజాడ్యములుగల రోగులకుగాని, అట్టిరోగులున్న యింటికుగాని పుస్తకముల నివ్వకపోయినను, సదుద్దేశముతో కూడిన పఠనాభిలాషగల ప్రతియొక్కరికీ వారివారి శక్తి సామర్థ్యముల ననుసరించి వలయు గ్రంథముల నింటికిచ్చుట ధర్మము.

ఈ సందర్భమున నొకవిషయమును మన గ్రంథాలయముల కార్యకర్తలు ముఖ్యముగ గమనించవలెను. చదువరుల విధులను వివరించుటలో ప్రతియొక్కరును గ్రంథాలయమునుండి తీసికొను పుస్తకముల కనీససంఖ్య, వానిని తిరిగి గ్రంథాలయమునకు చేర్చవలసిన కాలనిర్ణయముల విషయములో గ్రంథాలయ నిబంధనలను ఎదురాడక వారు పాటించవలెనని చెప్పుకొంటిమి. ఈవిషయమున గ్రంథాలయ పాలకులును తమ బుద్ధిని వినియోగించి అవసరమని తోచినప్పుడును, ఇతరుల కిబ్బంది లేనప్పుడును చదువరులకు కొన్ని ప్రత్యేక సౌకర్యములను కల్పించవలసియుండును. అట్టియవసరములను జాగ్రత్తగ గమనించి గ్రంథాలయ నిర్వాహకులు తమ

ధర్మమును నేమరక పాలించుచుండవలెను. ఒక్కొక్కరి కియ్యదగిన వానికంటె నెక్కువ గ్రంథముల నిచ్చుటకును, అట్లిచ్చు పుస్తకములు తిరిగి గ్రంథాలయమునకు చేర్చదగిన కాలనిర్ణయమును పొడిగించుటకును నిర్వాహకుల కవకాశమున్న, వారును తమ విచక్షణ నుపయోగించి చదువరుల కోర్కెలను దీర్చుచుండగలరు. గ్రంథాలయ ప్రయోజనము సిద్ధించుటకై నిర్వాహకు లొక్కొక్కప్పుడు నిబంధనలను మారవలసివచ్చుటయు తటస్థించును. ఇట్టి సందర్భములకు పాలకు లెదురు చూడగలిగిననాడే గ్రంథాలయము తన యాదర్శమును పూర్ణముగ నెరవేర్చగలుగును.

## నిబంధనలలో భేదములు

గ్రంథాలయములు పలురకములు. జనసామాన్యమున కంతటికీ సాధారణముగ నుపయోగించు పౌర గ్రంథాలయములుగాక వేరువేరు సంస్థలకును, ప్రత్యేక పరిస్థితులలోనుండు వ్యక్తులకును సంబంధించిన ప్రత్యేక గ్రంథాలయములును ప్రపంచమున చాల గలవు. యూనివర్సిటీ, కాలేజీ, స్కూలు లైబ్రరీలు – స్త్రీ, బాల భాండాగారములు – న్యాయశాస్త్ర, వాణిజ్య పుస్తకాలయములు – బోటు, బందీ, వైద్యాలయ గ్రంథాలయములు – అంధుల గ్రంథాలయములు ప్రత్యేకగ్రంథాలయములుగ పేర్కొనబడుచున్నవి. వీని యన్నిటికిని ఒకేవిధమగు నిబంధన లుపయోగించవు. స్థానిక పరిస్థితుల ననుసరించి పౌరగ్రంథాలయముల నిబంధనలును, సంస్థల ఆదర్శములనుబట్టి ప్రత్యేక గ్రంథాలయ నిబంధనలును మారవలసియుండును. అయినను మొత్తముపై ప్రపంచమందలి యే భాండాగార నిబంధనలైనను గ్రంథాలయ సూత్రములకు కట్టుబడియే నడువవలసియుండును.

పైన నిర్వచించిన సూత్రముల ననుసరించి తయారుచేయబడిన మాదిరి గ్రంథాలయ నిబంధనలను గ్రంథాలయముల నిర్వాహకుల కుపకరించునను తలంపుతో దిగువ నుదహరించడమైనది.

# శ్రీ శారదా గ్రంథాలయము, లక్ష్మీపురము

## నిబంధనలు

పనిచేయు కాలము :

౧. ఈ గ్రంథాలయము ప్రతి దినము ఉదయము ౮ గంటలనుండి సాయంత్రము ౬ గంటలవరకు తెరచి యుండును.

ప్రేక్షకులు :

౨. గ్రంథాలయము తెరచియుండు సమయమున నిందలి గ్రంథములను, పత్రికలను సర్వజనులు ఉచితముగ చదువుకొనవచ్చును.

3. గ్రంథాలయములోను, దానియావరణయందును ప్రేక్షకులు నిశ్శబ్దముగ నుండవలెను. పొగత్రాగకుండ ఉమ్మివేయకుండ నుండవలెను.

౪. గ్రంథాలయమునకు వచ్చు ప్రేక్షకులు ప్రవేశద్వారముకడ ఇందు నిమిత్తము ప్రత్యేకముంచబడు 'ఆగమన సూచిక'లో చేవ్రాలు చేయవలెను.
చంటి బిడ్డలను పెంపుడు జంతువులను గ్రంథాలయము బయటనే వదలి రావలెను.

౫. ప్రేక్షకులు గ్రంథాలయములోని పుస్తకములను, పత్రికలను జాగ్రత్తగ చదువుకొని తాము బయటికి పోవునప్పుడు వానిని గ్రంథభాండాగారి కప్పగించవలెను.

౬. గ్రంథాలయమందు తాముపయోగించిన పుస్తకములకు, పత్రికలకు ఏలాటి నష్టము కలిగినను చదువరులు దానికి బాధ్యులై యుందురు.

౭. పుస్తకములు వగైరా గ్రంథాలయ పరికరములు వేనిని గాని భాండాగారి అనుమతి పొందిన పిమ్మటనే బయటకు తీసుకొనిపోవలెను.

౮. గ్రంథాలయమునకు చేర్చదగిన పుస్తకములను గురించియు, గ్రంథాలయ నిర్వహణమందలి లోపములను గూర్చియు సూచించదలంచు ప్రేక్షకులు తమ అభిప్రాయములను 'చదువరుల సలహాల పుస్తకము' లో వ్రాయవలెను.

గ్రంథముల అరువు :

౯. గ్రామమునందలి చదువనేర్చిన స్త్రీ పురుషు లెల్లరును గ్రంథాలయ సొంతదారులుగా చేరి యిందలి గ్రంథముల నుచితముగ నరువు తీసికొనవచ్చును.

౧౦. గ్రంథాలయ చందాదారులు కానివారును, ౧౮ సంవత్సరములకు లోబడిన వయస్సువారును నియమిత నమూనాలో దరఖాస్తుచేసి పాలకవర్గమువారి అనుమతిని పొందిననే గ్రంథాలయ పాఠకులుగ చేర్చబడుదురు.

౧౧. ఒక్కొక్క పాఠకుడు తనవద్ద ౨ గ్రంథములను అరువు తీసికొనవచ్చును. వీనిని వాపసిచ్చి వారు మరల క్రొత్తగ్రంథములను తీసికొనవచ్చును.

౧౨. పాఠకులు తాము గ్రంథాలయమునుండి అరువుతీసికొన్న గ్రంథములను ౧౦ దినములలోపల వాపసు చేయవలెను. ఒకసారి తీసికొన్న గ్రంథములే మరల కావలసియున్న గడువులోపల వాపసుచేసి అప్పటికి మరెవ్వరుగాని వానికై యుండనిపక్షమున తిరిగి తీసికొనవచ్చును.

౧౩. భాండాగారి కోరినచో గడువుతో నిమిత్తము లేకనే పాఠకులు తమవద్దనున్న గ్రంథములను వాపసు చేయవలెను.

౧౪. పాఠకులు తాము చదువుట పూర్తికాగానే గ్రంథములను గ్రంథాలయమునకు వాపసు చేయవలెను. ఇతరులు తమవద్దనున్న గ్రంథముల నడిగినచో తాము వీనిని ముందు గ్రంథాలయమునకు వాపసుచేసి వారి నచ్చటనుండి తెచ్చుకొనునట్లు చెప్పవలెను.

౧౫. గ్రంథాలయ పుస్తకములలో వ్రాయుట, గీతలు గీయుట మున్నగు పనుల ద్వారా తాము తీసికొన్న గ్రంథముల కేలాటి నష్టము కలిగినను, పాలకవర్గము వారు నిర్ణయించు పరిహారము పాఠకులీయవలసి యుందురు.

౧౬. పరిశోధనాదికములకు ప్రత్యేకింపబడిన గ్రంథములు, అచ్చులోలేని పుస్తకములు, జీర్ణావస్థయందుండుటచేగాని అత్యంతభారముగలవి యగుటచేగాని భద్రముగ నుపయోగించవీలుగాని పొత్తములు, వ్రాత ప్రతులు మున్నగువానిని పాఠకులు గ్రంథాలయావరణమునందె చదువుకొనవలెను.

౧౭. ప్రత్యేకవసతులు కావలసినవారు పాలకవర్గమువారికి నివేదించుకొనవలెను. పరిశోధకుల కవసరమైనవసతులను గ్రంథాలయ పాలకులు కల్పింతురు.

# గ్రంథాలయాలు : పుస్తకాల తొలగింపు

గ్రంథాలయ నిర్వహణంలో పుస్తక సేకరణ మెంత ముఖ్యమైన కార్యమో వీని తొలగింపు పనికూడ అంత ప్రధానమైనదే. నేటి గ్రంథాలయాదర్శం క్రమంగా అమలుజరగాలంటే గ్రంథాలయంలోని ప్రతిపుస్తకం పాఠకుల కుపయోగపడుతూ వుండాలి. కనుక చాలాకాలం బొత్తుగా ఉపయోగపడని పుస్తకాలను ముందు వెనుకలాలోచించకుండా గ్రంథాలయంలోనుండి తొలగించడ మవసరం. ఎప్పటికప్పు డీ కార్యక్రమం చక్కగా సాగుతూవుంటే గ్రంథాలయం సజీవంగావుండి చదువరులను చక్కగా సేవించగలుగుతుంది.

గ్రంథాలయంలోని పుస్తకాలను తొలగించవలసిన పరిస్థితి యెట్లేర్పడుతుంది ? దీని అవసరమేమి ? అను ప్రశ్నలకు సమాధానములను ముందు తెలుసుకొందాం. గ్రంథాలయం పుస్తకాల గిడ్డంగిగాగాక ప్రజల విజ్ఞానసాధన కుపకరణాలైన గ్రంథరాజాలు గల సాంఘిక కేంద్రంగా నేడు దేశదేశాలలోనూ వ్యాప్తిలోవుంది. కనుక ప్రజల కేవిధంగాగాని ఉపకరించని గ్రంథాలను గ్రంథాలయాలనుండి తీసివేయవలసిన పరిస్థితి కలుగుచున్నది. మితితప్పిన వాడుకమూలంగాగాని, కాలము గడచుటచేగాని శిథిలమైన గ్రంథములు కనుల కింపుగా నుండకపోవడమేగాక ఉపయోగానికికూడ అనువుగానుండవు. ఏటేట క్రొత్తగా గ్రంథాలయానికి చేరే గ్రంథాల సంఖ్య పెరగడంద్వారా కొంతకాలానికి మొత్తం గ్రంథాలను భద్రపరచడానికి కావలసిన బీరువాలూ, బీరువాలు పెట్టడానికి అవసరమైన స్థలమూ లేకపోవడంకూడా సంభవిస్తుంది. ఏవో కొన్ని సందర్భాలలోతప్ప తాతలనాటి పాతపుస్తకాలలోనూ, ఒక్కొక్క శాస్త్రంలో క్రొత్తగా బయలుదేరే విప్లవకరములైన పరిశోధనల

ఫలితంగా అంతకుముందు ప్రకటింపబడ్డ శాస్త్ర గ్రంథాలలోనూ, కొన్ని సంవత్సరాలక్రితం అచ్చైనందున నేటివరకుగల విశేషాలు చేరని చరిత్ర గ్రంథాలలోనూగల విషయాలు సంపూర్ణంగా వుండని కారణంచేత ఇవన్నీ కాలంగడచినకొద్దీ నిరుపయోగాలవడం సహజం. ఇట్టి గ్రంథాలను అప్పుడప్పుడు గ్రంథాలయంనుండి తొలగించి యెప్పటికప్పుడు గ్రంథాలయాన్ని ఆధునికంగా వుంచడ మవసరం. పదిసంవత్సరాల కొకసారిగాని, క్రొత్త కేటలాగులను ప్రచురించు నప్పుడుగానీ యీ తొలగింపు పని విధిగా జరగడం గ్రంథాలయాలలో పరిపాటి.

## వివిధ విషయములకు చెందిన పుస్తకాలు

అయితే యిట్టి గ్రంథాలను తొలగిండంలో అవలంబించవలసిన విధాన మేమి? ఈ తొలగింపు సూత్రములు అన్నిరకాల గ్రంథాలకూ ఒకేవిధముగ నుండునా? వేరు వేరు విషయాలకు వేరు వేరు సూత్రాలున్నవా? అను ప్రశ్నలు సహజముగ మనల నెదుర్కొనును. దిగువ విషయాలీ ప్రశ్నలకు సరియైన సమాధానముల నీయగలవు. వాఙ్మయముయొక్క వివిధ శాఖలకు చెందిన గ్రంథముల తొలగింపు విషయమై అనుభవజ్ఞులు నిర్ణయించిన అంశముల నిచ్చట పొందుపరచడ మైనది.

ముందు ప్రపంచ గమనములో ప్రధాన స్థానము నాక్రమించు విజ్ఞాన శాస్త్ర గ్రంథముల సంగతి విచారింతము. ఉత్తమ శ్రేణికి చెందక, అందలి విషయాలలో విశేషంగా మార్పులు వచ్చిన అన్ని శాస్త్ర గ్రంథములను నిరాటంకముగ గ్రంథాలయమునుండి తొలగించవచ్చును. గణితమును, గుప్తవిద్యను మినహాయించి తక్కిన శాస్త్రము లన్నింటిలోనూ పదేండ్ల క్రితము ప్రకటించిన గ్రంథములను నిరాక్షేపముగ తొలగించవచ్చును.

శాస్త్ర గ్రంథముల విషయంలో చెప్పబడిన పై సూత్రములు ఉపయుక్త కళలను కూడ అన్వయించును. ఉపయుక్త కళలలో ముఖ్యమైనవి - వ్యవసాయము, వైద్యము, ఇంజనీరింగు, గృహనిర్వాహకత్వము మున్నగునవి. పెద్ద గ్రంథాలయాలవారు వైద్య గ్రంథాలలోని పేటెంటులకు, ఔషధ యోగములకు సంబంధించిన పుస్తకములను, గృహపరిశ్రమలనుగూర్చిన గ్రంథములను సాధారణంగా తొలగించరాదు.

లలిత కళలలోని గ్రంథాలను బొత్తుగా పనికిమాలినవైతే తప్ప సర్వసాధారణంగా తొలగించరు. అచ్చుపటముల సంపుటాలను, మంచి మంచి బొమ్మల పుస్తకాలను, సంగీత విభాగంలోని కీర్తనల గ్రంథాలను, ఏ పరిస్థితులలోగాని తొలగించరాదు. ఉద్యానకృషి, రేఖాచిత్రణము (డ్రాయింగు), గృహాలంకరణము, చెక్కడపుపని, ఫోటోలు తీయుట, చిత్రలేఖనము (Painting), సంగీతాది వినోదములు లలిత కళలకు చెందినవి.

మతము, తత్వ శాస్త్రములకు సంబంధించిన గ్రంథాలలో ప్రసిద్ధుల రచనలను, ఇందులో ముఖ్యంగా అచ్చులోలేని అపురూప గ్రంథాలను మినహాయించి తక్కిన పాతబడ్డవాని నన్నింటిని తొలగించవచ్చును. దర్శన (Systems of Philosophy) గ్రంథములను తొలగించరాదు. ఈ వర్గాలలోని పాతచరిత్రలను, పురాతన వ్యాఖ్యానములను, బైబిలు - భగవద్గీత వగైరా గ్రంథముల సామాన్య టీకలను, పాక్షిక గ్రంథములను విరివిగ తొలగించవచ్చును.

సమాజ శాస్త్రగ్రంథములను, ఇందు ముఖ్యముగ అర్థశాస్త్రము, ప్రభుత్వవిధానము, న్యాయశాస్త్రము వగైరాలకుజెందిన పుస్తకములను తరచు పరిశీలించడ మవసరం. తాత్కాలిక ప్రాము

ఖ్యాతగల విషయాలకు సంబంధించిన పుస్తకాలలోని సంగతులు తర్వాత ప్రచురింపబడే చరిత్రలలో చేరునుగనుక వీటిని నిస్సంకోచముగా తొలగించవచ్చును.

అమలులో లేనట్టిన్నీ, పాఠశాలలలోని విద్యార్థులకు పాఠ్య గ్రంథములుగా నున్నట్టిన్నీ వ్యాకరణ గ్రంథాలను, చిన్న నిఘంటువులను తొలగించుట కేలాటి ఆక్షేపణమూ వుండదు. కాని ప్రముఖ నిఘంటువులను, సాహిత్యచరిత్రలను, వాఙ్మయసూచికలను, గ్రంథాలయ శాస్త్రగ్రంథములను వీలైనవరకు గ్రంథాలయమునుండి తీసివేయరాదు.

వాఙ్మయ చరిత్రలలో స్థానం సంపాదించుకొన్న ప్రసిద్ధ రచయితల నవలలను, చదువరు లధికంగా ఉపయోగించుకొనే కథా వాఙ్మయాన్ని తొలగించరాదు. వరుసగా రెండేండ్లు బొత్తుగా ఉపయోగంలో లేని మామూలు రచయితల నవలలను తీసివేయవచ్చును. హెచ్చుమంది తరచు ఉపయోగించు నవలలుగాని, కథలు గాని గ్రంథాలయంలో వుంచడానికి అర్హమైనవి. కనుక ఇట్టి గ్రంథములను తొలగించరాదు.

పూర్తిగా పాతబడి ఉపయోగరహితములైతేతప్ప సంపుటీకరణం పొందిన పద్యకావ్యాలనుగాని, నాటకాలనుగాని గ్రంథాలయంనుండి తొలగించరాదు. సాహిత్యచరిత్రల కెక్కక, చదువరు లెన్నడును కోరని కవులయు, నాటకకర్తలయు రచనలను ముందు వెనుక లాలోచించకుండ తొలగించవచ్చును.

మూలగ్రంథములను మినహాయించి వీటి నాధారంచేసికొని వ్రాయబడ్డ చరిత్ర గ్రంథములను పరిశీలనచేసి తొలగించవలెను. యాత్రాగ్రంథములలో స్థానికమైనవాటిని వదలి మామూలు వర్ణనలతో కూడిన తక్కినవాటిని పదేండ్లు గడచినతరువాత తీసివేయ

వచ్చును. నూతనప్రదేశాలను కనిపెట్టిన వివరాలున్న గ్రంథాలను తొలగింపరాదు. చిన్నగ్రంథాలయాలలోని పాతగజెటీరులను తొలగించి వీటిని పెద్దగ్రంథాలయాలవారు జాగ్రత్త చేసేటట్లుంటే వారి కివ్వవలెను. చరిత్ర గ్రంథాలలో కొన్ని భాషావిషయకంగా ప్రశస్తమైనవి వున్నట్లయిన వాటిని గ్రంథాలయంలోనే వుంచవలెను.

జీవితచరిత్రలలో బహుళసంఖ్యాకుల చరిత్రలున్న పుస్తకాలను గ్రంథాలయంనుండి తొలగించరాదు. కాని తమ ప్రాముఖ్యతను కోల్పోయిన వ్యక్తుల జీవితచరిత్రలను ౭౦ యేండ్లు దాటిన తదుపరి నిరాక్షేపముగ తొలగించవచ్చును.

విజ్ఞాన సర్వస్వముల తొలగింపుపనిని చాల ఆలోచించి చేయవలెను. స్థానిక గ్రంథాలశాఖకు చేరని వార్తాపత్రికలను, డైరెక్టరీలను స్వేచ్ఛగా తొలగించవచ్చును. మాససంచికలు వగైరా సంపుటాలను చేర్చునప్పుడే ఆలోచించి నిర్ణయింతురుగనుక వీటిని సులభంగా తీసివేయరాదు.

## అసంపూర్ణ గ్రంథములు

విషయాన్నిబట్టి గ్రంథాలను తొలగించడానికనువైనసూత్రాలను పైన తెలుసుకొన్నాము. ఇదిగాక కొన్ని పుటలలో, బొమ్మలలో, మరేవో ఉపయుక్తమైన భాగములో లోపించిన గ్రంథాలను గ్రంథాలయంలో వుంచి ప్రయోజనంలేదు. ఇందు కొన్నిటిని పూర్తిగా తొలగించుటకేదైన సందేహమున్న పక్షమున వీటిని ప్రచారశాఖనుండియైన తప్పించడమవసరం.

ఒక పుస్తకంలో కొన్ని పేజీలు పోయినప్పుడు గ్రంథప్రకాశకులకు వ్రాసి వీటిని సంపాదించు ప్రయత్నమును చేయవచ్చును. ఇది సాధ్యం కానియెడల మరొక గ్రంథాలయమునుండి దీని ప్రతిని

తెప్పించి లేనిపేజీలను వ్రాయించి దీనిలో చేర్చవచ్చును. బొమ్మలకు కూడ ఫోటోలు తీయించి జాగ్రత్త చేయవచ్చును.

పూర్తిగా మురికైన పుస్తకాలు చదువరులకు యేవగింపుగా వుండడంసహజం. కనుక యిట్టివాటిని తప్పనిసరైతేతప్ప గ్రంథాలయాలలో నుంచుట మంచిదికాదు.

బొమ్మ లెక్కువగానున్న పుస్తకాలలోని విషయం పూర్తిగా పాతబడ్డదైనప్పు డీబొమ్మలను భద్రంచేసి తక్కిన గ్రంథభాగాన్ని తొలగించడం బాగుంటుంది.

నేటి గ్రంథాలయాలలో ఒక్కొక్కదానికీ స్థానిక గ్రంథాలను భద్రపరచడ మొకవిధిగాయేర్పడినందున యేవిషయానికి సంబంధించినవైననూ వీటిని తొలగించరాదు. ఒక్కొక్క ప్రదేశానికి సంబంధించినట్టియూ, ఆప్రదేశంలోనివారు రచించినట్టియూ, ఆ ప్రదేశంలో అచ్చైనట్టియూ లేదా తదితర విధములుగా తయారైనట్టియు గ్రంథాలను స్థానిక గ్రంథాలంటారు.

పై తొలగింపు సూత్రాలు అపురూప గ్రంథాలకు గానీ, ఒక్కొక్క గ్రంథాలయం ప్రత్యేకం సేకరించు వేరువేరు గ్రంథావళులకుగానీ, చిత్రవస్తువులకుగానీ వర్తించవు. కాలంతోపాటు పాతబడే అచ్చుగ్రంథాలలో నూటికి కేబదివంతులుండు మామూలు వాఙ్మయానికిమాత్రమే యీసూత్రములను వర్తింపజేయడాని కవకాశమున్నది. చెత్తపుస్తకాలను, ఉపయోగించడానికి బొత్తుగా వీలులేని శిథిల గ్రంథాలను మినహాయించి, ఒక్కొక్క గ్రంథాలయం తాను తొలగించు పుస్తకాలొకవేళ ప్రక్క గ్రంథాలయాలకుగాని, కేంద్ర గ్రంథాలయాలకుగాని ఉపయోగించేటట్లుంటే తెలిసికొని అప్పగించుట మంచిపద్ధతి. ఇట్లు తొలగించే ప్రతిపుస్తకంపైన అది గ్రంథాలయంనుండి తొలగించబడినట్లు దానిపై ముద్రవేసే ఆచారంకూడ ఆచరణయోగ్యంగా కన్పడుతూ వుంది.

# గ్రంథాలయములు : పుస్తకములను సరిచూచుట

అన్ని వ్యాపారములందును, పదిమందికిచెందిన సంఘములవిష యములోను ఏడాదికొకపర్యాయము లెక్కలు చూచుకొనుట సర్వసామాన్యముగ జరుగుచుండును. ఈవిధానము గ్రంథాలయము లందును అంతో యింతో అమలులోనున్న విషయ మందరెరిగినదే.

ప్రతి నివేదిక వత్సరాంతమున ఆయా గ్రంథాలయముల కార్య దర్శులు, ఆయాసంవత్సరములలో తమతమ గ్రంథాలయముల పక్ష మున నడచిన కార్యక్రమమును తెలుపు నివేదికలను తయారుచేయు దురు. ఈనివేదికలలో ఒక్కొక్క సంవత్సరాంతమున గ్రంథాలయ మునగల గ్రంథములు, బీరువాలు, తదితర పరికరములను గూర్చిన వివరణము (Statement) ముఖ్యముగనుండును. తమ గ్రంథా లయముయొక్క అభివృద్ధిని ఇబ్బందులను వివరించుటలో గడచిన సంవత్సరారంభమునగల పుస్తకములు, నివేదికకాలములో క్రొత్తగ చేర్చినట్టియు పోయినట్టియు పొత్తములు మున్నగువానికి సంబంధించిన విషయములు తెలుపబడుట సహజముగదా! అగుటచే సంవత్సర నివేదికల తయారుచేయుటకుపూర్వ మొకపర్యాయము గ్రంథాల యములందలి పుస్తకాదులలెక్క సరిచూడవలసిన అవసరముగలదు.

## ప్రయోజనము

గ్రంథాలయములో మొదటినుండియు సంపాదించిన గ్రంథము లున్నవో లేవో తెలిసికొనుటకుమాత్రమేగాక ఈపరిశీలన నడుచు నప్పుడు మఱికొన్ని ప్రయోజనములును సిద్ధించుచున్నవి. పుస్తక ములస్థితిని తెలిసికొనుచు బీరువాల అరలలో క్రమము తప్పించి పెట్ట బడిన గ్రంథముల గనిపెట్టుటకుమాత్రమేగాక ఈపరిశీలన మూలమున

అరలు శుభ్రముచేయబడి అట్టకట్టవలసినట్టియు, బాగుచేయవలసినట్టియు, మార్చివేయవలసినట్టియు, తొలగించవలసినట్టియు పుస్తకములను వేరుగ తీసియుంచుటకుకూడ నవకాశ మేర్పడుచున్నది. మఱియు నీపరిశీలనములో పుస్తకములెట్లు పోవుచున్నదియు గ్రహించి మున్ముందట్టి పొరపాటులు జరుగకుండునట్లు కట్టుదిట్టము చేయుటకు సహితము వీలగును.

## విధానము

గ్రంథాలయములందలి పుస్తకముల పరిశీలనవలని ప్రయోజనముల దెలిసికొన్నపిమ్మట దీని విధానమునుగూర్చి విచారించవలసియున్నది. ఈపరిశీలన మెప్పుడు జరుగవలెనను విషయము వివాదగ్రస్తమైనది. కొన్ని గ్రంథాలయములలో నేటేట వార్షికోత్సవమునకు ముందు 3 మొదలు ౭ దినములవరకు గ్రంథముల నెరువిచ్చుట మాని, చదువరులనుండి రావలసిన గ్రంథములన్నిటిని వసూలుపఱచి, మొత్తముగ్రంథములను సరిచూచుకొన్నతరువాత గ్రంథములను తిరిగి యిండ్లకిచ్చు వాడుకగలదు. తమ వీలునుచూచుకొను గ్రంథభాండారుల కీవిధానము సుఖముగ దోచవచ్చును. ఎక్కువ ఉపయోగములో లేని గ్రంథాలయములలో దీనిమూలమున నష్టమంతగ లేకపోవచ్చును. కాని గ్రంథాలయముయొక్క సేవయే ప్రధానమని యెంచు నేటి భాండాగారు లెవ్వరుగాని పుస్తకములను సరిచూచు నిమిత్తము గ్రంథాలయమును మూయు ప్రయత్నమున కేమాత్రమును సమ్మతించరు. పెద్దపెద్ద గ్రంథాలయములలో కొన్ని వారములు వరుసను గ్రంథములు సరిచూడవలసియున్న యీవిధానమువలన చదువరుల కిబ్బందికలుగునను తలంపుతో ఈచిక్కును తొలగించి గ్రంథాలయముయొక్క దైనందిన కార్యక్రమమున కేమాత్రము భంగము కలుగకుండునట్లు సంవత్సరముపొడవునను – మధ్యమధ్య కొన్నిదినము లీవనినిమిత్తము కొంతకాలమును ప్రత్యేకించుచున్నారు.

పుస్తకముల సరిచూచునిమిత్తము ప్రత్యేకించబడవలసిన దినములు, పని జరుగవలసినకాలము గ్రంథాలయములోగల సంపుటముల సంఖ్యపైనను, ఇందునిమిత్తము వినియోగింపబడు మనుష్యుల పైనను, సంవత్సర కాలములో ఈపని ఎన్నిపర్యాయములు జరుగవలెనో దీని పైనను ఆధారపడి యుండును. పెద్దపెద్ద గ్రంథాలయములలోని గ్రంథములు విషయముననుసరించి విభజింపబడి, ఆయావిషయములకు సంబంధించిన గ్రంథములు చదువరుల అనుకూలము ననుసరించిన వరుసలలో నమర్చబడును. ఇందు కొన్ని వరసల కడకు చదువరులు నేరుగపోవచ్చును. కొన్నింటివిషయమై చదువరులకీ సౌకర్యముండకపోవుటయు గలదు. ఇట్లేర్పఱచబడిన వరుసలలో స్వేచ్ఛోపలబ్ధిగలవి ఈసౌకర్యములేని వానికన్న ఎక్కువపర్యాయములు సరిచూడబడవలెననుట నిర్వివాదాంశము. ఇరువురు మనుష్యులు వారమునకొక దినముచొప్పున పనిచేయుచు సంవత్సరకాలములో లక్ష గ్రంథములుగల గ్రంథాలయమునందలి పొత్తములన్నింటిని రెండుపర్యాయములు సరిచూచుట జరుగును.

ఇక అసలు పనిని పరిశీలింతము. నేటిప్రముఖ గ్రంథాలయములన్నింటిలోను గ్రంథవివరణపట్టికలు, గ్రంథవిభజనపట్టికలు మున్నగునవి పుస్తకరూపముననుండు రిజిస్టరులలోగాక కార్డులరూపమున సొరుగులలో నమర్చబడి తిరుగవేయుటకు సులువుగను, చూచుటకు హాయిగనునుండును. ఈకార్డులపద్ధతి కాలముయొక్క విలువను గమనించి, చదువరులయొక్కయు సిబ్బందియొక్కయు కష్టమును తగ్గించుటలోను, పాఠకులకెక్కుడు ప్రయోజనమును కలిగించుటలోను తోడుపడునట్లేర్పరుపబడిన నూతనవ్యవస్థ (Invention) యని చెప్పవచ్చును. ప్రతిగ్రంథాలయము నందును బీరువాలు, వానియందలి పుస్తకములవరుస ననుసరించి తయారుచేయబడిన కార్డుల పెట్టెయొకటి యుండును. దీనినే 'షెల్ఫ్‌రిజిస్టరు' అందురు.

## ప్రచారములోనున్న గ్రంథములు

మనము సరిచూడదలచిన బీరువాలోని పుస్తకముల కార్డులు గల సొరుగును షెల్ఫ్ రిజిష్టరునుండి బయటకు తీయవలెను. నేటి గ్రంథాలయములలో పుస్తకము లిచ్చి పుచ్చుకొను పద్ధతులుకూడ కార్డులతోనే జరుగుచుండును. ఒక్కొక్క పాఠకుడు గ్రంథాలయమునుండి ఒక్కసారిగ నెన్ని పుస్తకముల నింటికి దీసికొనిపోవ వీలుండునో అన్ని టిక్కెట్టులు వానికియ్యబడును. అతనికి పుస్తకమేదైన కావలసిన తన టిక్కెట్టును గ్రంథభాండాగారికిచ్చి తనకు వలయు గ్రంథమును చూపినను లేక చెప్పినను సదరు గ్రంథమును భాండాగారి చదువరికిచ్చి గ్రంథములోని కార్డును పాఠకుని టిక్కెట్టుతో చేర్చి ఈ రెంటిని తేదీలవారిగను, మరల ఒక్కొక్క తేదీ ఇండ్లకు గొంపోబడిన గ్రంథములను వర్గీకరణపు వరుస ననుసరించియు చిన్నిసొరుగులలో పేర్చును. గ్రంథాలయమునకు వచ్చు వారిని, ఇందుండి బయటికి పోవువారిని కనిపెట్టి చూచుచు, వాపసు గ్రంథములను పుచ్చుకొనుచు, వలయు వారికి గ్రంథములనెరవిచ్చుచు, ఇందుకు సంబంధించిన రికార్డునంతటిని తన యధీనమున నుంచుకొని గ్రంథాలయ ముఖద్వారమున నుండు సహాయ భాండాగారిని పరివేష్టించియుండు ప్రదేశమును ఆంగ్లమున 'కౌంటర్' అందురు. పైన తీయబడిన షెల్ఫ్‌రిజిష్టరు సొరుగును కౌంటరువద్దకు గొంపోయి అచ్చట నున్నవారికి తానానాడు సరిచూడబోవు గ్రంథములవర్గము, ఈ వర్గము యొక్క పరిచయ సంఖ్యలవరుస తెలుపవలెను. తనుపరి కౌంటరులోనున్న యాతడు తన యధీనమునందున్న కార్డులనుచూచి ఒక్కొక్క తేదీలో పై చెప్పబడిన వరుసకు సంబంధించిన పుస్తకముల పరిచయసంఖ్య*లను చదువునట్లు చేయవలెను. ఈకార్డులలో

* ప్రతి పుస్తకమునకు వర్గసంఖ్య, పుస్తకసంఖ్య ఉండును. ఈ రెండును కలసిన సంఖ్యయే పరిచయ సంఖ్య. దీని నాంగ్లములో 'కాల్ నంబర్' అందురు.

పుస్తకముల పేర్లున్నను సంఖ్యలను చదువుటవలన కాలము కలసి వచ్చును. అతడట్లు చదువుచున్న సంఖ్యలకార్డులను షెల్ఫ్‌రిజిష్టరు సొరుగులో పైకి త్రిప్పియుంచవలెను. ఈ కార్డులు మామూలుగ అడ్డముగ నమర్చబడి ఎడమచేతి పైమూలయందు ప్రతిదానిపైనను పరిచయసంఖ్య వ్రాయబడియుండును. కార్డులను పైనచెప్పినట్లు త్రిప్పుటలో పరిచయసంఖ్యలు స్పష్టముగ కానరావలెను. ఈ పని ముగిసినపిమ్మట పైకి త్రిప్పియుంచిన కార్డులు ప్రచారములోనున్న గ్రంథములకు చెందినట్లు భావించవలెను.

## బీరువాల పరిశీలన

పైపని ముగియులోపల ఒకరిని గ్రంథాలయములో నాడు సరిచూడవలసిన బీరువాలలోని గ్రంథముల క్రమమును చక్కబఱచు నట్లేర్పాటు చేయవలెను. వాపసు చేయబడిన గ్రంథములలో నుండి ఈ విభాగమునకు చెందిన గ్రంథముల నన్నిటిని తెప్పించి బీరువాలలో పెట్టించవలెను. ప్రచారములోనున్న గ్రంథములను కౌంటరు వద్ద గుర్తు పెట్టుకొన్నపిదప ఈ బీరువాలయొద్దకేగి ఒకరిని వరుసగా నందలి గ్రంథముల వీపులపై నున్న పరిచయసంఖ్యలను చదువమని మరొకరు షెల్ఫ్‌రిజిష్టరు కార్డులలోని సంఖ్యలతో వీనినిసరిచూచుచు పోవలెను. మధ్యమధ్య నిలువుగనున్న కార్డులు తగిలి నప్పుడు వానిని యథాస్థానమునకు త్రిప్పవలెను. బీరువాలో లేని పుస్తకముల సంఖ్యలు షెల్ఫ్‌రిజిస్టరు కార్డులలోకనబడుచో అట్టికార్డులను విమర్శనార్థము వేరుగ నొక పెట్టెలో నుంచవలెను. ఒక్కొక్కపర్యాయము సరిచూడవలసిన గ్రంథవిభాగమునకు చెందిన పరిశీలన పూర్తియగుట తోడనే మిగిలిన కార్డులను షెల్ఫ్‌రిజిస్టరుకు వాని క్రమమునననుసరించి చేర్చవలెను.

## విమర్శన

పరిశీలనలో కానరాని గ్రంథములేవో విమర్శనార్థము ప్రత్యేకించబడిన పైకార్డులనుబట్టి తెలిసికొనవచ్చును. ఇందు కొన్నివాపసు గ్రంథములలో నుండవచ్చును. చదువరులయొద్ద మఱికొన్ని దొరకవచ్చును. అసలు స్థానమునుండి తప్పిపోయి కొన్ని ఇతరఅరలలో చేరియుండును. అట్టకట్టుటకో, మరమ్మతుకో కొన్ని వేరుపరుపబడియుండును. ప్రచారములోనున్న గ్రంథముల కార్డులు కొంచెము వరుస తప్పినప్పుడుకూడ వీనిజాడ తెలియకుండుటయు సంభవమే. కొన్నిగ్రంథములు పోయినను పోయియుండును. తొలగింపబడిన గ్రంథముల జాబితాలో కొన్నింటిజాడ తెలిసికొనగలుగుదుము. ఈ విమర్శనమంతయు జరిగినమీదట కనుగొనబడు గ్రంథముల కార్డులను షెల్ఫ్‌రిజిష్టరు కేబినెట్టుకు చేర్చవలెను. ఇంకను మిగిలినకార్డులను పైపరిశీలనా నివేదికలోచేర్చి ప్రధానగ్రంథభాండాగారి కప్పగించవలెను.

## మరొక పద్ధతి

పైవిధానమునకు ప్రత్యామ్నాయముగ మఱొకపద్ధతిగలదు. ఇదియు గ్రంథాలయసేవకులకు పరిచితమగుట ముఖ్యము. గ్రంథాలయముయొక్క గ్రంథవివరణ పట్టికలోగల ప్రవేశసంఖ్యలను వరుసగ నొక రిజష్టరులోనో, విడికాగితములమీదనో ముద్రించి ఒక్కొక్కసంఖ్య కెదురుగ కనీసము 4 కలములనైన వదలవలెను. గ్రంథాలయములో ఒకప్రక్కనుండి మొదలుపెట్టి ఒక్కొక్కబీరువాలోని ప్రతిగ్రంథముయొక్క పైఅట్టలోపలిభాగమున లిఖింపబడియుండు క్రమసంఖ్య నొకరు చదువుచు రెండవవారట్లు చదువబడిన సంఖ్యకెదురుగనున్నకలములో ✓(టిక్కు)గుర్తువ్రాయుచు పోవలెను.

అన్ని బీరువాలలోని పుస్తకములు పూర్తికాగానే ప్రచారములో నున్న గ్రంథములకుకూడ నిట్లే చేయవలెను. తక్కిన అన్నిసందర్భములు పై విధానమునందువలెనే యుండును. కాని యీ పద్ధతిలో మొదటిదానిలోకంటె ఎక్కువకాలము వ్యయమగుటయు, అన్ని పుస్తకములను వరుసగ నొక్కసారి పూర్తిగచూచినగాని ఫలితము తేలకపోవుటయు తటస్థించును. అయితే చిన్న గ్రంథాలయములకీవిధానమేయెక్కువ అనుకూలముగ నుండగలదు.

# వయోజనవిద్య : గ్రంథాలయములు *

జన సామాన్యములో విజ్ఞానవ్యాప్తిని గావించు సాధనములలో గ్రంథాలయములు ప్రధానస్థానము నాక్రమించుచున్నవి.

గ్రంథాలయములు రెండు రకములు. తరతరాలుగా రాజాస్థానములయు, మఠాధిపతులయు గర్వమునకు కారణభూతమైనవి మొదటితరగతికి చెందినవి. వీని యాశయము పుస్తకములను సేకరించి భద్రపరచుట. విజ్ఞానప్రచారమునకు ప్రాముఖ్యాన్నవి రెండవ తెగకు చెందినవి. పాశ్చాత్యనాగరికతా ఫలితములనదగు నేటి గ్రంథాలయములు అల్పారంభములు గలవయ్యు దినదినాభివృద్ధి నందుచు సాంఘికజీవితమున కెంతయు నుపయోగపడుచున్నవి. వీనికి వయోజనవిద్యతో మిగుల సన్నిహితసంబంధము గలదు.

కాలగతి ననుసరించిన మార్పులలో గ్రామికజనముయొక్క విద్యాభిలాష యొకటి. ఇంగ్లాండు మొదలగు దేశములలో పారిశ్రామిక విప్లవఫలితముగ వ్యక్తిగత ఆర్థిక స్వాతంత్ర్యసూత్రము బలపడి దీనితో శ్రమజీవులకు విద్యయొక్క ఆవశ్యకత గుర్తింపబడెను. ఈ విద్యను వారికందుబాటులోనుంచుట కేర్పడినవే అచ్చటి సంచార గ్రంథాలయములు, చందాలపై నడుపబడిన పుస్తకాలయములు, కర్మకరుల సమితులు మున్నగునవి. ఈవిధముగ ప్రజాసామాన్యముయొక్క విద్యాభిలాషా ఫలితముగ గ్రంథాలయము లేర్పడుటయే గాక వీని యభివృద్ధియు నట్టి అభిలాషయొక్క పెంపుమీదనే ఆధారపడియుండుటను ఆయాదేశముల చరిత్రలు చాటుచున్నవి.

---

* ది మాడరన్ లైబ్రేరియన్ 11 వ సంపుటము 2 వ సంచికలోని సోహన్ సింగుగారి వ్యాసము ననుసరించి వ్రాయబడినది.

కాన వయోజనవిద్యయొక్క మొదటిఫలితములలో గ్రంథాలయము లెట్లు ప్రధానమైనవో దీనినిబట్టి మనము గ్రహించగలము. ఇట్లు వయోజనవిద్యాప్రచార సాధనముగా మొదటనేర్పడిన గ్రంథాలయములు క్రమముగ తమ యాశయమును విస్తరించుకొనినవి. అచ్చులోనున్న అన్నిరకముల ప్రచురణములను సేకరించి సంఘములోని ప్రతియొక్కరి అవసరములను తీర్చుటకివి పూనినవి. నాగరిక సంఘములో నేటి గ్రంథాలయములు బహుళముగను, విస్తారముగను ఉపకరించుచున్నవి. ఇవి సమస్తభౌతికవిద్యలకు, కళలకు సంబంధించిన ప్రాథమికవిజ్ఞానమును ప్రసాదించుటనుండి, మానవులకుండు అన్నిరకముల మనోరోగముల మాన్పు సమర్థతను కలిగియున్నవి.

వయోజనవిద్యా ప్రచారసాధనములలో గ్రంథాలయములు ప్రధానస్థాన మాక్రమించుచున్నను ఈసాధనముల సంఖ్యయు క్రమముగ పెరిగినది. పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయములు పౌరవిద్యకు కొంత ప్రోత్సాహమును కలిగించుచున్నవి. ప్రజలలో వినోదము, విద్యావ్యాసంగము కలిగించునిమిత్తమేర్పడిన సినీమాలు, పత్రికలు, రేడియోలు, తమ తమ విధులనుగూర్చిన పునర్విచారణకు పూనుకొన్నవి. వస్తుప్రదర్శనశాలలు విద్యాసాధనములుగ తమ ధర్మము నెక్కువశ్రద్ధతో పరిపాలించుచున్నవి. అమెరికాలోని 'పబ్లిక్ ఫోరము'లవంటి నూతనసాధనములును కొన్ని బయలుదేరినవి. గ్రంథాలయాశయములో కలిగినమార్పు, వయోజనవిద్యాప్రచార సాధనాలపెంపు గ్రంథాలయములకు వయోజనవిద్యకు గలసంబంధములో క్రొత్తమార్పుకు కారణమైనవి. అమెరికాలో గ్రంథాలయోద్యమము, వయోజనవిద్యాప్రచారకార్యక్రమము – రెండును అమిత ధనవ్యయముతో పెంపొందినవి. క్రిందివిషయములు అమెరికనులు వయోజనవిద్యాప్రచారమునకై తమ గ్రంథాలయముల నెట్లుపయోగించిరో తెలుపగలవు.

వయోజనవిద్యయననేమి? దీని యుద్దేశములేవి? వీనిని గ్రంథాలయములెట్లు నెరవేర్చగలవు? అనువిషయములనుగూర్చి ముందు విచారింతము. వయసుమీరినవారికి కావలసిన విద్య వయోజనవిద్య. వీరికి పాఠశాలలలో పిల్లలకు చెప్పబడు చదువుకూడ ఒక్కొక్కప్పుడవసరమగును. దీని అవసరము మనదేశమున మిక్కుటముగనున్నను నాగరిక సంఘములోని మానవమాత్రులు తెలిసికోవలసిన సంగతులను గూర్చి మనము ముందు చర్చింతము. అప్పుడు వయోజనవిద్య యొక్క ఆదర్శము మనకు బోధపడగలదు. ప్రజలు తమసామాజికజీవనమును శక్తివంతముగ గడుపగలిగిన సమర్థత గలిగియుండు టవసరము. దీనికిమించినజ్ఞానము వారివృత్తికిగాని, అభిమానవిషయమునకుగాని సంబంధించినదగును. ఇంతమాత్రముకూడ వారు తెలిసికొనకుండుట దురదృష్టమని చెప్పకతప్పదు.

సంఘజీవనమును సమర్థతతో గడుపుట కనువైన విద్యను గూర్చియు దీనిని ప్రసాదించుటలో గ్రంథాలయములకు గల స్థానమును గూర్చియు విచారింతము.

౧. వ్రాత, చదువు, సామాన్యగణితము సమాజములోని ప్రతి మానవుడు మొదట నేర్వవలెను. వీనికి దూరుడగువాడు ఆధునిక నాగరికతాఫలితములను వేనినిగాని పొందజాలడు. ఈవ్రాత చదువులు పసితనమున పాఠశాలలలో నేర్వవలసియుండును. ఈ అవకాశము నపుడు పొందియుండని పెద్దవారలకు ముందు వీనిని నేర్పుటవసరము. నిజమునకిది గ్రంథాలయకార్యక్రమములోని భాగముగా నెంచబడకున్నను ౧౦౦ కి ౯౦ మందికి పైగా నిరక్షరాస్యులుగల మనదేశములో ఈపనిని రాత్రి పాఠశాలలద్వారాను, వయోజన విద్యా కేంద్రముల మూలమునను సాగించ వలసియుండును. చాలకాలమునుండి ఆంధ్రదేశములోని గ్రంథాలయములు కొన్ని యీ పనిని నెరవేర్చుచునే యున్నవి. ఈ విషయమై యింతటితో

నూరకున్నచో ప్రయోజనము లేదు. పిన్నలుగాని పెద్దలుగాని నేర్చిన వ్రాతచదువులు వాడుకలో లేనియెడల కొంత కాలమునకు మరల వారు పూర్వస్థితికి వచ్చుట సంభవము. కాన వారు సాధించిన అక్షరాస్యతను నిలబెట్టుకొనుటకు నిరంతర గ్రంథపఠనము మిగుల నవసరము. దీనికి కావలసిన గ్రంథములను చౌకగను సులభముగను వారికందజేయుటకు గ్రంథాలయములు కావలెను. ఎవ్వరుగాని విడివిడిగా ప్రతి క్రొత్త పుస్తకమును కొనుటసాధ్యము కాదుగదా! ప్రాతపుస్తకములే మరల మరల తిరుగవేయుటయు పొసగదు. పఠనపుటలవాటు లేకున్న కొంత కాలమునకు అక్షరాస్యులు సహితము నిరక్షరాస్యులగుదురు. పైన పేర్కొన్నచిక్కులను తొలగించుటకు ప్రతియొక్కరికి గ్రంథాలయ మనుబాటులో నుండవలయును.

౨. తాను నివసించుభూమిని గూర్చిన జ్ఞానము – అనగా దేశ భూగోళమును ప్రతిమనుజుడు నేర్వవలెను. పాఠశాలలలో బోధింపబడుటయేగాక, మన నిత్యజీవితములోను దేశ భూగోళవిషయములు తఱచుగ మనకు తెలియుచుండును. అయినను కాలానుసరణముగ కలుగు మార్పులతో పైవిషయములలోను కొన్ని మార్పు లప్పుడప్పుడు కలుగుచుండును. వీనిని పత్రికలు మున్నగు వానిద్వారా మనము తెలిసికొనగలము. నేటి సంఘములోని వయోజనులలో చాలభాగము ప్రస్తుత ప్రణాళిక ననుసరించి పాఠశాలలలో చదివినవారు కానందునను, క్రొత్తగ అక్షరాస్యులగు వారికిని ఈ భూగోళ విషయ మవసరము గనుకను, వీరి కిందునిమిత్తము కావలసిన పుస్తకములు మున్నగు పరికరముల నందజేయుచు గ్రంథాలయములు చాల తోడ్పడగలవు.

3. స్వజనమును గూర్చిన జ్ఞానముకూడ విద్యయొక్క ప్రధానాశయములలో నొకటి. దీనిని మూడుభాగములుగ విడదీయవచ్చును.

(అ) దేశచరిత్ర:—దీనిని తెలిసికొనుట మూలమున మనుజులు సంకుచితమగు స్వార్థదృష్టినుండి విడివడి విశాలాశయములగు ఐకమత్యము, దేశభక్తి మున్నగు గుణముల నలవఱచుకొనగలరు.

(ఆ) సాంఘిక జీవితమునకు పునాదులనదగిన వివిధసంస్థలను గూర్చిన విజ్ఞానము:— వీనిలో ప్రభుత్వమునకు సంబంధించిన విషయము ప్రధానమైనది. పౌరవిద్యయు వయోజనులు నేర్వదగిన అంశమే. దీనికి వారివయస్సు చాల అనుకూలమైనది.

(ఇ) ఆర్థికసంబంధములు:- సంఘముయొక్క ఆర్థికనిర్మాణము, ఇచ్చి పుచ్చుకొనుటలు మున్నగాగల జీవితసమస్యలు పసివారల కర్థముగావు. ఇవి పెద్దవారి కవసరము. వీనిని వారు సులభముగ గ్రహించగలరు.

దేశచరిత్ర, రాజకీయార్థికములను గూర్చి తెలియగోరు వారలకు గ్రంథాలయము లెక్కువగ నుపకరించును. వీనికి సంబంధించిన వివిధసమస్యలను గూర్చి తెలియగోరువారి కనుకూలమగు గ్రంథములను గ్రంథభాండాగారి సూచించును. ఇట్టి విజ్ఞాన సముపార్జనము నకై, పూనినజట్టులకు వివిధవిషయములకు సంబంధించిన పుస్తకముల జాబితాలను ఆయావర్గముల కనుకూలముగ నీతడు సిద్ధపఱచును.

౪. ప్రతి మానవునకు తన ఆరోగ్యమును, శక్తిని వృద్ధిచేసికొనుట కనుకూలముగ జ్ఞానము ముఖ్యముగ కావలెను. శరీరశాస్త్రము, ఆరోగ్యవిషయములతో పాటు వివాహము, శిశుశిక్షణకు సంబంధించిన విషయములు కూడ పెద్దవారికి తెలిసియుండవలెను. ఇందు మొదటి రెండంశములను గూర్చిన ప్రాథమిక జ్ఞానము పాఠశాలలలో బోధింపబడుచున్నను, కడపటి రెండువిషయములను గూర్చి తెలియగోరువారికి స్వయంపఠనమేశరణ్యము. ఇక ఈ స్వయం

పఠన విధానమున గ్రంథాలయ ప్రాముఖ్యమును తిరిగి తిరిగి చెప్ప నక్కరలేదుగదా !

౫. వృత్తికి సంబంధించిన జ్ఞానసముపార్జనమును విద్యయొక్క ప్రధానాశయములలో నొకటి. ఇందువిషయమైన ప్రాథమిక జ్ఞానము నేర్పుటకు ప్రత్యేక పాఠశాలలు, కళాశాలలు – వీనియందలి గ్రంథాలయములు తోడ్పడుచున్నవి. ఒక వృత్తికి సంబంధించిన ప్రాథమిక జ్ఞానమును ప్రసాదించుటకంటె ఆయావృత్తులవారు తమ తమ పనుల నెక్కువ సమర్థతతో నిర్వహించునట్లు చేయుటలో నేటి గ్రంథాలయము లెంతయు నుపకరించును. అయితే వీనిలో ఆయా వృత్తులకు సంబంధించిన గ్రంథములు పూర్తిగా నుండవలెను. నేటి ఆర్థికవిధాన కారణముగ తఱచు అనేకులకు సంభవించు నిరుద్యోగ బాధనుండి వారిని కాపాడుటయే గాక, నూతన వృత్తులలో వారిని ప్రవేశపెట్టుట కనుకూలమగు విజ్ఞానమును జనులకందించుటకై పాశ్చాత్యసీమలందలి గ్రంథాలయములు చేయుకృషి వర్ణనాతీతము.

గృహనిర్వాహకత్వము, శిశుపోషణ ప్రత్యేకము స్త్రీల విధులుగ పరిగణింప బడుచున్నవి. ఇంగ్లండు అమెరికాదేశము లందలి తల్లిదండ్రుల సంఘములు స్త్రీలకు పైవిధులను గూర్చి బోధించుటకు పూనుకొన్నవి. ఇందు కీసంఘములవా రుపయోగించు సాధనములలో గ్రంథాలయములు ప్రధాన స్థానము నాక్రమించుచున్నవి. అమెరికా లోని చాల గ్రంథాలయముల నీసంఘములు గుర్తించి ఉపయోగించుకొనుచున్నవి.

౬. నేటి నాగరికతకు ప్రధానకారణమైన వైజ్ఞానికశాస్త్ర (సైన్సు) పరిచయము ప్రతి మనుజునకును అవసరము. ముఖ్యమగు వైజ్ఞానిక సిద్ధాంతములు, వాని యుపయోగ ప్రయోగములనుగూర్చి తెలుపుట వయోజనవిద్యలో నొక అంగము. వీని ప్రచారము విష

యమై సినిమా రేడియోలతోపాటు పత్రికలు సహితము పని చేయుచున్నవి. సైన్సుకు సంబంధించిన చదువదగిన ప్రచురణముల నన్నిటిని సేకరించి యుంచుట గ్రంథాలయముల పని. విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితములను ప్రజాసామాన్యమున కందుబాటులో నుంచు పనికి సమర్థులు పూనుచో వాని ప్రచారమును గ్రంథాలయములు సాగించును.

౨. ప్రపంచభూగోళము, ప్రపంచ చరిత్రల పరిచయము నేడు సర్వజనుల కవసరమని వేరుగ జెప్పనక్కర లేదు. ఈ పరిచయమును కూలంకషముగ గలిగించుటకు గ్రంథాలయములు కృషి చేయవచ్చును.

పైనజెప్పిన ప్రయోజనములను పొందగోరు వ్యక్తులకు గ్రంథాలయములెట్లు తోడ్పడునది తెలిసికొంటిమి. ఇప్పుడు ప్రయోజనవిద్యా ప్రచారకుల కివి యెట్లుపయోగపడునో విచారింతము. దీనికి ముందు నేటి గ్రంథాలయముయొక్క వ్యాప్తిని మనము గ్రహించవలెను. పెద్దపుస్తకము లేగాక పత్రికలు, కరపత్రములు, చిన్నపుస్తకములు, వ్యాసముల కత్తిరింపులు, చిత్తరువులు, సినిమాఫిలిములు, గ్రామఫోనురికార్డులు మున్నగు సాధనములనన్నిటిని ఆధునిక గ్రంథాలయములు సేకరించి వీనిని ప్రచారములోనికి తెచ్చుచున్నవి.

గ్రంథాలయము లెచ్చటనున్నను ప్రయోజనవిద్యను నేరుగ ప్రోత్సహించుటకై క్రిందివిధానము లుపకరించుచున్నవి.

౧. వ్యక్తిగతసలహాలు : వివిధవిషయములనుగూర్చి తెలియగోరు వారికి గ్రంథాలయములలో సలహానిచ్చు యేర్పాటొకటి. ఆ యావ్యక్తుల అభిమానవిషయములకు సంబంధించిన గ్రంథాలయోపకరణముల జాబితాలనుతయారుచేయుట రెండవది. ఎక్కువ ప్రయోజనకరముగ నుండునిమిత్త మీజాబితాలలో నుదహరింపబడిన గ్రంథ

ములు మున్నగు పరికరములగూర్చిన వివరములుకూడ చేర్చబడును. గ్రంథాలయములలో గల పుస్తకములు మున్నగువానిని పాఠకుల యోగ్యతల కనుకూలించు క్రమమున వ్రాసియుంచుట మరొకటి.

౨. వయోజన విద్యాప్రచార కార్యక్రమములో గ్రంథాలయము ప్రముఖపాత్రగ నున్నందున ఇందునిమిత్తము పనిచేయు అన్నిసంస్థల కార్యక్రమము నిది సమన్వయపరచగలదు. ఒక్కొక్క సమాజము లేక వర్గమునకు సంబంధించిన ఇట్టి సంస్థలసూచికను తయారుచేయుటయేగాక గ్రంథాలయములు వీని కార్యక్రమమును వెల్లడిపఱచుచు వీనికి సభ్యులను జేర్చుటకై తీవ్రమైన కృషిని జేయ వచ్చును.

౩. గ్రంథాలయములు వయోజనవిద్యా ప్రచారకులతో సహకారము నెఱపుచు, వారి ఉద్యమపద్ధతుల నెఱుగుచు, తమకడనున్న వయోజనవిద్యా ప్రచారమునకు పనికివచ్చు పరికరములనుగూర్చి వారికి తెలియజేయుచు, వీనిని బోధనాసమయమున వారుపయోగించుకొనునట్లు చెప్పుచు, తమప్రచారమున కనుకూలించు ఉచిత వాఙ్మయముయొక్క భోగట్టాను వారి కందజేయుచు వర్ధిల్లగలవు. మఱియు వయోజనుల నిమిత్తమేర్పడు తరగతులలో వారికి తగిన గ్రంథములనుగూర్చిన ఉపన్యాసములద్వారా గ్రంథభాండాగారులు నేరుగ వయోజనవిద్యా ప్రచారమున పాల్గొనవచ్చును.

౪. వయోజనులలో విజ్ఞాన వ్యాపనము గావించుట కేర్పడు ఉపన్యాసములు, చర్చలు మున్నగువాని యేర్పాటుకు గ్రంథాలయములు తమ భవనములో తావు నొసంగవచ్చును. ఈభవనములలో వయోజనవిద్యా ప్రచారక సంఘముల కార్యస్థానముల నుంచుటయు మేలే.

౫. ఈమవచ్చిన ప్రతియొక్కడును తన కనుకూలమగువృత్తిని నిర్ణయించుకొని జీవయాత్ర గడపుటకు సాయపడు నిమిత్తము వివిధ వృత్తులు, వానికిగల అవకాశములకు సంబంధించిన వాఙ్మయసూచి కలను తయారుచేసి యుంచుట ఇతరదేశములందలి గ్రంథాలయములు చేయుచున్న పనియే.

మన మిప్పుడొక గొప్ప సంకటములో నున్నాము. నిరాశ, దుఃఖము మనల నావరించినవి. ఏమిచేయుటకును తోచని ఈసమయములో సహితము నిశ్చయాత్ములు కొందఱు ఏదేని యొక కార్యమును నిర్వహింప జూచుచున్నారు. కాని పూర్వాచారములు వీరికి ప్రబలాటంకములుగ నున్నవి. నూతన విజ్ఞానముకొఱకు, ఒకవినూత్న సత్యముకొఱకు వీరు కృషిచేయుచున్నారుగాని ఇది వారికెచ్చటనులభించుట లేదు. 'సమాధానము, సహనము, సహకారము'– ఇవి మానవ కోటి కంతటికిని అవసరమని మహాపురుషుల యుపదేశము. మానవ సంఘమునకు కావలసిన పై మూడు విషయముల నందరికి బోధచేయవలసిన విధి మనపైగలదు. ఈవిధిని నెఱవేర్చుటకై –జనులకు నూతన చైతన్యమును, నూతన విజ్ఞానమును ప్రసాదించుటకై గ్రంథాలయములు కృషిచేయవలసి యున్నది.

# గ్రంథాలయాలు : లోకసేవ

'పనిలేనిమనుష్యులు తీరికగా కూర్చొని చదువుకొనడానికే గ్రంథాలయాలు' అనే అభిప్రాయం నాచిన్నతనంలో హెచ్చుగావుంటుండేది. సంపన్నుల కాలక్షేపానికీ, పండితుల గోష్ఠికీ మాత్రమే గ్రంథాలయా లుపకరించిన దినాలు లేకపోలేదు. పైకులాలవారికీ, అధికారులకు యివి హెచ్చుగా ప్రయోజనపడడంకూడ లోకమెరిగినదే.

కాని కాలంతోపాటు పైనజెప్పిన పరిస్థితి పూర్తిగామారింది. ప్రభువుతోపాటు ఫకీరు, పండితునితో సమానంగా పామరుడు గ్రంథాలయ కార్యక్రమంలో స్వత్వాన్ని సంపాదించినారు. కోరి వచ్చినవారికేగాక దూరంగా వుంటున్నవారినికూడా వెంటబడి గ్రంథాలయాలు తమసేవను వారి కందించే యేర్పాట్లు లోకంలో బాగా ప్రచారంలోకి వచ్చినవి. ఏమీ తోచనప్పుడు కాలక్షేపానికి మాత్రమే హెచ్చుగా ఉపయోగపడ్డ గ్రంథాలయాలు నేడు సంఘంలోని వ్యక్తులొక్కొక్కరి అనుదిన జీవయాత్రకూ తోడుపడే విజ్ఞానాన్ని అందజేయడంలో ముందంజవేస్తున్నవి. వినోదాన్ని, వివేకాన్ని ప్రసాదించడంతో విత్త సేకరణకుకూడ నేటి గ్రంథాలయాలలోని పుస్తకాలు విస్తారంగా వినియోగపడుతున్నవి. నాగరిక దేశాలలోని పరిస్థితులను మనం గమనిస్తే అచ్చటి ప్రజానీకం అభివృద్ధికి మూలకారణం ఆదేశాల గ్రంథాలయాలేనని స్పష్టమౌతుంది. గ్రంథాలయభూమిగా ప్రసిద్ధికెక్కిన అమెరికా, ద్వితీయప్రపంచసంగ్రామానికి పూర్వం పాశ్చాత్యదేశాల ననేకవిషయాలలో . తలదన్నిన జపాను, పూర్వమెంతో వెనుకబడియుండి విప్లవానంతరం చకచక అభివృద్ధిపొందిన సోవియట్ రష్యా జనసామాన్యంలో విద్యావ్యాప్తిని

కలిగించడం ద్వారానే ముందుకు సాగలిగినవన్న విషయం ఆయా దేశాల చరిత్రలు మనకు ఋజువుచేయగలవు. ప్రజాసామాన్యంలో విద్యాప్రచారానికై యేర్పడ్డ వివిధసాధనాలలో ఉత్తమసంస్థ గ్రంథాలయం. జీవితంలో ఎవరికివారు స్వయంగా సంపాదించుకొనే జ్ఞానమే ఉత్తమమైనదన్న సూక్తి ననుసరించి దీనిసాధనకు తోడ్పడే గ్రంథాలయ సంస్థయొక్క ఉత్కృష్టతను మనం గ్రహించవచ్చును.

మన పూర్వపు చదువులలో చతుష్షష్టి (౬౪) కళలు మాత్రమే పేర్కొనబడినవి. వివిధదేశాలలోని నేటి కోట్లాదిప్రజల వృత్తులు – వ్యాపారవ్యవసాయాలు, కాలక్షేపాలు విరివిగా పెరిగినవి. ఈ ఒక్కొక్క వృత్తికీ, వ్యాపారానికీ, కార్యక్రమానికీ సంబంధించిన విజ్ఞానంకూడ అనంతంగా వృద్ధినొందినది. ఇంగ్లీషుభాషలో నిత్యజీవిత కార్యక్రమంలోని ప్రతిచిన్న అంశాన్నిగూర్చి కొన్నిగ్రంథాలు– వివిధరీతులలో వేర్వేరు గ్రంథకర్తల రచనలు– నేడు మనం చూడవచ్చు. ఆయుర్వృద్ధికి మార్గాలు, సుఖసంసారానికి సూచనలు, సొబగునడకకు చిన్నెలు, బంతులాట పద్ధతులు, స్నేహసంపాదనకు– మనుజులను లోబరచుకొనడాని కుపాయాలను వెల్లడించే గ్రంథాలమెరికా ముద్రణాలయాల్లో కొల్లలుగా బయలుదేరినవి. దేశంలో ప్రధాన పరిశ్రమలనుగూర్చిన, వర్తక వాణిజ్యములకు సంబంధించిన, వ్యవసాయవిషయమైన వాఙ్మయ నిర్మాణ మనంతంగా సాగుతూవుంది. అచ్చటిజనం నూటికి నూరుగురు అక్షరాస్యులు. అచ్చటిప్రభుత్వాలు ఎంతసేపటికీ ప్రజాభివృద్ధిపైననే తమదృష్టిని నిలిపియుంచును.

అచ్చటి ప్రభుత్వ యంత్రపు మూలస్తంభాలైన పౌరులు తేజోవంతులు. నిరంతర కార్యనిమగ్నులు. తాము చేపట్టిన కార్యక్రమ మెటువంటిదైనా దానిని నేర్పుగ నిర్వహించడానికీ, చిన్నపనైనను చక్కగా తీర్చడానికీ తాము కుతూహలపడుతూ వుంటారు. శ్రమశక్తిని, సమయాన్ని, ధనాన్ని అనవసరంగా వెచ్చించడం వారికి

గిట్టదు. పౌరహక్కులకై పోరాడటమేగాక పౌర ధర్మాల నిర్వహణంలోనూ వారు పట్టుదలను ప్రదర్శిస్తారు. ఈ తీరుతెన్నులను ప్రజలలో విరివిగ వ్యాపింపజేయడాని కా దేశాలలోని గ్రంథాలయాలెన్నోవిధాల కృషిసల్పుతూవున్నవి. లోకమునందలి మారుమూలాలలోని విజ్ఞాన విశేషాలను కోరినవారికి లేదనకుండా అందజేయడానికా యా దేశాలలోని గ్రంథాలయాలు సదా సంసిద్ధంగా వుండును. ఈసందర్భంలో ఒకప్పుడు మదరాసు యూనివర్సిటీ గ్రంథాలయము వారు కెనడాలోని ఒక గ్రంథాలయపాఠకునికి సాయపడిన సమాచారం నేటి గ్రంథాలయాల నిర్వహణ విధానాన్ని చక్కగా చూపెట్టగలదు.

పదిహేనేండ్లకుపూర్వం మదరాసు యూనివర్సిటీ గ్రంథాలయానికి కెనడాలోని ఒక యూనివర్సిటీ (Manitoba) గ్రంథాలయంనుండి ఒక జాబు వచ్చింది. ఈ గ్రంథాలయ పాఠకులలో ఒకరు తాటిచెట్టువలని ౮౦౧ ప్రయోజనములనుగూర్చి తమిళభాషలో గల ఒక కావ్యాన్నిగురించిన భోగట్టాను కోరినారు. చిన్నదైతే దీని ప్రతినిగాని, తర్జుమానుగాని తాను వెలయిచ్చి తీసికొను సంకల్పాన్ని ఆయన వెలిబుచ్చినారు. కెనడాదేశంలోని ఆ గ్రంథాలయంవారు తమ గ్రంథాలయాన్నంతా దీనికొరకు గాలించినారు. ఫలితం లేకపోయింది. తమిళదేశంలోని యే గ్రంథాలయమైనా తమకు భోగట్టా యివ్వగలదని వారు భావించినారు. కనుక దీనికొరకు మదరాసు యూనివర్సిటీ లైబ్రరీకి వ్రాసినారు.

వీరు మదరాసు యూనివర్సిటీ లైబ్రరీ కేటలాగు, నగరంలోని యితర గ్రంథాలయాల కేటలాగులు ముందు వెదకినారు. బ్రిటిష్ మ్యూజియంలోని తమిళగ్రంథాల వివరణజాబితాను క్షుణ్ణంగా తిరగవేసినారు. దీనిజాడ దొరకలేదు.



తర్వాత తంజావూరు రాజభవనంలోని గ్రంథాలయంవారికి వ్రాసినారు. తమిళపండితులను – అందులో ముఖ్యంగా 'దాక్షిణాత్య కళానిధి' బిరుదాంకితులైన డాక్టరు వి. స్వామినాథఅయ్యరుగారిని అడిగిచూచినారు. ప్రయోజనం లేకపోయింది.

అంతట గ్రంథాలయం సిబ్బంది పాతపుస్తకాల దుకాణాలపై పడ్డారు. వీధులవెంట తిరుగుతూ పాటలపుస్తకాల నమ్మేవారివెంట పడ్డారు. వారిశ్రమ అక్కరకురాలేదు.

తాళవర్గానికిచెందినవృక్షాలనుగూర్చినవ్యవసాయవృక్షశాస్త్రాల పుస్తకాలను తిరగవేసినారు. విసుగెత్తింది. కాని వెతికేపనిని వారు విడువలేదు. ఇంతలో ఒకగ్రంథంలో(1) వీరు వెదకుతున్న విషయం ప్రశంస కొంతకనబడింది. వివరాలకై మరొకపత్రికను చూడవలసినదిగా వీరికిందులో సూచనచిక్కింది. ఈపత్రిక (2) లో మరికొన్ని వివరాలు లభించినవి. 'తాళవిలాసం' అనే తమిళపద్యకావ్యంలో తాటిచెట్టు ప్రయోజనాలు ౮౦౧ వర్ణింపబడినట్లును, విలియం ఫెర్గూసన్ అనే ఆయన సింహళదేశపు తాటిచెట్టును వర్ణిస్తూ వ్రాసిన గ్రంథం (3)అనుబంధంలో యీవివరాలున్నట్లునూ, యీగ్రంథం ౧౮౫౦ వ సంవత్సరంలో అచ్చయినట్లునూ, దీనిప్రతులు చాలకాలమునుండి దొరకుట లేదనిన్నీ యీపత్రికలో వ్రాసియున్నది. ఫెర్గూసన్ రచించిన పై గ్రంథంకొరకు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

తాళవిలాసం రచయిత స్వస్థానం కుంభకోణమని తెలిసినందున, దీని ప్రతి కావలెనని పాఠకుడు కోరియున్నందున మదరాసు యూనివర్సిటీ లైబ్రరీవారు కుంభకోణంతాలూకా తహశీల్దారుకు వ్రాసినారు. పాపమాయన శ్రద్ధవహించి ఆతాలూకాలోని గ్రామోద్యోగులద్వారా ప్రతి గ్రామాన్నీ గాలించినారు. ఎంత శ్రమపడినా పని జరగలేదు.

ఇన్నివిధాల ఆశాభంగం కలిగినా కార్యసాధనకు కావలసిన ధీరత్వాన్ని మనవారు వదలలేదు. "మావల్ల కాదు"అని చెప్పడానికి

(1) Watt's Dictionary of the economic prooducts of India.

(2) Tro-pical agriculturist.

(3) A Description of the Palmyra palm of Ceylou

వీరంగీకరించలేదు. గ్రంథాలయోద్యమ గౌరవాన్ని యేతీరుననైనా కాపాడడానికే వీరు కంకణం కట్టుకొని శ్రమించుచూవుండిరి. ఇంతలో ఒకనాడు మదరాసు యూనివర్సిటీ గ్రంథాలయానికి బ్రిటిష్‌ఇండియా, సింహళములలోని తాళవృక్షజాతికిజెందిన చెట్లనుగురించిన గ్రంథమొకటి వచ్చింది. దీనిని చూడడంతోనే అచ్చటిసిబ్బందికి ఉత్సాహంకలిగింది. కాని బొంబాయిలో వృక్షశాస్త్రాచార్యులుగానున్న వారీగ్రంథాన్ని వ్రాసియుండుటచే దక్షిణాదిలోని మూరుమూల గ్రంథంవివరాలివ్వగలరా? అనేఅనుమానం వారి ఉత్సాహానికి కొంత భంగం కలిగించింది. ముందొకరు దీని నటునిటుత్రిప్పి కార్యంలేదనుకొనిరి. మరొకరుకూడ చూచి నిరాశతో దీనినిక్రిందబెట్టిరి. మూడవ వారు దీనిని తెరచేసరికి సరిగా ఆయన తెరచిన పుటలో 'తాళవిలాసము'పేరు చిన్న అక్షరాలలో మధ్యను కనుపించింది. ఈసంగతివిని ఆచూకీశాఖకు చెందిన గ్రంథాలయ సిబ్బందిమొత్తం ఆతురతతో మూగి దీనివివరాలను చదువసాగిరి.

గ్రంథకర్త చాల ప్రయాసతో 'తాళవిలాసము'ను కనుగొనగలిగితిననియు, తంజావూరు రాజ్యంలోని కుంభకోణం (దీనిపూర్వం పేరు మరొకరీతిగా నుండినది)వాస్తవ్యుడైన అరుణాచలం దీనిని రచించెననియు తెలిపినాడు. ఇంతటితో అతడూరకొనక 'తాళ విలాసము' ఇంగ్లీషు తర్జుమాను మొత్తంగా క్రింద నుదహరించినాడు. ఇది తొమ్మిదిపేజీల నాక్రమించియున్నది. అప్పుడు తామెంతోకాలం

నుండి వెదకుచుండినవిషయం లభించడంతో మదరాసు యూనివర్సిటీ గ్రంథాలయంలోని ఆచూకీ సిబ్బందికి కలిగినసంతోషం వర్ణనాతీతం.

వెంటనే యీ సువార్తను కెనడాలోని గ్రంథాలయం వారికి వీరందజేసినారు. Ethelbert Blatter's 'The Palms of British India and Ceylon' అనే గ్రంథం ౨౦౩వ పేజీలో 'తాళవిలాసం' వివరాలున్నవని వ్రాసినారు. తమవిధ్యుక్తాన్ని నెరవేర్చ గలిగినందుకు తమ్ముతా మభినందించుకొన్నారు.

లోకసేవకు గ్రంథాలయ మెట్లు తోడ్పడుతుందో నిరూపించినారు. ఈరకమైనసేవ నేటిగ్రంథాలయాలలో ప్రధానమైనదిగా ఎంచబడుచున్నది. దీనిని గ్రంథాలయ పరిభాషలో 'ఆచూకీసేవ' అంటారు. ఈపనికొరకు ప్రత్యేకసిబ్బందిని ప్రతి గ్రంథాలయం వారూ నియమిస్తారు. చదువరుల సందేహాలను తీర్చడం, వారికోరికలను తెలుసుకొని పూర్తిచేయడం, గ్రంథాలయంలోని పుస్తకాలతోనూ సంఘంలోని వ్యక్తులతోను బాగా పరిచయాన్ని సంపాదించి సరియైన సమయంలో తగిన పుస్తకాన్ని యోగ్యుడైన చదువరికందజేయడం, ముందుచూపుతో చదువరులుకోరే రకరకాల భోగట్టాను సేకరించి దీనినంతటినీ రికార్డుచేయడం, ఈరికార్డులోని విషయాలను అడిగిన వారికి నిమిషాలమీద అందించడం, చదువరులలోని బెదరుపోతులు, గర్వపోతులు – శ్రద్ధాపరులు, లక్ష్యంలేనివారు – పరిచయులు, క్రొత్తవారు – ప్రవీణులు, ప్రాథమికులు – వయోవృద్ధులు, లేతవయస్కులు మున్నగుగాగల వారిని కనిపెట్టి, వారివారి అంతరువుల కనుగుణంగా వారితో ప్రవర్తిస్తూ, వారు పుస్తకాలను హెచ్చుగా చదివేటట్లు, గ్రంథాలయానికి తరచుగా వచ్చేటట్లు ప్రోత్సహించడం ఆచూకీ భాండాగారుల విధియైయున్నది. ఈవిధిని ఎవరెంతబాగుగ నిర్వ

హించిన గ్రంథాలయమంత యెక్కువగ ప్రజాసేవ చేసినట్లగును. నేటి గ్రంథాలయ కార్యక్రమంలో ఆచూకీసేవ ముఖ్యమైనదిగ యెంచబడుతూవుంది. ఈవిషయమై మన గ్రంథాలయాలు శ్రద్ధవహించి కృషిసల్పవలసిన అవసరమెంతైనా వున్నది. అప్పుడే మన గ్రంథాలయాలు ప్రజలకెక్కువగా ఉపకరించగలవు. పాఠకులను బాగుగా ఆకర్షించగలవు. దీని ప్రాముఖ్యతనుగూర్చి మనం చేసే వేయిప్రసంగాలకంటె ప్రజోపయోగకరమైన పైనసూచించినట్టి పది కార్యాలు ప్రజలలో వీనివ్యాప్తికి హెచ్చుగా తోడుపడగలవు.

# గ్రంథాలయ మహాసభలు

ఇంగ్లీషులో 'కాన్ఫరెన్స్' అనే పదానికి బదులుగా 'మహాసభ' వాడుకలోకివచ్చింది. 'కన్ ఫర్' అనుక్రియనుండి కాన్ఫరెన్స పుట్టింది. 'కన్ ఫర్' అనగా సంభాషించు, కూడియాలోచించు అని అర్థం. పదిమందిచేరి యొక ప్రస్తావనకు పూనడంద్వారా యీకార్యక్రమాన్ని 'కాన్ఫరెన్స్' అన్నారు. మన ప్రాచీనులు దీనికి 'గోష్ఠి' యని నామకరణం చేశారు. ఈగోష్ఠినే ఆధునికులు సభయంటున్నారు. విస్తీర్ణమూ, ప్రాతినిధ్యమూ పెరగడంతో సభ మహాసభయైనది. గ్రంథాలయాల సంబంధంగా అనేక తావులలో పనిచేసే పలువురు కార్యకర్తలొకచోటజేరి గ్రంథాలయ సంబంధమైన విషయాలను విమర్శచేసేటందుకు జరిగే సమావేశాలను మనము 'గ్రంథాలయమహాసభ' లని వ్యవహరిస్తున్నాం.

మహాసభల సాధారణ ప్రయోజనాలు మూడు. ఇందు మొదటిది ప్రచారం. సార్వజనికమైన తక్కినఉద్యమాలకు వలెనే గ్రంథాలయోద్యమానికికూడ ప్రచారం ప్రధానమైనది. విజ్ఞానవేత్తలూ, గ్రంథాలయాభిమానులూనైన పెద్దలనాహ్వానించి ఉపన్యాసాల నిప్పించడంద్వారా ప్రజలలో చక్కని ప్రబోధం జరుగుతుంది. వీరి ఉపన్యాసా లెక్కువగ పుస్తకాల ఉపయోగాన్నిగూర్చి గ్రంథాలయాల ప్రయోజనాలనుగూర్చి తెలపడమేగాక, ప్రాచీనగ్రంథాలయాల ప్రాభవాన్నీ, ఆధునిక గ్రంథాలయాల విశిష్టతనూ, దేశదేశాలలోని గ్రంథాలయోద్యమ వికాసాన్నీ పెక్కురీతులుగా ఉగ్గడిస్తాయి. ఉపన్యాసాల విషయంలో అంతగా భేదం కనబడకపోయినా వీటిని చెప్పడంలో ఒక్కొక్కరు చూపే ప్రతిభ, నేర్పు, వాగ్ధోరణి, భావప్రకటనమూ మొదలైనవాని

మూలంగా సభికులలో ఉత్సాహంపుట్టి వీరిమనస్సులు గ్రంథాలయాల వైపుకు ఆకర్షింపబడడం సహజం. కొందరు మహనీయుల దర్శనం కూడ ప్రజలకు త్తేజకరమౌతుంది. సాధారణంగా సంఘంలో పలుకుబడిగల పెద్దలు మహాసభల కధ్యక్షత వహిస్తారు. కాబట్టి వీరుచెప్పే మాటలకు ప్రభుత్వాలు సహితం విలువనిస్తాయి. ఇందుమూలంగా ఉద్యమాభివృద్ధికి కొంత దోహదంకూడ లభిస్తుంది. ప్రతిభావంతులైన పెద్దల ఆధ్వర్యాన నడిచే మహాసభల వృత్తాంతాలు పత్రికలకెక్కడంద్వారా స్వయంగా హాజరుకాని అనేకులలో వీటి విషయం ప్రచారమౌతుంది. ఉద్యమాభివృద్ధికిగల ఆటంకాలను తెలిపి, వీటిని దాటడాని కుపాయాలను చెప్పి, ఉద్యమనిర్వాహకులు శీఘ్రగమనంతో తమ ఆదర్శాన్ని సాధించడానికి మార్గాలను నిర్ణయించి చెప్పవలసిన బాధ్యత మహాసభాధ్యక్షులపై వుంటుంది. కాబట్టి వీరినెన్నుకోవడంలో మహాసభల నిర్వాహకులు మిక్కిలి జాగరూకులై యుండాలి.

అనేకతావుల్లో భిన్నభిన్న పరిస్థితులలో గ్రంథాలయాలను నడిపే నిర్వాహకులు ఒకచోట సమావేశం కావడంద్వారా గ్రంథాలయ సేవకులలో పరస్పర పరిచయమూ సుహృద్భావమూ పెంపొందడాని కవకాశముంటుంది. అయితే ఈసమావేశాలలో సాంఘిక రాజకీయాది భిన్నాభిప్రాయాలకూ, వ్యక్తిగతప్రయోజనాల సాధనకూ తావుండకూడదు. కేవలం విద్యావ్యాప్తికి సంబంధించిన సమస్యగా దీనిని చూచుకొని సంఘశ్రేయస్సును ప్రధానంగా పెట్టుకొని ప్రతినిధులు మెలగడం ధర్మం. సభాకార్యక్రమాన్ని మొదటినుండి తుదివరకు శ్రద్ధతో తిలకిస్తూ, సోదరసేవకుల అనుభవాలను తమ అనుభవాలతో సరిచూచుకొంటూ, భేదములుపొడసూపినప్పుడు వీటిని సమన్వయం చేసుకొంటూ వుండడం వీరివిధి. చర్చలలో నేవైన పొరపాట్లు దొర్లినపుడు అధ్యక్షుడు గట్టివాడైన వాటిని చాకచక్యంగా సమర్థించగలడు.

చాలమందిదృష్టిలో గ్రంథాలయనిర్వహణం మిక్కిలి సులభమైనపని. కనుక యేమాత్రం చదువుకొన్నవాడైనా యీపనిని చక్కగా నెరవేర్చగలడని వీరనుకుంటారు. అయితే అనుభవం దీనికి వ్యతిరేకంగావుంది. గ్రంథాలయ నిర్వహణంకూడా తక్కినపనులతోపాటు కష్టసాధ్యమైన దన్నవిషయం మన యుద్యమసంబంధంగల వారింకా గ్రహించలేదు. ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం చాలాకాలంనుండి ప్రచారంలో నున్నప్పటికిన్నీ యిప్పటికి మన దేశంలో ఆదర్శంగానడిచే గ్రంథాలయమొక్కటికూడ కనబడక పోవడానికి కారణమిదే. గ్రంథాలయనిర్వహణాన్ని ఒక కళగా ఆరాధించి, దీనికి ప్రత్యేకశాస్త్రాన్ని సృష్టించి, ఈశాస్త్రాన్ని ఆచరణలోనికి తెచ్చి అమెరికాదేశం 'గ్రంథాలయభూమి'గ ప్రసిద్ధికెక్కినది. పుస్తకా లెక్కువగా వుంటేనూ భవనాలు విశాలమైనవిగా వుంటేనూ గ్రంథాలయాలను గొప్పగా మనవెంచుకుంటాము. అమెరికాదేశపు గ్రంథభాండాగారి యొకడు "ఒక బల్లపై నొక చిన్న పుస్తకమునూ, దీనిప్రక్కను గ్రంథపాలకుడూ ఉంటే అది నిర్దుష్టమైన గ్రంథాలయ మవుతుంది" అని చెప్పినాడు. ఈమాట గ్రంథాలయ నిర్వహణంలో గ్రంథపాలకుని ప్రాముఖ్యాన్ని యెలుగెత్తి చాటుతూవుంది. నామమాత్రపు భాండాగారులు నడిపే గ్రంథాలయాలు చాలవరకు నిర్జీవములుగానుండి ప్రజలకంతగా ఉపయోగపడడం లేదన్నవిషయం అందరూ యెరిగిందే.

గ్రంథభాండాగారి విద్యావినయ సంపన్నుడు, గ్రంథాలయ శాస్త్రవేత్త, నిర్వహణానుభవమూ సేవాసక్తీ కలవాడుగా వుండాలి. ౧౯ వ శతాబ్దపు ప్రసిద్ధభాండాగారి రిచర్డుగార్నెటు మరణశాసనం మీాద వ్రాసిన పద్య తాత్పర్యాన్ని చూడండి. "అనేక విషయాలను గూర్చి యితరులందరికంటె యితడెక్కువ తెలిసినవాడు. సూర్యుని వెలుతురు పోకేపర్యంతమూ వున్న విజ్ఞాన మంతటిపైనా యితని

కెక్కువ మక్కువవుండేది. జ్ఞానపిపాసులైన వారందరినీ యితడు తన సోదరులుగా భావించేవాడు."

కేవల విద్యావంతుడు గ్రంథాలయాన్ని చక్కగా నడుపగల డనుకోడానికి వీలులేదు. గ్రంథవరణం, కొనుగోలు, పత్రికలపని, ప్రవేశ పట్టీల వ్రాత, గ్రంథ వర్గీకరణమూ, జాబితాలను సిద్ధపరచడమూ, గ్రంథప్రచారసాధనాల అవలంబనా, ఆచూకీపని, వాఙ్మయ సూచికల తయ్యారీ-సేకరణలు, బీరువాల అమర్పూ, అట్టకట్టు విధానమూ మొదలైన నిత్య నిర్వహణానికి సంబంధించిన సమస్యల పరిజ్ఞానంలేక నేటి గ్రంథభాండాగారి బ్రతుకు తెల్లవారడంకష్టం. పైన చెప్పిన విషయాలలో పరిశ్రమకు పూనేదానికిముందు ఒక్కొక్క విషయంలో అంతకుముందు జరిగిన కృషినిగురించి తెలుసుకోవడ మవసరం. లేకుంటే ప్రతియొక్కరూ తప్పులుచేసి దిద్దుకోవడంతో వారి కాలమూ, శక్తియుక్తులూ చాలా వ్యర్థమవుతాయి. ఎందరో అనుభవశాలురు చాలా సంవత్సరాలు పాటుబడి సంపాదించిన జ్ఞానం మనకొరకు క్రోడీకరింపబడి సిద్ధంగావుంది. దీనినే గ్రంథాలయ పాఠశాలలు మనకు నేర్పుతూ వున్నవి. దీనిని గ్రహించినతర్వాత పనికి పూనుకునేవారి గ్రంథాలయసేవ చక్కని ఫలితాలను ప్రసాదించ గలుగుతుంది. తాము నేర్చిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టి, వీటి ఫలితాలను జాగ్రత్తగా పరిశీలించి, తమ అనుభవాలను తోడిగ్రంథాలయ సేవకులకు తెలుపుతూ, వారి అనుభవాలను తాము తెలుసుకొంటూ గ్రంథభాండాగారులు తమపనిని దక్షతతో సాగించవచ్చు. ఈ పరస్పర అనుభవపరిశీలనకు గ్రంథాలయ మహాసభలు మంచి సాధనాలు.

ఈపరిశీలనకార్యాన్ని ఉత్తరప్రత్యుత్తరాలద్వారానూ, పత్రికాప్రకటన ద్వారానూ సాగించవచ్చు. కాని విషయం తెలిసినవారొకచోట చేరి ముఖాముఖిని సమస్యలను చర్చించి నిర్ణయాలు

చేయడం మంచిది. ఇది సులువైనవిధానంకూడ. కనుకనే కొంత కాలంగా ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల నిర్వహణంలో క్రొత్త మార్పొకటి ప్రవేశపెట్టడం జరిగింది.

ప్రచారసాధనాలలో మిక్కిలి విలువగల ప్రదర్శనంతోపాటు మహాసభ కంగములుగా మూడుశాఖాసమావేశముల నేర్పాటుచేసి ఆయావిషయాలలో ప్రవీణులైనవారిని వీటికధ్యక్షులుగా ఎన్నుకొని ప్రతిసమావేశంలోను ఆయావిషయాలకు సంబంధించిన వ్యాసాలను- సిద్ధాంతానుభవముల ప్రతిపాదించువానిని - చదివించి చర్చచేయుటకు నిర్ణయాలు జరిగినవి. వాగ్రూపమైన ఉపన్యాసాలు కాలక్షేపాలుగ మారడమూ, వ్రాతపూర్వకమైన వ్యాసాలు విషయసమన్వితాలై మహాసభల సంచికల ప్రకటనముద్వారా సభలకు హాజరు కాజాలని వారికికూడా ఉపకరించడమూ గమనించి, ప్రతియొక్కరూ తాముపన్యసింపదలచినవిషయాలను వ్రాసి ఆయాశాఖాసమావేశాలలో చదివే టట్లు నిర్ణయం జరిగింది. ఈశాఖాసమావేశాల ఆశయాలనుగురించి నాడు మదరాసు యూనివర్సిటీ గ్రంథాలయ భాండాగారి*గా వున్న రావుసాహెబ్ (ప్రస్తుతం డాక్టరు)యస్. ఆర్. రంగనాథన్ ఎం. ఏ., ఎల్. టి., ఎఫ్. ఎల్. ఏ. గారు ౨౩ వ ఆంధ్రదేశ గ్రథాలయ మహాసభకు పంపిన సందేశములో యిట్లు వివరించారు.

“౧. ప్రచారశాఖ: ఇది ప్రజాసామాన్యం దృష్టిని గ్రంథాలయాలవైపుకు మరల్చడానికై యేర్పడినట్లెంచుచున్నాను. ఈశాఖలో మీరు గ్రంథములయు గ్రంథాలయములయు ప్రయోజనాలను వివరించే ఉపన్యాసాల నేర్పాటు చేస్తారని విశ్వసిస్తున్నాను. ప్రతిపౌరుడికీ అందుబాటులో వుండేలాగు ధర్మగ్రంథాలయాలనూ, గ్రంథప్రచారకేంద్రాలనూ విరివిగాస్థాపించి నిర్వహించవలసిన విధి స్థానిక సంస్థలపైవుంది. కాబట్టి మనసభ్యులందరికీ ఈశాఖయొక్క సందేశం చెవుల బడుతుం దని ఆశిస్తున్నాను.

---

* ప్రస్తుతం ఢిల్లీ విశ్వవిద్యాలయంలో గ్రంథాలయ శాస్త్రాచార్యులు, ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ అధ్యక్షులు.

౨. నిర్వహణశాఖ *: యిది కేవలం గ్రంథభాండాగారులను సంబంధించినది. కాబట్టి భాండాగారుల అన్నివిధములను సంబంధించిన సంగతులనూ యీశాఖమూలకంలో చర్చించవచ్చు. ఈశాఖవిషయమై జరుగదగినపని చాలావుంది. వీటిలోనన్ని గ్రంథాలయాలు చేపట్టదగిన వర్గీకరణపద్ధతి మన సమస్యలలో మొదటిది. వర్గీకరణ మనేది ప్రత్యేకశిక్షణను పొంది శ్రమచేసే స్వభావమూ, విమర్శనాబుద్ధీ కలవారికి మాత్రమే సాధ్యమైనదిగా యేర్పడింది.

పుస్తకాల జాబితా నిబంధనలు (Catalogue code) మరొకసమస్య. ఈవిషయంలోకూడా యీశాఖ చేయదగిన పని చాలావుంది.

భారతీయవిజ్ఞానవిషయాలపై పుస్తకాల జాబితాలు, రిఫరెన్సు పుస్తకాలు మరొకటి. వీటినితయారుచేయడానికి దేశస్థాంప్రదాయాలను గుర్తెరిగిన భారతీయులు మాత్రమే పనికివస్తారు. 'అమెరికన్ గ్రంథాలయ, వాఙ్మయసూచికలయు వాఙ్మయ సూచిక'(Bibliography of reference books and bibliographies) అనే పుస్తకంద్వారా యీవిషయంలో నాకృషి ప్రారంభమయింది. మనం చేయవలసిన మహాకార్యంలో ఇది అణుమాత్ర ప్రయత్నమే.

3. ప్రయోజన విద్యాశాఖ: ప్రయోజనవిద్యాశాఖ కార్యక్రమం తక్కువ ప్రయోజకరమైనదిగా వుండదు. ఎందుకంటే, బోధకులనుమాత్రమే గాక విద్యార్థులను సహితం సంపాదించడానికి, ప్రయోజనులను పుస్తకాలవైపుకు ఆకర్షించడంతోపాటు వారి కవసరమైన గ్రంథాలను తయారుచేయడానికీ, స్థానిక సంస్థల కీవిషయంలో అభిరుచిని కల్పించడమేగాక, యేలాటి ప్రయత్నమైనా నష్టంగానీ కలుగని పద్ధతితో ప్రభుత్వ సంబంధం కలవీ, ఇతరమైనవీ-అన్ని యేజెన్సీల శక్తుత్సాహాలను కూడదీయడాని కనువైన మార్గాలను, సాధనాలను మీరన్వేషించవలసియుంటుంది."

పైన సూచించిన ప్రయోజనాలను సాధించడానికి మహాసభలకు గ్రంథాలయాలకార్యకర్తలధికసంఖ్యలో హాజరైతే, గ్రంథాలయాల అనుదినసమస్యల నచ్చట చర్చించడాని కనుకూలాలు యెక్కువగా వుండాలి. గ్రంథాలయాలన్నింటిలోనూ సుశిక్షితులైన భాండాగారు లేర్పడి వీరికి తమధర్మాన్ని సక్రమంగా పరిపాలించాలనే కుతూహలం అధికంగావుండాలి. దీనికితగిన వాతావరణాన్ని ఉద్యమ నిర్వా

---

* మొదట దీనికి సాంకేతిక శాఖయని పేరుపెట్టినాము. కనుక కేవలం సాంకేతిక సమస్యలకు సంబంధించిన ప్రస్తావనమాత్రం యిందులో వుంది.

హకులు సృష్టించారు. ఇంతకాలానికి వీరు నిరంతరాందోళన సాగించారు. ప్రభుత్వం సిఫారసులను పాటించి ఉద్యమాభివృద్ధికి చేయూతనివ్వాలి. ప్రజలుకూడ తమవిజ్ఞానానికి కారణభూతమైన ఉద్యమాలలో అగ్రస్థానము వహించే గ్రంథాలయోద్యమాభివృద్ధికి పూనుకోవాలి.

గ్రంథాలయ మహాసభలకు గ్రంథాలయ కార్యకర్తలతో పాటు జనసామాన్యంకూడ వచ్చేటట్లుచూడడం మహాసభల నిర్వాహకుల విధి. పత్రికాప్రకటనలు సకాలంలో వెలువడవు. అందరికీ యివి చేరవు. కనుక ఉద్దేశం ఉత్సాహం ఉన్నవారుకూడ సభలకు హాజరు కాలేకపోతుంటారు. కనుక యెచ్చటెచ్చట గ్రంథాలయాలున్నవో వాటియన్నింటి భోగట్టాను సేకరించి కనీసం పదిదినముల ముందుగనే అన్నింటికిని ప్రత్యేకముగా ఆహ్వానాలను పోస్టుద్వారా పంపవలసినది. దీనిమూలంగా కొంతసొమ్ము ఖర్చైనా నిర్వాహకులు వెనుకాడరాదు. ఇది మహాసభలను నడుపువారు చేయదగిన ముఖ్యవిధి. గ్రంథాలయాలతోపాటు మహాసభలుజరిగే రాష్ట్ర, జిల్లా, తాలూకా, నగర గ్రంథాలయసంఘాల కార్యకర్తలనూ, ఆయాప్రాంతాలలోని ప్రముఖులైన ఉద్యమాభిమానులనూ మహాసభలకాహ్వానించడమవసరం. మహాసభలుజరిగే చుట్టుముట్టు గ్రామాలలోని పెద్దలను ప్రత్యేకంగా ఆహ్వానిస్తూ జనసామాన్యానికంతటికీ సర్వసాధారణమైన ఆహ్వానాన్ని గోడ పత్రికలు, కరపత్రముల మూలకంగానూ, టముటముం ద్వారానూ, 'మెకాఫోను' * మూలంగానూ అందచేయాలి.

అందరినీ ఆహ్వానించడంతో తృప్తిపడి లాభంలేదు. మహాసభకు వచ్చేవారి నాకర్షించగలిగిన ఉపన్యాసాలకూ, ప్రదర్శన

---

* ఊరంతటికి వినిపించేటట్లు వార్తలు బిగ్గరగా చెప్పడానికి ఉపయోగించే లౌడ్‌స్పీకర్ గొట్టమువంటి పనిముట్టు.

విశేషాలకూ, వైజ్ఞానిక కార్యక్రమాలకూ కొంతసమయం, ధనంకూడా వెచ్చించాలి. నిర్వహణసమస్యలు భాండాగారులకు తప్ప రుచించవు. గ్రంథాలయసంబంధమైన ప్రదర్శనాలు గ్రంథాలయకార్యకర్తలతో పాటు ఇతరులకుకూడ కొందరికి ఉత్సాహాన్ని కల్పించినా, మహాజనాని కనుకూలించేటటువంటివీన్నీ, వారి నిత్యజీవితానికి సంబంధించినటువంటివీన్నీ వివిధవిషయాలకు సంబంధించిన ఆకర్షణీయమైన ప్రదర్శనాలను యేర్పరచడం ద్వారా వారికుపకరించే సంగతులను బోధపరచడానికి అవకాశాలను సమకూర్చడం జరుగుతుంది. గ్రంథాలయోద్యమాదర్శం వాయువు, నీరు, సూర్య చంద్రుల తేజస్సులలా జ్ఞానంకూడా సర్వజనులకూ సులభంగానూ, విధిగానూ అందుబాటులో వుండాలనేవిషయం ఆచరణకు వస్తుంది.

మహాసభలు జరపడం ఒకయెత్తు. వీని వివరాలనుపత్రికలలో విరివిగా ప్రకటించేలాగుచూడడం మరియొకయెత్తు. సభలకుముందూ తర్వాతకూడా సభావృత్తాంతాలు పత్రికలలో యెంత యెక్కువగా ప్రకటితమయితే అంతప్రయోజనముంటుంది. సభలకు రాజాలని అనేకులకు అచ్చట జరిగిన సమాచారాలు తెలుస్తాయి. ఇందుమూలంగా ప్రచారానికి మంచి దోహదం లభిస్తుంది. కనుక మహాసభలు జరిగినప్పుడల్లా వీటివృత్తాంతాలను వీలైనన్ని పత్రికలలోకి యెక్కించే ప్రయత్నం నిర్వాహకులు చేయాలి. తెలుగుపత్రికలతో పాటు ఇంగ్లీషుపత్రికలకూ, మహాసభ విస్తృతినిబట్టి ప్రాంత ప్రాంతాల పత్రికలకూ, ముఖ్యంగా గ్రంథాలయసంబంధంగా వెలువడే దేశంలోని అన్ని పత్రికలకూ, వాటివాటికిగల అవకాశాలనుబట్టి విపులంగానూ సంగ్రహంగానూ సభ పూర్తియవుతూనే వార్తలను పంపడం మహాసభల నిర్వాహకుల ధర్మం. ఈపని చక్కగాజరగడానికి సమరులైనవారిచేత సభ జరిగేసమయంలో రిపోర్టులు తయారుచేయించడమవసరం.

మహాసభలలో చేసే తీర్మానాల విషయంలోకూడ కొన్ని అసందర్భాలు జరగడం మామూలయింది. కాంగ్రెసువంటి పెద్దపెద్ద సంస్థల మహాసభలలో తీర్మానములపై పూర్తిచర్చలు జరిగినా, తక్కినవాటిలో కట్టకడపట యెవరోవొకరు లేచి తీర్మానాలను గడగడ చదివి ముగించడం జరుగుతూవుంది. ఒక్కొక్కప్పుడు తీర్మానాలలోని విషయాలుకొన్ని సభికులకు సరిగా తెలియనుకూడ తెలియవు. విషయనిర్ణయసభలలో పాల్గొనడానికి మహాసభప్రతినిధులందరికీ అవకాశముండదుగనుక మహాసభముగింపు సమావేశంలో ప్రవేశపెట్టే తీర్మానాల నన్నింటినీ చర్చజరిగినా జరగకపోయినా విపులీకరించడమవసరం. లేకుంటే యీతీర్మానాల కర్థముండదు. ఇంకొక విషయమేమంటే తీర్మానాలను సభముగిసినతర్వాత వీలైనంత త్వరలో అందజేయవలసిన వారికిపంపి తగుచర్య తీసుకోవడం తప్పనిసరిగాచేయాలి. ప్రభుత్వంవారికి పంపవలసినవానిని ఆయా శాఖలకున్నూ, వ్యక్తిగతంగా చేర్చవలసిన వానిని విడివిడిగానున్నూ తపాలాద్వారా అందజేసి సమాధానములనురాబట్టే ప్రయత్నాన్ని మహాసభలకు బాధ్యతవహించే సంఘాలు * చేయాలి. ప్రజాసామాన్యాన్ని ప్రబోధించే వుద్దేశంతో చేయబడ్డ తీర్మానాలను ప్రత్యేకమైన ప్రకటన (Statement)ల ద్వారా పత్రికల కెక్కించాలి. గ్రంథాలయాల నుద్దేశించిచేసేతీర్మానాలను విడివిడిగా గ్రంథాలయాలకు చేరేలాగు చూడగలిగితే చాలా ప్రయోజనముంటుంది. మహాసభలసంచికలలో యీతీర్మానాలను పూర్తిగా చేర్చినా యివి అందరికీ చేరవుగనుకనూ, వీటి ప్రకటన ఆలస్యంగా జరుగుతుందిగనుకనూ యీలోపలనే పైపనులను వెంటవెంటనే పూర్తిచేయడ మవసరం.

---

* ఆహ్వానసంఘములు మహాసభ యేర్పాటులవరకే బాధ్యతవహిస్తాయి. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున్నూ, జిల్లా, తాలూకా గ్రంథాలయ మహాసభలకు ఆయా జిల్లా, తాలూకా గ్రంథాలయసంఘములున్నూ పూర్తిబాధ్యత కలిగివుంటాయి.

# గ్రంథాలయవారం

గ్రంథాలయాలను స్థాపించడ మొకయెత్తు. ఇవి ప్రజలకు క్రమంగా ఉపయోగించేటట్లు చేయడ మొకయెత్తు.

ఏవో పుస్తకాలను, పత్రికలను ఒకచోటచేర్చి అడిగినవారికి ఉన్న గ్రంథాలనో, పత్రికలనో యిచ్చి పుచ్చుకోవడంతో గ్రంథాలయాలపని తీరినట్లెంచుకోవడం మనకు పరిపాటయింది. ఈఅభిప్రాయం చాల పొరపాటని నేటి మన గ్రంథాలయాల స్థితియే చెప్పక చెపుతూ వుంది. ప్రజల ఉపయోగాన్ని ఉద్దేశించి ప్రత్యేకంగా సేకరించిన గ్రంథాలను, పత్రికలను తరచు ప్రజలదృష్టికి తేవలసిన విధి గ్రంథాలయ కార్యకర్తలపైవుంది. ఈ కృషి నిరంతరాయంగా జరిగినప్పుడే ప్రజలు హెచ్చుగా గ్రంథాలయాలను ఉపయోగించడం సంభవిస్తుంది. అప్పుడే 'అధ్యయనంకొరకు పుస్తకాలు', 'అందరికీ పుస్తకాల'నే గ్రంథాలయ సూత్రాలు అక్షరాలా అమలుజరగడాని కవకాశ ముంటుంది.

గ్రంథాలయాల సంబంధంగా వీటి విషయమై ప్రజలలో ప్రచారంచేసే నిమిత్తం జరిగే కృషిని ఆంగ్లంలో 'పబ్లిసిటీ వర్క్' అంటారు. గ్రంథాలయోద్యమంలో ఉచ్చదశ నందుకొన్న అమెరికా వంటి దేశాలలో గ్రంథాలయ నిర్వహణంలో పబ్లిసిటీ కార్యక్రమాని కెంతో ప్రాముఖ్యత వుంది. దేశవ్యాప్తంగా గ్రంథాలయాల అభివృద్ధికై కృషిచేసే అమెరికాదేశ గ్రంథాలయ సంఘంవారు పబ్లిసిటీ పనికి ప్రత్యేకశాఖను నిర్వహిస్తున్నారు. ఏటేటా జరిగే గ్రంథాలయ వార్షికసభలలో యీ కార్యక్రమంలో ప్రవీణులైనవారితో 'పబ్లిసిటీ రౌండుటేబిల్' సమావేశాలను వీరు సాగిస్తున్నారు. దేశం మొత్తంపై



జరిగే యీ కార్యక్రమంతో అచ్చటి గ్రంథాలయ పబ్లిసిటీ కార్యం ఆగడంలేదు. న్యూయార్కు వంటి పెద్ద నగరాలలోని ముఖ్యగ్రంథాలయాలన్నీ పెద్దజీతాలపై ప్రత్యేకోద్యోగులను నియమించి వారి సలహాలతో పబ్లిసిటీ కార్యక్రమాలను నడుపుతూ వున్నవి.

## పబ్లిసిటీ ప్రయోజనాలు

ఇతర వ్యాపారరంగాలలో వలెనే గ్రంథాలయ కార్యక్రమంలో కూడ పబ్లిసిటీ చక్కని ఫలితాలను సమకూర్చగలగడం వలననే యీ కార్యక్రమాన్ని చేపట్టినచోట్ల గ్రంథాలయాలు ప్రజలకెంతో ఉపయోగిస్తూ వున్నవి. జనసామాన్యంలో గ్రంథాలయాల ఉపయోగాలను గూర్చిన విజ్ఞానమెంతో దీనిద్వారా ప్రచారమవుతూ వుంది. గ్రంథాలయాల ఉత్కృష్టత నీ ప్రచారం లోకానికంతా చాటుతూవుంది. దేశదేశాలలో గ్రంథాలయోద్యమ మెట్లభివృద్ధికరంగా సాగుతున్నదీ యీ కార్యక్రమంద్వారా ప్రజలకు బాగా తెలుస్తూ వుంది. గ్రంథాలయాలు హెచ్చు ఉపయోగంలో వుంటే వచ్చేప్రయోజనాలను, గ్రంథాలయాలు సరిగా ఉపయోగపడని కారణంచేత కలిగే నష్టాలను గురించి యీ కార్యక్రమం ప్రజలకు వివరిస్తూ వుంటుంది. లేని తావులలో గ్రంథాలయాలను పెట్టడానికీ, ఇవి సరిగా జరగనిచోట్ల వీటిని క్రమబద్ధం చేయడానికీ ప్రజల సహాయాన్ని సంపాదిస్తుంది. ఈ విధంగా దేశం మొత్తంపైన జరుగదగిన పని నీకార్యక్రమం తీరుస్తుంది. దీని బాధ్యతను గ్రంథాలయోద్యమ వ్యాప్తికొరకై కృషిసల్పే గ్రంథాలయ సంఘాలు వహిస్తాయి. దేశం మొత్తంపైన జాతీయ గ్రంథాలయ సంఘము, రాష్ట్రాలలో రాష్ట్రీయ గ్రంథాలయ సంఘాలు, తాలూకాలలో తాలూకా గ్రంథాలయ సంఘాలు, నగరాలలో నగరగ్రంథాలయ సంఘాలు ఉమ్మడిగా జరుగదగిన ప్రచారకార్యాన్ని సాగిస్తాయి. ఈఉమ్మడి కార్యక్రమాన్ని

జరిగే యీ కార్యక్రమంతో అచ్చటి గ్రంథాలయ పబ్లిసిటీ కార్యం ఆగడం లేదు. న్యూయార్కు వంటి పెద్ద నగరాలలోని ముఖ్య గ్రంథాలయాలన్నీ పెద్దజీతాలపై ప్రత్యేకోద్యోగులను నియమించి వారి సలహాలతో పబ్లిసిటీ కార్యక్రమాలను నడుపుతూ వున్నవి.

## పబ్లిసిటీ ప్రయోజనాలు

ఇతర వ్యాపారరంగాలలో వలెనే గ్రంథాలయ కార్యక్రమంలో కూడ పబ్లిసిటీ చక్కని ఫలితాలను సమకూర్చగలగడం వలననే యీ కార్యక్రమాన్ని చేపట్టినచోట్ల గ్రంథాలయాలు ప్రజలకెంతో ఉపయోగిస్తూ వున్నవి. జనసామాన్యంలో గ్రంథాలయాల ఉపయోగాలను గూర్చిన విజ్ఞానమెంతో దీనిద్వారా ప్రచారమవుతూ వుంది. గ్రంథాలయాల ఉత్కృష్టత నీ ప్రచారం లోకానికంతా చాటుతూవుంది. దేశదేశాలలో గ్రంథాలయోద్యమ మెట్లభివృద్ధికరంగా సాగుతున్నదీ యీ కార్యక్రమంద్వారా ప్రజలకు బాగా తెలుస్తూ వుంది. గ్రంథాలయాలు హెచ్చు ఉపయోగంలో వుంటే వచ్చేప్రయోజనాలను, గ్రంథాలయాలు సరిగా ఉపయోగపడని కారణంచేత కలిగే నష్టాలను గురించి యీ కార్యక్రమం ప్రజలకు వివరిస్తూ వుంటుంది. లేని తావులలో గ్రంథాలయాలను పెట్టడానికీ, ఇవి సరిగా జరగనిచోట్ల వీటిని క్రమబద్ధం చేయడానికీ ప్రజల సహాయాన్ని సంపాదిస్తుంది. ఈ విధంగా దేశం మొత్తంపైన జరుగదగిన పని నీకార్యక్రమం తీరుస్తుంది. దీని బాధ్యతను గ్రంథాలయోద్యమ వ్యాప్తికొరకై కృషిసల్పే గ్రంథాలయ సంఘాలు వహిస్తాయి. దేశం మొత్తంపైన జాతీయ గ్రంథాలయ సంఘము, రాష్ట్రాలలో రాష్ట్రీయ గ్రంథాలయ సంఘాలు, తాలూకాలలో తాలూకా గ్రంథాలయ సంఘాలు, నగరాలలో నగరగ్రంథాలయ సంఘాలు ఉమ్మడిగా జరుగదగిన ప్రచారకార్యాన్ని సాగిస్తాయి. ఈఉమ్మడి కార్యక్రమాన్ని

సర్వసాధారణ ప్రచారమని చెప్పవచ్చును. ఆంగ్లంలో దీనిని 'జనరల్ పబ్లిసిటీ' అంటారు. దీనిద్వారా ప్రజలలో గ్రంథాలయ సంబంధమైన మానసిక పరిణామ మొకటి కలుగుతుంది. ఊరూరా గ్రంథాలయా లుండాలనే విషయం వీరి మనసు కెక్కుతుంది. తద్వారా చాలచోట్ల గ్రంథాలయాలు బయలుదేరడం సంభవిస్తుంది.

దీనికి తరువాత జరుగదగిన పని మరికొంత వుంది. ఇది వ్యక్తి గత ప్రచారం. దీనిని ప్రతి గ్రంథాలయమూ అవలంబించాలి. ఇది ఎంత వ్యాప్తిలోవుంటే గ్రంథాలయ మంత ఉపయోగంలోకివస్తుంది. నిత్యనూతనాలైన శాస్త్రీయపద్ధతులతో దీనిని సాగించినానాడు గ్రంథాలయంలోని ప్రతి పుస్తకానికీ తన చదువరీ, సంఘంలోని ప్రతి వ్యక్తికీ తన గ్రంథమూ లభించి పుస్తకాలకూ పాఠకులకూ మధ్య ఉత్తమమైనట్టిన్నీ, ఉపయుక్తమైనట్టిన్నీ సంబంధం కుదురుతుంది. దీనిమూలంగా గ్రంథాలయం ఉనికి సార్థకమౌతుంది. వ్యక్తిగతంగా ఒక్కొక్క గ్రంథాలయమూ సాగించే ప్రచారం ద్వారా ఆగ్రంథా లయంలోని పుస్తకాలు వగైరా సాధనాలు ప్రజలకు వెల్లడికావడం, వారి కవసరమైన భోగట్టా లభించడం, ప్రజలలో గ్రంథాలయంపట్ల ఆదరాభిమానాలు పెరిగి తద్వారా గ్రంథాలయానికి ఆర్థికాది సహా యాలు లభించడం జరుగుతుంది.

## ప్రచార సాధనాలు

సర్వసాధారణ ప్రచారానికి సినీమాలు, రేడియోలు, పత్రి కలు, ఉపన్యాసాలు, ప్రదర్శనాలు హెచ్చుగా తోడ్పడతాయి. వీటికి తోడు మన ఆంధ్రదేశంలో జాతీయమైన కార్యక్రమం ఒకటి దానిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ స్థాపకులు శ్రీ అయ్యంకి వెంకటరమణ య్యగారు కనిపెట్టి ప్రచారంలోకి తెచ్చినారు. ఇదే గ్రంథాలయ యాత్ర. నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఒక దళం గ్రామాలవెంట

బయలుదేరి రోజుకు రెండూళ్ళలో గ్రంథాలయ ప్రచారం సాగిస్తూ గొప్ప ప్రబోధాన్ని ప్రజలలో చేయడానికీసాధనాన్ని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం అప్పుడప్పుడు ఉపయోగిస్తూ వచ్చింది. గ్రామాలలో గ్రంథాలయాల స్థాపనకూ, పునరుద్ధరణకూ, అభివృద్ధికీ యీ కార్యక్రమం బహుచక్కగా ఉపయోగపడుతుంది.

వ్యక్తిగతంగా ఒక్కొక్క గ్రంథాలయమూ సాగించే ప్రచారానికి గ్రంథపట్టికలు, సమాచార పత్రికలు, చిత్రపటాలున్న చిరుపొత్తాలు, కరపత్రాలు, గోడపత్రికలు (పోష్టర్లు), వార్షికోత్సవాలు, ప్రదర్శనశాలలు, గ్రంథాలయ సప్తాహాలు ముఖ్యమైన సాధనాలు.

## గ్రంథాలయవారం ఉపయోగాలు

సాధారణ ప్రచారంలో గ్రంథాలయ యాత్రవలెనే వ్యక్తిగత ప్రచారంలో గ్రంథాలయవారం హెచ్చు ప్రయోజనాన్ని కలిగిస్తుంది. వరుసగా వారందినాలు వివిధరకాల కార్యక్రమాన్ని యేర్పాటుచేసి ప్రజలలో పెద్దసందడిని చేసి ప్రబోధంతోపాటు విజ్ఞానాన్ని ప్రజలలో వ్యాపింపజేస్తూ వారి సానుభూతినీ, సహాయాన్నీ సంపాదికచడానికీ కార్యక్రమ మెంతో ఉపకరిస్తుంది. ప్రజానీకం దృష్టిని గ్రంథాలయం వైపుకు మరల్చడానికీ, గ్రంథపాఠకుల సంఖ్యను పెంచడానికీ, తేలిక పాఠు పుస్తకాలనుండి గట్టి పుస్తకాలవైపుకు, తక్కువరకం గ్రంథాల నుండి ఉత్తమ తరగతి గ్రంథాలవైపుకు వీరి దృష్టిని మరల్చడానికీ, కాలక్షేపపు చదువులనుండి ఉపయుక్త పఠనంవైపుకు వీరిని త్రిప్పడానికీ, ఉద్దేశరహితంగా సాగే చదువులను తమతమ ఉద్యమాలకూ వృత్తులకూ వుపకరించే చదువులుగ మార్చడానికీ అనుకూలమైనకార్య క్రమాన్ని యీ సందర్భంలో చేపట్టవలసిన అవసరమెంతో వుంది. ఈపని సవ్యంగా జరగాలంటే గ్రంథాలయంలోని వివిధ విషయాలను గూర్చిన ప్రముఖ గ్రంథాలలోని సంగతులను సమర్థులైనవారు ప్రజ

లకు తెలియజెప్పాలి. ఆయా గ్రంథాలను చదువుటద్వారా ప్రజలకు కలిగే ప్రయోజనాలను ఉపన్యాసకులువివరించాలి. గ్రంథాలయంలో నున్న పుస్తకాలలోని సంగతులనుగూర్చియే ఉపన్యాసాల ఏర్పాటు చేయడం పబ్లిసిటీకి యెక్కువ ప్రయోజనకారి. చదువులు నేర్వని ప్రజాసామాన్యంలో విజ్ఞాన ప్రచారానికి సాయపడే విషయాలకు కొంత స్థానమిచ్చినా, గ్రంథాలయంలోని ప్రతి పుస్తకాన్ని కనీస మొకరైనా ఉపయోగించుకొనేలాగు చేయడాని కనుకూలించే కార్య క్రమానికి ప్రాధాన్యత వుండేలాగు చూడాలి.

ఉపన్యాసాలతో ప్రజలలో ఉత్సాహాన్ని రేకెత్తించి వూరు కుంటే ప్రచార కార్యక్రమం ఫలించదు. 'మనవిధి మనంచేశాం. ఫలితం ప్రసక్తి మనకక్కరలేద'నే కర్మయోగ సిద్ధాంతాన్ని దీని కన్వయంచేయరాదు. ముం దెన్నడో కాక అప్పటికప్పుడే ప్రచారం యొక్క ఫలితం ప్రత్యక్షం కావాలి. లేకుంటే కార్యక్రమంలో యెక్కడో లోపమున్నట్లు గ్రహించి దీనిని తొలగించేప్రయత్నం చేయాలి.

## ప్రత్యక్ష కార్యక్రమం

గ్రంథాలయానికి కావలసిన పుస్తకాలను, పత్రికలను, బీరు వాలు వగైరాసామగ్రిని, ఇతర అవసరాలకు కావలసిన ధనాన్ని సేక రించడం, బాకీచందాలను వసూలుచేయడం, క్రొత్తచందాదారులను పాఠకులను చేర్పించడం, చాలాకాలంనుండి పాఠకులదగ్గర నిల్వ వుండి పోయిన పుస్తకాలనుగాని పోగొట్టినవాటి విలువలనుగాని వసూలు చేయడం, శిథిలమైన గ్రంథాల మరమ్మతుకు వాటికిబదులు నూతన గ్రంథాల సేకరణకు ఏర్పాటుచేయడం, గ్రామం లేక పట్టణంలోని అభిమానులను కలుసుకొని వారికి గ్రంథాలయావసరాలను వివరించి వారి సాయాన్ని కోరడం, అవసరమున్నచోట్ల భవననిర్మాణానికి,

పెంపుకు, మరమ్మతు వగైరాలకు కావలసిన ధనాన్ని సేకరించడానికి ప్రయత్నించడం గ్రంథాలయ వారోత్సవ సమయంలో చేపట్టదగిన పనులు. గ్రంథాలయ నిర్వహణంలో గల లోపాలను సరిదిద్దుకొని, నిత్యవిధులు నిర్విఘ్నంగా కొనసాగడానికి కావలసిన అవసరాలను గుర్తువ్రాసుకొని, చేపట్టదగిన నూతన కార్యక్రమాలను నిర్ణయించుకొని, యీయన్నింటికీ కావలసిన సాధనాలను సంపాదించే ప్రయత్నం కూడ యీసందర్భంలో చేయదగినదే.

కార్యకర్తలలో తమ గ్రంథాలయం ఆదర్శంగా పనిచేయాలనే తహతహ ఉన్నప్పుడు గ్రంథాలయవారం ప్రయోజనకారిగా పరిణమించడానికి ఆలోచనలు పుట్టుకవస్తాయి. దేశదేశాలలో జరుగుతూవున్న ప్రచారపద్ధతులను తెలుసుకొంటూ, యిందులో మన కనుకూలించే వాటిని గ్రహించి మన పరిస్థితుల కనుగుణమైన కార్యక్రమాలను మనం ఏర్పాటు చేసుకోవచ్చు.

ఉపన్యాసాలు, ప్రదర్శనాలు, విజ్ఞానగోష్ఠులు, రకరకాల వినోద కార్యక్రమాలు, గ్రంథాలయాలు ప్రజల కాలక్షేపానికీ, సమాచార సేకరణకూ, ప్రబోధానికీ ఉపకరిస్తాయని ఆచరణపూర్వకంగా ఋజువు చేస్తాయి. ఈవివిధ కార్యక్రమాలనన్నింటినీ గ్రంథాలయ వారం సందర్భంలో అనుకూలాన్ని బట్టి అనుసరించవచ్చు.

# గ్రంథాలయ వార్షికోత్సవాలు

గ్రంథాలయ నిర్వహణంలో పబ్లిసిటీ ఒక ప్రధానాంగం. ప్రజానీకానికి గ్రంథాలయప్రయోజనాన్నీ, ఒక్కొక్క గ్రంథాలయంలో గల అవకాశాలను తెలపడమే పబ్లిసిటీముఖ్యోద్దేశం. ఈగ్రంథాలయంలో పుస్తకాలువగైరా సాధనాలేమేమి యున్నవో, ప్రజలఅవసరాలనూ, కోరికలనూ తీర్చడానికి గ్రంథాలయ మెంతవర కుపకరిస్తుందో పబ్లిసిటీద్వారా వెల్లడియౌతుంది. చాలాగ్రంథాలయాలలోని పుస్తకాలు నిరుపయోగంగా వుండడంగానీ, వాటిలో కొన్నిమాత్రమే ఉపయోగింపబడడంగానీ జరుగుతున్నదంటే దీనికి కారణం సరియైనప్రచారం - గ్రంథాలయ పరిస్థితులను జనసామాన్యానికి తరచువెల్లడిచేసే పబ్లిసిటీవిధానం- అమలులో లేకపోవడమే.

గ్రంథాలయ నిర్వహణం వ్యాపారంవంటిది. వర్తకుడు తన సరుకులు బాగాఅమ్మకం కావడానికి తీసుకొనే ప్రతిచర్యా గ్రంథభాండాగారి తనపుస్తకా లెక్కువగా ప్రచారం కావడం నిమిత్తం అవలంబించదగి యుంటుంది. పబ్లిసిటీ విధానాన్ని అమలుపరచడం ద్వారా గ్రంథాలయ నిర్వాహకులు తమవద్దగల సాధనాలను వెల్లడించడం, ప్రజల కవసరమైన భోగట్టా నందజేయడం, తమ కార్యక్రమానికి జనుల ఆమోదాన్ని పొందడం, తద్వారా వారిసహాయ సానుభూతులను రాబట్టడం జరుగుతుంది.

పబ్లిసిటీ కార్యక్రమం రకరకాలుగా వుంటుంది. సినీమాలు, రేడియోలు, పత్రికలు, ఉపన్యాసాలు, ప్రదర్శనాలమూలంగా పెద్దపెట్టున జరిగే సర్వసామాన్యమైన (జనరల్) ప్రచారపద్ధతి మొత్తంపైన గ్రంథాలయాల ఉపయోగాలనుగూర్చి ప్రబోధంచేస్తే, ఒక్కొక్క

గ్రంథాలయం గ్రంథపట్టికలు, సమాచారపత్రికలు, చిత్రపటాలున్న చిరుపొత్తములు, కరపత్రములు, గోడలపై అంటించే పెదపెద పోస్టరు మొదలైనవాటిని ప్రకటించడంద్వారా దాని ప్రయోజనాన్ని అధికతరం చేయడాని కుపకరిస్తున్నవి. వీటితోపాటు గ్రంథాలయ వార్షికోత్సవాలు, ప్రేక్షకనిశలు, గ్రంథసప్తాహాలు, గ్రంథాలయం లోపలా బయటా జరిగే రకరకాల ప్రదర్శనాలు ప్రజలను గ్రంథాలయాల కాకర్షించడానికి చాలా తోడ్పడతాయి. కాని యీ అన్ని విధానాలను సమర్థతతో నిర్వహించడానికి తగిన యోగ్యతనిర్వాహకులలో వుంటేనేతప్ప యివి సరియైన ప్రయోజనాన్ని ప్రసాదించలేవు.

## వార్షికోత్సవాల ప్రయోజనం

గ్రంథాలయ వార్షికోత్సవాలు పలురకాలైన పబ్లిసిటీకార్యక్రమంలో చేరి యుండడంమాత్రమే గాక, ఒక విధంగా తక్కిన కార్యక్రమాలన్నిటికన్న వీటికి అధికమైన విలువ యుంటుందనే విషయం గ్రహించడ మవసరం. కారణం సంవత్సరం పొడుగునా జరిగిన విషయాలను సర్వజనులకూ తెలిపి, కార్యనిర్వహణంలో జరిగిన లోపాలోపాలను వివరించి, గ్రంథాలయం సాధించిన పనులు ఇంకా మిగిలియున్న విధులను ప్రజలదృష్టికి తెచ్చి, గ్రంథాలయావసరాలను తీర్చడానికి వారేమిచేయాలో వెల్లడిచేయడం సంభవిస్తుంది. మధ్యమధ్య జరిగే తక్కిన కార్యక్రమాలను చాలమంది గమనించకపోవచ్చు. కాని వార్షికోత్సవం ఉత్సాహంగా జరిగేటప్పుడు గ్రామాలలో గాని, పట్టణాలలోగాని చాలామందికి తెలుస్తుంది. కాబట్టి అధికసంఖ్యాకులైన జనం దీనిలో పాల్గొనడానికి వీలుంటుంది. ఉత్సాహంగాసాగే యీఉత్సవసమయంలో ప్రజలకు గ్రంథాలయాన్ని బాగా పరిచయం చేయవచ్చు. తద్వారా ప్రజల సహాయ సానుభూతుల నధికంగా సంపాదించడానికి అవకాశ మేర్పడుతుంది.

# కార్యక్రమం

ఒక్కొక్క గ్రంథాలయం స్థితినిబట్టి వార్షికోత్సవాన్ని జరుప వలసివుంటుంది. డంబాచారంగా కార్యక్రమం సాగించి ధనం హెచ్చుగా ఖర్చుపెట్టి పనిని పూర్తిచేసే విధానం ప్రయోజన రహితంగా పరిణమించడం చూస్తున్నాం. ఉన్నవసతిలో పైన తెలిపిన ఉద్దేశం నెరవేరడానికిగల అవకాశాన్ని చక్కగా వుపయోగించుకోవడం గ్రంథాలయ నిర్వాహకుల విధి.

ఉపన్యాసాలు, వేడుకలు, పబ్లిసిటీ పోస్టర్లు, వీటన్నింటినీ మించి సాంవత్సరిక నివేదికల ప్రచురణ వార్షికోత్సవ కార్యక్రమంలో ముఖ్యమైన అంశాలు. ఇటీవల కొన్ని గ్రంథాలయాలవారు కార్యక్రమ నిర్వహణానికి ప్రత్యేకంగా ఆహ్వానసంఘాల యేర్పాటునుకూడ ప్రారంభంచేశారు. స్థానిక పరిస్థితులనుబట్టి గ్రంథాలయ నిర్వహణంతో అధికంగా సంబంధంలేనివారిపై బాధ్యతపెట్టి ఉత్సాహంగా పని చేయించడాని కీపద్ధతి ప్రయోజనకారిగా వుంటుంది. తక్కినచోట్ల పాలకవర్గాలే సహజంగా వార్షికోత్సవాలను జరిపే బాధ్యతను వహిస్తాయి.

అధ్యక్షనిర్ణయం సాధారణంగా ముందేజరుగుతుంది. ఈ స్థానానికి సమర్థులైనవారిని, స్థానిక ప్రజలలో ఉత్సాహం రేకెత్తించగలవారిని, వీలైనంతవరకు గ్రంథాలయోద్యమంతో ప్రత్యక్ష సంబంధమున్నవారిని, చక్కగా ఉపన్యాసం చెప్పగలవారిని యెంచుకోవడం మంచిది. ఉపన్యాసకులనుకూడ అప్పటప్పటికి తయారుచేయడంకంటే ముందే వీరిని నిర్ణయించుకొని వీరు చెప్ప వలసిన విషయాలనుకూడ తెలపడ మవసరం. స్వల్ప సమయంలో పలువుర ఉపన్యాసాల నేర్పాటుచేయడం, వీరొకరినొకరు విమర్శించు కొనడాని కవకాశ మివ్వడంమూలంగా వార్షికోత్సవాల ప్రధానో

దేశానికే భంగం కలుగుతుంది. ఉపన్యాసకు లెంతసేపు యేమి చెప్పినా శ్రోతలను పుస్తకాలవైపుకు త్రిప్పే ప్రయత్నం చేయాలి. గ్రంథాలయ ప్రయోజనాలను వారికి నచ్చజెప్పి తరచు వారు గ్రంథాలయాలకు వచ్చేలాగు ప్రోత్సహించాలి. గ్రంథాలయాన్ని ఉపయోగించుకొనేవారిలో ఉపయుక్త పఠనం వృద్ధికావడానికి దోహదం చేయాలి. గ్రంథాలయ నిర్వహణానికి ప్రతియొక్కరూ సాయపడేటట్లు ప్రబోధించాలి. సందర్భానుసారంగా వైజ్ఞానిక విషయాల ప్రసక్తి తెచ్చినా మొత్తంపైన పైనతెలిపిన సూచనలను గమనిస్తూ ఉపన్యాసకులు తమ ప్రసంగాలను సాగించాలి. ఈ సమయంలో ఇంతకు మించిపోతే అది అధిక ప్రసంగంగా పరిణమిస్తుంది. చాలా వార్షికోత్సవాలలో సందర్భశుద్ధి లేకుండానూ, గడబిడగానూ జరిగే ఉపన్యాసాలమూలకంగా వార్షికోత్సవాల మూలసిద్ధాంతానికి భంగం కలగడం మనం చూడవచ్చు. అధ్యక్షోపన్యాసంతప్ప తక్కిన ప్రసంగాలు సుదీర్ఘంగా వుండరాదు. ఉపన్యాసకులుకూడ యిద్దరు ముగ్గురికంటె అధిక ముండడం బాగుండదు. ఉపన్యాసాల మధ్య శ్రోతల కుల్లాసంగావుండేటందుకు చక్కగా పాడగలవారిచేత మంచి పద్యాలు, పాటలు వగైరాలు పాడించడం మంచిది. ఇవికూడ గ్రంథాలయాలకు సంబధించినవిగావుంటే ప్రయోజన ముంటుంది. ఊరి పిల్లలతో యేవైనా చిన్న చిన్న నాటికలను, ఇతర వైజ్ఞానిక కార్యక్రమాలను యేర్పాటు చేయడంమూలంగా గ్రామంలో ఉత్సాహం బయలుదేరుతుంది. గ్రంథాలయ పక్షాన వ్యాయామ సంబంధంగానూ, విద్యావిషయకంగానూ పోటీల నేర్పరచి గెలిచిన వారికి ఈసమయంలో బహుమతులను పంచడం మంచిపద్ధతి. అనుకూలాన్నిబట్టి స్థానికంగావున్న కవులు, పండితులు, శిల్పులు మొదలైన ప్రజ్ఞావంతుల సన్మానానికికూడ యిది చక్కని అదను. గ్రంథాలయంలోని పుస్తకాలనేరి ఒక చిన్న ప్రదర్శనాన్ని యేర్పరచడం

ద్వారా వార్షికోత్సవానికి వచ్చేవారిని వాటివైపుకు త్రిప్పవచ్చు. గ్రంథాలయ సంబంధమైన ప్రబోధవాక్యాలను సభాప్రాంగణంలో అచ్చటచ్చట వ్రేలాడగట్టడం చేయదగిన పనులలో మరొకటి. సభకు ముందు వూరిలోని బాలబాలికలు గ్రంథాలయగీతాలు పాడుకొంటూ, నినాదాలిస్తూ వూరంతా తిరిగిరావడంద్వారా గ్రామస్థులకు చక్కని హెచ్చరిక జరుగుతుంది.

ప్రార్థనతో సభాకార్యక్రమం ప్రారంభమౌతుంది. అధ్యక్షుని పీఠమెక్కించి కార్యకర్తలు స్వాగతవచనాలు చెబుతారు. ఈ సందర్భంలో అధ్యక్షులను సభవారి కెరుకపరడం జరుగుతుంది. తర్వాత సభాప్రారంభకులను నియమించినచోట వారిని పరిచయం చేయడమూ, వారుపన్యాసం చెప్పడమూ వుంటుంది. అప్పుడు అధ్యక్షుడు తన ప్రారంభోపన్యాసాన్ని చేస్తాడు. ఇందులో అధ్యక్షుడు తాను చెప్పదలచుకొన్న విషయాలను పూర్తిగా వివరిస్తాడు. తర్వాత కార్యదర్శి నివేదికను చదువుతాడు. గడచిన సంవత్సరంలో గ్రంథాలయం సాగించిన కార్యక్రమాన్ని, సంపాదించి ఖర్చుపెట్టిన మొత్తాలను యీ నివేదికలో కార్యదర్శి వివరిస్తాడు. గ్రంథాలయ నిర్వహణంలో యేర్పడ్డ చిక్కులను తెలిపి, వీటి నివారణకై కార్యవర్గంవారు చేసిన ప్రయత్నాలను వెల్లడిస్తాడు. తాముపొందినసాయములను జాబితాలరూపకంగానూ పేరుగానూ యిస్తాడు. గ్రంథాలయానికి సహాయంచేసిన దాతలకు కృతజ్ఞతను తెలుపుతాడు. ముందుకు గ్రంథాలయం అభివృద్ధికరంగా నడవడానికి కావలసిన అవసరాలను పేర్కొంటాడు. వీటిని తీర్చేకొరకై విజ్ఞప్తి చేస్తాడు.

తర్వాత ఉపన్యాసాలు, వైజ్ఞానిక కార్యక్రమాలు మొదలవుతాయి. ఇవన్నీ పూర్తియైనతర్వాత చివరకు అధ్యక్షుడు కార్యదర్శి నివేదికను సమీక్షచేస్తాడు. ఉపన్యాసకుల ప్రసంగాలలోని విశేషాలను సంగ్రహంగా చెబుతాడు. గ్రంథాలయనిర్వహణం అభి

వృద్ధికరంగా సాగేనిమిత్తం సహాయపడమని సభికులను హెచ్చరిస్తాము. క్రొత్త సంవత్సర కార్యక్రమానికి దోహదంగా వుండేటందుకై సభలోనే కట్నాల చదివింపుకు, వాగ్దానాల ప్రకటనకు ఇది మంచి సమయం. ఇటీవల యీవిధానాన్ని చాలా గ్రంథాలయాల వారవలంబిస్తున్నారు. ఈపని పూర్తయినతర్వాత అధ్యక్షులకూ, ఉపన్యాసకులకూ, వార్షికోత్సవసభ జయప్రదంగా జరగడానికి కారణభూతులైనవారందరికీ పేరుపేరున వందనాలను సమర్పించడంతో అధ్యక్షుడు సభను ముగిస్తాడు.

## నివేదిక

వార్షికోత్సవ కార్యక్రమంలో తక్కినదంతా ఒకయెత్తూ, నివేదిక ప్రకటన మొకయెత్తూ. గ్రంథాలయ సేవనుగూర్చి, గ్రంథాలయ ప్రయోజనాన్నిగూర్చి ప్రజలకు తెలియజెప్పడమే నివేదిక ప్రధానోద్దేశం. కనుక నివేదికకాలంలో జరిగిన ముఖ్యవిషయాలనెన్ని ప్రజలకు రుచించేలాగు దీనిలోచేర్చాలి. నివేదికలు చేటభారతంలాగుంటే వినేవారికి విసుగుపుడుతుంది. అందువలన వీటిని వీలైనంత సంగ్రహంగా వుండేలాగు తయారుచేయాలి. ఒక్కొక్క పాఠకుడూ గ్రంథాలయంనుండి తడవకు యెన్నిపుస్తకాలను అరువు తీసుకోవచ్చునో, వీటినెంతకాల మతడు తనదగ్గర వుంచుకోవచ్చునో, ఎక్కువ గిరాకీగల పుస్తకాలు కావలసినప్పుడు లభించవు గనుక ముందుగా వీని నెట్లు రిజర్వుచేసుకోవచ్చునో, స్త్రీలశాఖ, బాలశాఖ, ఆచూకీశాఖ, పఠనాలయముల యేర్పాట్లు, పొరుగూరి వారికి పోస్టుద్వారానూ ఇతర విధాలా పుస్తకాల నందజేయడం, ఇతర సంస్థల సమావేశాలను గ్రంథాలయంలో జరుపుకోడానికిగల అనుకూలాలూ, పుస్తకాల జాబితాల నిర్మాణంలో నూతనపద్ధతులూ (కార్డు కేటలాగు), గ్రంథాలయంలోని పుస్తకాలను అరువు తీసుకోగోరే వారి అర్హతలూ, ఉచితంగా అందరినీ సేవించాలన్న వుద్దే

వుండి. అచ్చుఖర్చులు భరించలేనివారు సైక్లోస్టయిల్ మెషీనుపై కావలసిన ప్రతులను తయారుచేస్తారు. సభ్యులకూ, ఇతర దాతలకూ, అభిమానులకూ, అవకాశాన్నిబట్టి వీలైనంతమంది యితరులకూ వీటిని అందజేస్తారు. ఈవిధంగా నలుగురికీ అందజేసే నివేదికలు ఆకర్ష ణీయంగా లేకుంటే వీటిని విప్పి చదవడాని కెవ్వరూ పూనుకోరు. కనుక అందచందాల అమరిక క్రమంగా వుండడానికి తీసికోవలసిన చర్యలను తెలుసుకోవడ మవసరం.

ముఖపత్రంపైన మధ్యగా గ్రంథాలయభవనపు చిత్రమున్నా, పైనా క్రిందా స్ఫుటమైన అక్షరాలలో గ్రంథాలయంపేరూ, నివేదిక సంవత్సర వివరమూ, ఇంకా ముఖ్యంగా చేర్చవలసిన ఒకటి రెండు మాటలూ చేర్చి వెనుకపుటలో గ్రంథాలయపాలకవర్గం జాబితాను చేర్చడం బాగుంటుంది. ముఖపత్రంపైన గ్రంథాలయ ప్రాశస్త్యాన్ని వర్ణించే చిన్నపాటగాని పద్యంగాని వాక్యంగాని చేర్చడానికి వీలుంటే అట్లు చేయవచ్చు. నివేదిక చివరపేజీలో గ్రంథాలయోద్దేశాలనుగాని, గ్రంథాలయ కార్యక్రమంలోని విశేషాంశాలనుగాని చేరిస్తే చాలా ఆకర్షణీయంగా వుంటుంది.

నివేదికలో చేర్చదగిన అంశాలను సాధారణంగా క్రింది క్రమంలో వ్రాస్తారు. ఉపోద్ఘాతం లేదా తొలిపలుకులు, సభ్యుల వివరాలు, నిర్వాహక సంఘాల సమావేశాలు, పఠనాలయము, పత్రికాపాఠకులు, పుస్తకాల ఉపయోగం, స్త్రీ బాలశాఖలు, ఆచూకీ శాఖ, గ్రంథాలయపక్షాన జరిగే సభలు సమావేశాలు మొదలైన కార్యక్రమం, విరాళాలు, ఆర్థిక విషయాలు, ముగింపుమాటలు. ప్రస్తావవశంగా తెలిపే లెక్కలను ఆయా విషయాలతో జోడిస్తారు. విషయాలకు సంబంధించిన బొమ్మలనుకూడ నివేదిక మధ్యలో సందర్భానుసారంగా చేరుస్తారు. ఈవిధానం నివేదికకు అందాన్ని చేకూర్చడంతోపాటు దీనినందరూ చదవడాని కవకాశమేర్పడుతుంది.

నివేదిక ప్రధానభాగంలో చేర్చడానికనుకూలంగాని దిగువ పట్టికలను చివరిభాగంలో అనుబంధాలలో చేర్చడం సాంప్రదాయంగా యేర్పడింది. సభ్యుల జాబితా, దాతలపట్టిక (విరాళాల వివరాలతో), పత్రికలజాబితా (గ్రంథాలయానికి తెప్పించినవి), సభలు–సమావేశాల వివరాలు, గ్రంథాలయ పూర్తినిబంధనలు, ఆదాయవ్యయపట్టిక, ఆస్తి అప్పుల పట్టిక వగైరా నివేదికచివరను వేరువేరుగా చేరుస్తారు. నివేదికలోనే వీటిని చేర్చేపక్షంలో చదువుకొనేవారికి జాబితాలు ఆకర్షణీయంగావుండని కారణంచేత నివేదికల నెవ్వరుగాని సాంతంగా చదవరు.

నివేదికను అచ్చువేసే సందర్భంలో విషయ మెంతప్రధానమో అచ్చు ముచ్చటలుకూడ అంత ముఖ్యమే. అక్షరాల కూర్పూ, కాగితం రంగూ, బొమ్మలూ అన్నీ చక్కగా వుంటేనే నివేదిక బాగుంటుంది. మాటలమధ్యనుండే స్పేసులు యెక్కువ తక్కువలు లేక సమంగా వుండాలి. పంక్తులమధ్య తగినంత స్థలమూ, పేజీల చుట్టూ వుండవలసినంత ఖాళీప్రదేశమూ (మార్జిన్) లేకుంటే పేజీలలోని అక్షరాలు అలికినట్లుండి అందాన్ని చెరుస్తాయి.

నివేదికలోని అక్షరాలు స్ఫుటంగా కనపడేవిగావుండాలి. పంక్తులపొడవు జాస్తిగా వుండకూడదు. అలావుంటే వీనిని చకచక చదవడానికి వీలుండదు. అలవాటులేని టైపులు నివేదికలో చేర్చడం గజిబిజికి కారణమౌతుంది. అనుబంధాలకు అవసరాన్నిబట్టి చిన్న టైపులను వాడినా, నివేదిక ప్రధానభాగాన్ని గ్రేట్ ప్రైమరువంటి బాగా వాడుకలోనున్న టైపులనే ఉపయోగించడం మంచిది. అనుకూలమైన టైపులను వాడడమే గాక పంక్తులమధ్య బాగా యెడముండేలాగు సీసపుబద్దెలను (Leads) విరివిగా ఉపయోగించేయెడల అక్షరాలుబాగా స్ఫుటంగా కనబడతాయి.

నివేదిక అచ్చుకుపయోగించే కాగితం కేవలం తెల్లగావుండే కంటె సూక్ష్మమైన తేలికరంగు పాలు కలదిగా వుండడంమేలు. కాగితంరంగుకు అనుకూలమైన సిరానువాడడంకూడా అవసరం. తేలికరంగు కాగితాలపై ముదురురంగు సిరాలనువాడితే అచ్చుబాగా పడుతుంది. ఫోటోబ్లాకుల అచ్చుకు నునుపైన ఆర్టు కాగితాలు కావాలి. గీతలబొమ్మలకు మామూలు రఫ్ కాగితం సరిపోతుంది. నివేదిక అచ్చుకుకూడ గ్లేజుకాగితంకంటె కొంచెం గరుకుగావుండే సాదాకాగితమే అనుకూలంగా వుంటుంది. తళతళలాడే తెల్లనినునుపు కాగితంపైన అచ్చువేసిన అక్షరాలను చదివేటప్పుడు కంటికి కొంత శ్రమ కలుగుతుంది. సాదా తెలుపు కాగితంపైని అక్షరాలు చదివేటప్పు డీయిబ్బంది అంతగా కనపడదు.

నివేదికను చూడడంతోనే దానివైపుకు జనుల దృష్టి మర లాలి. చేతబట్టి పైఅట్టపేజీ త్రిప్పడంతోనే ఉపోద్ఘాతంలోని వాక్యాలు వారికి రుచికరంగా వుండాలి. వరుసగా చదువుతూపోతే దానిని ముగించేవరకూ విడువకూడదనే ఆసక్తి పాఠకులకు కలగాలి. లోపలి విషయాలూ, భాషా – రెండూ చక్కగా వుంటేనేతప్ప యెవ్వరునూ నివేదికను సాంతంగా చూడడం సంభవించదు. కనుక అనుభవజ్ఞులైన వారు తయారుచేసిన నివేదికలనుచూచి ప్రతిగ్రంథాలయంవారూ నివేదికను తయారుచేసే కళను అభ్యసించి సాధించాలి. అప్పుడే వీటి ప్రయోజనం సిద్ధిస్తుంది. గ్రంథాలయాలకు చక్కని చేయూత లభిస్తుంది.

●

# సారస్వతపట్టిక

ఈ గ్రంథములోని వ్యాసముల రచనకు తోడ్పడిన

సారస్వతము

Arthur E. Bostwick (Ed):
Pópular libraries of the world

S. R. Ranganathan:
Library administration
Five laws of library science
Referencce servie and bibliograply Vol. I

James Duff Brown:
Manual of library economy

L. Stanley Jast :
Libraries and living

B. M. Headicar :
Manual of library organisation

H. W. Wilson Company :
Publicity primer

American Library Association :
Publicity for small libraries

Lionel R. Mc Colvin :
Library Extension work and publicity
... The Library Miscellany Vol. I
... The Modern Librarian, Vol. XI
... Lectures delivered by Dr. M. O. Thomas in the Summer School of Library science conducted by the Andhra University in 1934 & 1935.

Duncan Gray :

County library systems : Their history, organisation and administration.

... County rural libraries.

... Hand book of the Public Library, Bangalore

పాతూరి నాగభూషణం :

గ్రంథాలయములు : రిజిస్ట్రేషను

గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు

యాతగిరి లక్ష్మీ వెంకటరమణ :

గ్రంథాలయోద్యమము

ధర్మగ్రంథాలయ పత్రిక. సంపుటము ౧

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము:

౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సంచిక

వివిధ గ్రంథాలయముల నిబంధనలు:

సేవాశ్రమ వాణీమందిరము, పెదపాలెము

సారస్వతనికేతనము, వేటపాలెము

Andhra University Library, Waltair

Adyar Library, Madras

శంతో గ్రంథాలయం పనిచేస్తున్న సంగతీ, ఇట్టి మరికొన్ని అంశాలూ నివేదికకు నిండుతనాన్ని చేకూరుస్తాయి. పుస్తకాల ఉపయోగం పెంచడానికీ ఉపయుక్త పఠనం వైపుకు పాఠకులను మరల్చడానికీ తీసుకొన్న చర్యలూ, గ్రంథాలయం సంపాదించే పుస్తకాలు పాఠకుల వాంఛలను తీర్చడాని కెంతవర కనుకూలించినదీ, గ్రంథాలయం క్రింద వెచ్చిస్తున్న ధనానికి తగిన ఫలితం చేకూరుతున్నదీ లేనిదీ మొదలైన గ్రంథాలయ నిర్వహణానికి సంబంధించిన రకరకాల యేర్పాట్లను నివేదికలో చేర్చడం ప్రయోజనకారి. కేవలం గత సంవత్సరంలో జరిగిన కార్యక్రమాన్ని వివరించడంతో నివేదికను పూర్తి చేయక గ్రంథాలయ ప్రధానోద్దేశాన్నీ, భవిష్యదవసరాలనూ దీనిలో చేర్చిన పక్షంలో ప్రజల ఆమోదం, సహాయం లభించడాని కవకాశమేర్పడుతుంది. నివేదికలో గ్రంథాలయానికి చేరిన సహాయాలను తెలిపి దాతలకు కృతజ్ఞత తెలపడం, వారిని ప్రశంసించడం ఉపయుక్తమైన పద్ధతి. ప్రజల మనస్తత్వాని కనుకూలించే భాషలో గ్రంథాలయ పూర్వచరిత్రను స్మరించడంకూడ అవసరమే.

పైనచెప్పిన విషయాలను వివరించడానికి అంకెలు బాగా ఉపయోగిస్తాయి. ఆదాయ వ్యయాలు, ఆస్తి అప్పు పట్టికలతో పాటు గ్రంథాలయ పరిస్థితులను విశదీకరించే అంకెలుకొన్ని నివేదికకు జీవాన్ని కల్పిస్తాయి. అని చెప్పి నివేదికనంతా అంకెలమయం చేయరాదు. వట్టి అంకెల వరుసలు ఆకర్షణీయంగా వుండవు. ఒక విషయాన్ని విపులీకరించేనిమిత్తం ఉదాహరణక్రింద స్వల్పంగా అంకెలనివ్వడం బాగుంటుంది. ఈపద్ధతిమూలంగా గ్రంథాలయ పరిస్థితిని కన్నులకు కట్టినట్లు తెలపడమవుతుంది. ఈ అంకెల నివ్వడంలో వెనుకటి సంవత్సరాల లెక్కలను నివేదికసంవత్సరం లెక్కలతో సరిపోల్చడంద్వారా గ్రంథాలయం అభివృద్ధిని చక్కగా చూపవచ్చు.

## నివేదికలో చేర్చదగిన లెక్కలు

I పుస్తకాలు: సంఖ్య విలువ

నివేదిక సం॥ ప్రారంభంలోనున్న పుస్తకాలు

,, లో చేర్చిన పుస్తకాలు

,, లో తొలగించిన పుస్తకాలు

,, కడపటనున్న పుస్తకాలు

,, ,, (భాషలవారీగా)

,, లో చేర్చిన పుస్తకాలు: సంఖ్య విలువ

గ్రంథాలయం కొన్నవి

ధర్మంగా వచ్చినవి

II సభ్యులు:

స్త్రీలు పురుషులు (తరగతులవారీగా)

III పాఠకులు:

స్త్రీలు పురుషులు పిల్లలు

IV నివేదిక కాలంలో చదువబడిన పుస్తకాలు (తరగతివారీగా)

గ్రం.లో చదివినవి ఇండ్లకు తీసికొనిపోయినవి మొత్తం

V గ్రంథాలయానికి తెప్పించిన పత్రికలు:

భాషలవారీ, తరగతివారీ (దిన, వార, పక్ష, మాస వగైరా)

VI పత్రికా పాఠకుల దినసరి సగటు హాజరు.

నివేదికను వార్షికోత్సవ సందర్భంలో చదివితే కేవలం సభకు వచ్చేవారికి మాత్రమే విషయాలు తెలుస్తాయి. కనుక సభకు రాలేనివారికికూడ నివేదిక అందేటందుకై దీనిని అచ్చువేసే ఆచారం